# చేగొండి కథా కదంబం



చేగొండి రామజోగయ్య



యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
హైదరాబాదు

# చేగొండి
# కథా కదంబం

**చేగొండి రామజోగయ్య**




రిజిస్టర్డ్ నెం. 1/64

**యువభారతి**

సాహితీ సాంస్కృతిక సంస్థ
ఆంధ్ర సారస్వత పరిషత్తు భవనములు
తిలక్ రోడ్డు, హైదరాబాదు-500 001

# చేగొండి
# కథా కదంబం


| | | |
|---|---|---|
| ప్రచురణ | : | యువభారతి |
| ప్రచురణ సంఖ్య | : | 172 |
| ప్రథమ ముద్రణ | : | ఏప్రిల్, 2008 |
| ప్రతుల సంఖ్య | : | 1000 |
| అక్షరాల కూర్పు | : | ఎం.మధుసూదనరెడ్డి |
| వెల | : | 50 రూపాయలు |
| ప్రతులకు | : | 1. యువభారతి, C/o ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు, తిలక్ రోడ్, హైదరాబాద్–500,001<br>2. రచయిత, బి I బ్లాక్– ఫ్లాట్ నెం. 2, శాంతి శిఖర అపార్టుమెంట్స్ సోమాజిగూడ– హైదరాబాద్, ఆం.ప్ర. 5000082 ఫోన్: 040–23323776 సెల్: 9391007780<br>3. అన్ని ప్రముఖ పుస్తక విక్రయ కేంద్రాలలో |
| ముద్రణ | : | విప్ల కంప్యూటర్ సర్వీసెస్ (డిజైనర్స్ & మల్టీకలర్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్) నల్లకుంట, హైదరాబాద్– 500 044. ఫోన్: 27676910, 27654003, 27677078 |

# అంకితం



**శ్రీ దిట్టకవి చక్రపాణి**

ఐ.ఏ.ఎస్

నిబద్ధతకు నిజాయితీకి సమర్ధతకు నిలువెత్తు రూపం. ఎందరికో స్ఫూర్తి ప్రదాత. నేను సుదీర్ఘ విరామం తర్వాత రచనలు పునఃప్రారంభించడానికి ప్రోత్సాహమిచ్చిన శ్రీ దిట్టకవి చక్రపాణి ఐ.ఏ.ఎస్. గారికి ఈ కథల పొత్తం అంకితం.

**- చేగొండి రామజోగయ్య**

# మా మాట

ప్రతి వ్యక్తిలోనూ అంతర్లీనంగా ఏదో ఒక ప్రతిభ ఉంటుంది. ఆదరణ, అవకాశం, ప్రోత్సాహం ఇచ్చి ఆ వ్యక్తిలోని ప్రతిభా సామర్థ్యాలను సామాజికోన్నతికి దోహదమయ్యే విధంగా తీర్చి దిద్దడం ఎంతైనా అవసరం. ఈ ఆశయంతోనే నలభై సంవత్సరాల క్రితం యువభారతి సంస్థ ఆవిర్భవించింది. చుట్టూరా ఆవరించుకుని ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం కంటే ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నయినా వెలిగించడం మంచిది అన్న స్ఫూర్తిని ఊపిరిగా చేసుకుని యువభారతి సంస్థ సాహితీ సాంస్కృతిక రంగాలలో కృషి చేస్తున్నది. యువకులలో సాహిత్య పఠనాభిలాషను, సువచోరీతిని, రచనా సామర్థ్యాన్ని పెంపొందించి వారి వ్యక్తిత్వ వికాసానికి, ప్రోత్సాహమందిస్తూ ముందుకు సాగుతున్నది యువభారతి.

శ్రీ చేగొండి రామజోగయ్య గారికి యువభారతితో నలభై సంవత్సరాల అనుబంధం. ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర సహకార బ్యాంకులో దాదాపు నాలుగు దశాబ్దాలు ఉద్యోగించి చీఫ్ జనరల్ మేనేజర్‌గా ఈ మధ్యనే పదవీ విరమణ చేశారు. యువభారతీయులైనప్పటి నుంచి తన రచనలను అభిప్రాయాలను యువభారతి పక్ష సమావేశాల్లో వినిపించారు. యువభారతి సాహిత్య కార్యక్రమాల్లో ఉత్సాహంగా, ఉల్లాసంగా పాల్గొని, సంస్థ కీర్తి పతాకను పైకి ఎగరవేయడానికి కృషి చేసిన ముఖ్యుల్లో ఒకరయ్యారు. ఎంతో ఉన్నత పదవిలో ఉన్నా నిరాడంబరంగా కనబడే వ్యక్తి సంస్కార హృదయులు. గంభీరంగా కనబడినా అందరితో కలుపుగోలుగా ఉంటూ, చిరునవ్వే ప్రధాన ఆభరణంగా చేసుకున్న వ్యక్తి. యువభారతిలో చేరిన తరువాత ఒక దశాబ్దం పాటు ఆయన చేసిన రచనలు ప్రముఖ పత్రికల్లో ప్రచురింపబడ్డాయి. ఈ మధ్యనే మరల తన రచనా వ్యాసంగాన్ని కొనసాగించారు. జోగయ్యగారి వ్యాసాలు, కథలు, ఆంధ్ర ప్రభ, నవ్య మొదలైన దిన, వార పత్రికల్లో ప్రచురింప బడ్డాయి. వారు తమ కథలను యువభారతి ప్రచురణగా తీసుకు వస్తున్నందులకు అభినందిస్తూ ముందు ముందు మరెన్నో మంచి కథలను రాయాలని యువభారతి కోరుకుంటున్నది.

మాడభూషి అనంతాచార్యులు
అధ్యక్షుడు, యువభారతి

సర్వధారి, ఉగాది
7-ఏప్రిల్, 2008

# 'సరదా'గా సాగే కొంటె కథలు

చేగొండి రామజోగయ్య గారిని నాకు-కవిరాజుగారికి అనంతం పరిచయం చేశారు. మీ రచనలు ఎప్పట్నుంచో చూస్తున్నాను. టీ.వీ.లో మీ సంభాషణలు వింటున్నాను. మీ రచనలు నాకు ఇష్టం అని జోగయ్యగారు అన్నప్పుడు సంతోషం కలిగింది. నాకంటే వయసులోనూ, అనుభవంలోనూ ఆయన చాలా పెద్దవారు.

ఆ తర్వాత జోగయ్యగారు తన కథల సంపుటిని ప్రచురిస్తున్నారని తెలిసి ఆనందం కలిగింది. ఏ రచయిత అయినా తన రచనలను పుస్తక రూపంలో చూసుకోవాలనుకుంటారు. అయితే నా కథల సంపుటికి పరిచయ వాక్యాలు మీరే రాయాలన్నప్పుడు మాత్రం సంశయానికి లోనయ్యాను. చాలా మంది పెద్దలు ఆయన పరిచయం ఉంది కదా అని. ఏమైనా జోగయ్యగారి అభిమానమే నన్ను ముందుమాట రాయిస్తోంది.

'రచన' రచయితలకు ఔట్‌లెట్. రచయితలు తమ భావాల్ని ఇతరులతో పంచుకోవడానికి, తమను తాము వెతుక్కోవటానికి, అలాగే వస్తున్న విషయాలను ప్రచురణ చేయటానికి, పాఠకులను ఆహ్లాదకరమైన వినోదాన్ని అందించటానికి, ఇలా అనేక కారణాలతో రచన చేస్తారు.

కొంతమంది రచనను వృత్తిగా స్వీకరిస్తే- మరికొందరు ప్రవృత్తిగా స్వీకరిస్తారు. జోగయ్యగారు 'రచన'ను ప్రవృత్తిగా మాత్రమే తీసుకున్న రచయిత. ఈ సంపుటిలో 13కథలు ఓ స్కెచ్ ఉన్నాయి.

'రవికె **Vs** లుంగీ' కథ చూడగానే ఇదేదో శృంగారకథ అనిపిస్తుంది. కానీ కాదు. చదవటం మొదలు పెట్టాక ఇందులోహాస్యం గిలిగింతలు పెడుతుంది. ముఖ్యంగా హ్రస్వనామాల మీద మనందరం జీవితంలో ఒక్క సారైన మనసారా నవ్వుకున్న సందర్భాలు గుర్తుకు వస్తాయి.

'శృంగార భూతం' కథలో ఓ ప్రొఫెసర్ గారు తన భార్యకి దెయ్యాలు వున్నాయని తన పరిశోధనా సారమంతా రంగరించి వాదించినా ఆమె నమ్మదు. అప్పుడు దెయ్యం వచ్చి ప్రొఫెసర్ గారి భార్యతో కొంతసేపు ఏకాంతంగా గడపాలంటుంది. ప్రొఫెసర్ గారికి కోటి రూపాయల 'వరం' ఇస్తుంది. ఈ కథ " ప్రొఫెసర్‌కి అనుమాన భూతం పట్టుకుంది'' అని ముగుస్తుంది. మనం ఏం

చెప్పాలనుకుంటున్నామో అది ముందు మనం నిర్ణయించుకోవాలి. కొసమెరుపు కోసం చేసే ప్రయత్నాలు ఒక్కోసారి కథనాన్ని ప్రభావితం చేస్తాయి. ఆ దెయ్యంతో గడిపి వచ్చిన ప్రొఫెసర్ భార్య ముఖంలో తృప్తి. గురించి రచయిత వర్ణించటంలో కొంటెతనం ఉంది. ఇదే కొంటెతనం 'భలే కవలలు' కథలోనూ, అఘాయిత్యం కథలోనూ కనిపిస్తుంది. కవలలు ఎలా పుడతారు, వారి మనస్తత్వాలు ఎలా రూపొందుతాయి, అనే విషయం గురించి రచయిత మొదటి కథలో విపుల చర్చ చేశారు.

ఈ సంపుటిలో ఒకే అంశం గురించి రాసిన మూడు విభిన్నమైన కథలున్నాయి. పిల్లలు చిన్నవారుగా ఉన్నప్పుడు తల్లి మరణిస్తే పిల్లల కోసం ఇంకో వివాహం చేసుకోని తండ్రి తర్వాతి కాలంలో పెళ్లి చేసుకోవటం అనేది ఇతి వృత్తం. 'కృతిభర్త' అంటే ఏమిటో తెలియకుండా తండ్రిని అపార్థం చేసుకున్న అమ్మాయి, తను అన్యాయం చేసిన అమ్మాయికి తండ్రి కొత్త జీవితం ఇచ్చినట్లు తెలుసుకున్న ఓ అబ్బాయి ఇందులో కనిపిస్తారు. అలాగే ఇలాంటి వివాహాల మీద విదేశాల్లో ఎలాంటి పరిస్థితి వుందనేది మూడు కథల్లో విపులంగా చర్చిస్తారు.

ఇటీవల సంచలనం కలిగించిన ఓ హత్యకు చెందిన ఉదంతాన్ని మరో కోణంలో ఊహించి 'నీరజ నిర్దోషి' కథను రాశారు. కాంతం...కనకం... ఆడమనసు మంచి కథ. అయితే ఆడమనసు అని ప్రత్యేకంగా వుండదు. అలా అనుకోవటం మామూలయింది. టీ.వీ.సీరియల్స్ మీద, అక్షర తృతీయ నమ్మకాల మీద ఈ కథల్లో చాలా చురకలున్నాయి. జోగయ్యగారు రచనని సీరియస్‌గా తీసుకుని వుంటే బాగుండేదనిపించింది. ఎందుకంటే ఆయనతో మాట్లాడినప్పుడు కనిపించిన అనుభవం, విశ్లేషణ...ఫిలాసఫీ ఈ కథల్లో అంతగా లేవు. పాఠకులు చదివి ఆనందించటానికి ఈ కథలు పనికొస్తాయి. రచయితలకు కొన్ని పరిధులుంటాయి. వారి ప్రతిభకు పరిమితులుంటాయి.

రామజోగయ్యగారు మాత్రం తన ప్రతిభకు తానే పరిమితులు ఏర్పరుచు కుంటున్నట్లు అనిపించింది. లేని పక్షంలో ఆయన ఇంకా చాలా మంచి కథలు రాయగలరని నా నమ్మకం

**పి.చంద్రశేఖర్ ఆజాద్**

27-3-2008

హైదరాబాద్

# విషయ సూచిక





# కృతజ్ఞతలు

రచనా వ్యాసంగంలో నన్ను ప్రోత్సహించిన ఎందరో మహానుభావులకు, అందులో ప్రధానంగా ఈ పుస్తకం ముద్రణ, ఆవిష్కరణలో తోడ్పడిన

శ్రీ దిట్టకవి చక్రపాణి, ఐ.ఏ.ఎస్,

ఆచార్య వంగపల్లి విశ్వనాథం (యువభారతి సమావేశకర్త),

శ్రీ మాడభూషి అనంతాచార్యులు (యువభారతి అధ్యక్షులు),

శ్రీ రెడ్డి రాఘవయ్య (యువభారతి కార్యదర్శి),

శ్రీ మలపాక పూర్ణచంద్రరావు (యువభారతి కోశాధికారి),

శ్రీ చంద్రశేఖర్ ఆజాద్,

శ్రీ మధుసూదనరెడ్డి,

శ్రీ పి.వి.యమ్ రామజోగయ్య (విజయవాడ),

డా॥ పి.వి.వి. సత్యనారాయణమూర్తి, (విజయవాడ),

శ్రీ చేగొండి వీర వెంకట సత్యనారాయణ మూర్తి (దొడ్డిపట్ల),

శ్రీ వడ్డె రామానుజరావు (నర్సాపురం) గార్లకు

హృదయ పూర్వక కృతజ్ఞతలు

– రచయిత

• చుట్టూరా ఆవరించుకుని వున్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం కంటె, ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నయినా వెలిగించడం మంచిది •



# రవికె Vs లుంగీ

ఒకళ్ళనొకళ్లు కసిగా చూసుకుంటూ, ఉక్రోషంగా ముక్కుపుటా లెగరేస్తూ, కోపంగా పిడికిళ్ళు బిగించుకొంటూ తన టేబిల్ కిరువైపులా పందెం కోళ్లలా, నిలబడి వున్న రవి, గీతను 'మళ్లీ ఏమొచ్చిందర్రా' అన్నట్టు విసుగ్గా చూసారు ప్రిన్సిపాల్ సార్ – ఆయనకెదురుగా కూర్చుని ఉన్న వైస్ ప్రిన్సిపాల్గారు; – "ఇదెప్పుడూ ఉండే 'బాగోతమే' కదా, మీరేమీ గాబరా పడకండి" అన్నట్టు భుజాలెగరేస్తూ పెదాల మధ్య నాలిక చప్పరించారు.

"ఈసారి మీరు ఏక్షన్ తీసుకోకపోతే, నేనూర్కోను సార్! నేనేకాదు, మా గర్ల్ స్టూడెంట్సంతా ఏకమై ఎదురుతిరుగుతాం!" ముందుగా అంది ఫైనల్ ఇయర్ స్టూడెంట్ మునిసిపల్ చైర్మన్గారి గారాల పట్టి గీత –

"ఔను సార్! ఏక్షన్ తీసుకొని తీరాలి మీరు – ఆడది ఇలా బరితెగించిపోతుంటే ఊర్కోడానికి మా మగ స్టూడెంట్లలో ఒక్కడు కూడా సిద్ధంగా లేడు సార్" వెంటనే అరిచాడు మరో ఫైనలియర్ స్టూడెంట్ స్థానిక ఎమ్మెల్యే గారి ముద్దుల మేనల్లుడు రవి –

మున్సిపల్ చైర్మన్గారు, ఎమ్మెల్యేగారు రాజకీయంగాను, ఇతరత్రాను ఎంతో సఖ్యతగా ఉంటూంటే వాళ్ల వారసులు – రవి, గీత రోజుకో సారైనా పోట్లాడుకొంటూ ఉప్పూ, నిప్పులా ఎందుకుంటారో ఎవరికీ అర్థం కాదు!

"ఆడదెయ్యాలకి అలుసిస్తే..." ఇంకా ఏదో అనబోతుంటే వెంటనే 'గయ్'మని లేచింది గీత–

"ఏయ్! మాటలు సరిగా రానీయ్... లేకపోతే రవికె చింపేస్తాన్..." సున్నీ బిగించుకొంటూ అరిచింది –

"ఆ! అలాగేం... నేను లుంగీ ఉతికిపారేస్తాన్..." సమఉజ్జీగా అభినయించాడు రవి...

"నీ మొహం! పనసకాయల తొక్కనయం..."

"నీ మొహం - సగం ఉడికిన చిలగడ దుంప-"

"నోర్మూసుకోరా, కోతిమూతి రవికే-"

"నువ్వే మూస్కోవే - చుప్పనాతి లుంగీ-"

రవికె ఏమిటో, లుంగీ ఏమిటో అర్థం చేసుకోలేకపోయిన ప్రిన్సిపాల్‌గారు, ఇద్దరికీ సర్దిచెబుదామనుకొనేలోగానే ప్రత్యర్థుల మధ్యన ఇన్ని మాటల తూటాలు పేలిపోయాయి. పరిస్థితి విషమించుతోందని అర్థమైన ప్రిన్సిపాలుగారు ఇక తన పెద్దరికం నిలబెట్టుకోవాలని నిర్ణయించుకొని "సైలెన్స్ ఇద్దరూ నోర్మూయండి! మీరిలా కల్లు తాగిన కోతుల్లాగ కొట్టుకొంటుంటే మధ్యన మేమెందుకు?-" అని అరిచి అలవాటుగా బెల్ కొట్టబోయి, తన అరచేతిని పిన్ కుషన్‌మీద బాది 'కుయ్యో'మని ఇంకా గట్టిగా అరిచారు. అరిచేతి మీద ఊదుకొంటూ - తనే సైలెన్సయిపోయారు కాసేపు-

"ఆ! జాగ్రత్త మాస్టారూ! అరిటాకు లాంటి మీ చేతికి ముప్పు తేవద్దండి - అరిచి బీపీ పెంచుకోవద్దండి! వీళ్లిద్దరి గొడవలు ఎప్పుడూ ఉండేవే కదా- కొత్తేముంది - నేను కనుక్కొంటాను లెండి... మీరుండండి.." తన పెద్దరికం చూపించుకొందామన్న దురదతో, రంగంలోకి దిగాడు వైస్ ప్రిన్సిపాల్‌గారు...

"ఆ... ఏమిటీ గొడవ... రవికె ఏమిటి... లుంగీ ఏమిటి... విషయం సరిగ్గా చెప్పేదండి... ఊ... లేడీస్ ఫస్ట్!...

థాంక్యూసార్ - మరేమో ఈ కుర్రాడి పేరు...

"ఏయ్ నేను కుర్రాణ్ణి కాదు..." రోషంగా గీత చెప్తున్నదానికి అడ్డం వచ్చాడు రవి.

"నువ్వాగవోయ్... నూనూగు మీసాలవాడివైనా చదువు పూర్తికానంతవరకు కుర్రాడివేలే" నువ్వు చెప్పమ్మా..."

"అయ్- ఈ కుర్రాడి పేరు.... రవి - కదాండీ... ఇంటి పేరు కల్లూరి... కె

ఫర్ కల్లూరి... రవి.కె.. కలిపి చదివితే 'రవికె' కదాండీ... అందుకే ఆడపిల్లలమంతా 'రవికె' అని ముద్దుగా పిలుస్తున్నామండి... తప్పాండీ.." గోముగా అడిగింది గీత.

"మరైతే లుంబాల గీతను 'లుంగీ' అని పిలుస్తూంటే ఈవిడకి ఉక్రోషం ఎందుకంటండీ?" వెంటనే అందుకొన్నాడు రవి.

"ఛీ! నాలాంటి ముగ్ధ మనోహరమైన ఆడపిల్లకు 'లుంగీ' అనే ముతకపేరేం నప్పుతుందండీ... లుంగీ ఏంటి అసహ్యంగా..."

"చక్కగా నప్పింది... లుంబాల గీతని యల్‌గీత... పీత అని పిలిస్తే ఏం బాగుంటుంది.. లుంగీ అంటేనే బాగా నప్పింది. కాని రవికె పేరు ఏమాత్రం నప్పలేదు. రవి... సంస్కృతపదం. కె... ఇంగ్లీషు అక్షరం... రెండూ కలిస్తే దుస్సమాసం కదాండీ..." సిన్సియర్‌గా అడిగేడు రవి –

"గాడిద గుడ్డులా వుంది వితండవాదం... ఆడలేక మద్దెల ఓడన్నట్లుంది..."

"ఏయ్... ఆగింక..."

"ఓయ్... తగ్గింక..."

అప్పటికి పిన్నులు గుచ్చుకొన్న అరచేతిని రుద్దుకోవటం పూర్తిచేసిన ప్రిన్సిపాల్‌గారు, వైస్‌గారి మీద ఆధిపత్యం నిలుపుకోవాలన్న సత్యం గుర్తుకువచ్చి ఏదో చెప్పబోతున్న ఆయన్ని, వారించి తనే రంగంలోకి దిగాడు.

"ఏయ్... ఇద్దరూ తగ్గండి... భారత రాజ్యాంగం, పౌరులందరికీ వాక్స్వాతంత్ర్యం ప్రసాదించింది. గీత, రవిని అదే రవి కల్లూరిని రవికె అని పిలవటం, అలాగే రవి, లుంబాల గీతను 'లుంగీ' అని పిలవటం వాళ్లిష్టం. పిలిచినప్పుడు పలుకకపోవడమే తగినమందు.. అసలు నన్నడిగితే స్పోర్టివ్‌గా తీసుకొని చిరునవ్వుతో పలకాలి ఎవరెలా పిలిచినా... సరదా పేర్లతో పిలిచినప్పుడు సరదాగానే తీసుకొంటే ఏ సమస్యా ఉండదు – ఈమాత్రం దానికి ఇంత యుద్ధం చేసుకోవాలా మీ ఇద్దరూ... నీకిష్టం లేని పేరుతో ఎవరన్నా పిలిస్తే నన్ను కాదన్నట్లుగా ముఖం తిప్పుకొని వెళ్లిపోతే, అవతలివాడు నోరు నెప్పి పెట్టి ఊరుకొంటాడు... అంతేగాని ఉక్రోషం పడిపోతే ఇంకా ఏడిపించడానికి వాడికే

కాదు అందరికీ ఛాన్సిచ్చినట్లువుతుంది –

"...ఊ... ఇదే నా తీర్పు. ఇద్దరూ పోండిక... ఫైనల్ ఎగ్జామ్స్ దగ్గరపడుతున్నాయి. బాగా చదువుకోండి.. వెళ్ళండిక..." తన జడ్జిమెంటుకి తనే మురిసిపోతూ హాస్యం మోడ్‌లోకి వచ్చేసిన ప్రిన్సిపాల్‌గారూ... వెళ్లమ్మా లుంగీ... నువ్వూ వెళ్లవయ్యా రవికె... వెళ్లు" అంటూ గట్టిగా నవ్వసాగేరు.

"అంతేనా..." అన్నట్లు రవి గీతలిద్దరూ తీవ్రంగా చూసినా...నదురూ బెదురూ లేకుండా, "అంతే అన్నట్లు నిశ్చయంగా తలూపేరు.

తోక ముడుచుకొన్న పిల్లుల్లా అయిపోయి తలలు వంచుకొని బయటికి దీనంగా పోతారనుకొన్నవాళ్లు, అలా ఏం చేయకుండా ఒకళ్ల ముఖంలోకి ఒకళ్లు నవ్వుకొంటూ చూసుకొంటూ, విజయోత్సాహానికి చిహ్నంగా బొటనవేలు పైకెత్తి ఆడిస్తూ హుషారుగా బయటికి వెళ్తుంటే చూసిన ప్రిన్సిపాల్ గారికి వైస్ ప్రిన్సిపాల్‌గారికీ కూడా అందులో ఏదో మర్మముందేమోనన్న ఆందోళన కలుగకపోలేదు. ఒకరి మొహం ఒకరు చూసుకొంటూ మౌనంగా ఉండిపోయేరు చాలాసేపు! కాని వాళ్ల ధోరణికి భాష్యం చెప్పుకోలేకపోయేరు ఎంత బుర్రబద్దలు కొట్టుకొన్నా!

అయితే సాయంత్రానికల్లా చిక్కుముడి విడిపోయింది! లాంగ్‌బెల్ కావడానికి కొంతసేపు ముందు, విద్యార్థులు చకచకా అన్ని నోటీసు బోర్డులలోను, అన్ని తరగతి గదుల గుమ్మాలముందూ, అంటించిన కంప్యూటర్ ప్రింటౌటు ప్రతి ఒక్కటి తెచ్చి ప్రిన్సిపాలుగారి కందించాడు జమేదార్ వెంకయ్య–

ఆ ప్రింటౌటులో ఇలా ఉంది...

"విద్యార్థి లోకానికి నమస్తే – ఈ ఏడు "తెలుగు అభివృద్ధి సంవత్సరం"గా ప్రకటించిన సంగతి మీకు తెలుసు – దీనికి మనవంతు ప్రోత్సాహం మనం కూడా ఇవ్వాలి – చాలామంది ప్రముఖులకు వారి పూర్తి పేర్ల కన్న పొడి పొడి అక్షరాల హ్రస్వనామాలే స్థిరనామాలుగా చలామణి అయిన సంగతి మీకు తెలుసు. ఉదాహరణకు గాంధీజీ ప్రియమిత్రుడు చక్రవర్తి రాజగోపాలచారిని సి.ఆర్. అని

ఎక్కువగా పిలిచేవారు. అలాగే వై.యస్., డీ.యస్, కే.సీ.ఆర్, ఎమ్ ఎస్సార్ అని పొడిపొడిగా పిలుచుకొంటున్నాం కదా – శ్రీరంగం శ్రీనివాసరావుని శ్రీశ్రీ అని పిలిచిన మాదిరి తెలుగు ప్రముఖులను తెలుగులోనే పొడి అక్షరాలతో పిలవటం సమంజసంగా వుంటుంది. మన ప్రిన్సిపాల్‌గారు కూడా పొడి అక్షరాలతో పిలవటం రాజ్యాంగబద్ధమైన హక్కు అని వాక్రుచ్చారు – కాబట్టి మన ప్రిన్సిపాల్‌గారిని ఇతర అధ్యాపక శ్రేష్ఠులను ఈ క్రింద చూపిన విధంగా పొడి అక్షరాలతో ప్రేమగా పిలవటం, మనం వారికీయదగిన గురుదక్షిణ అని సవినయంగా మనవి చేసుకొంటున్నాం – అంతేకాదు తేనెలూరు తెలుగు భాషను గౌరవించటం కూడా అవుతుందని విన్నవిస్తున్నాం.

| క్ర.సం. | పూర్తిపేరు | హ్రస్వనామం |
|---|---|---|
| 1. | శ్రీ కోటి తిరుపతి (ప్రిన్సిపాల్) | కోతి |
| 2. | శ్రీ గోల చిదంబరం (వైస్ ప్రిన్సిపాల్) | గోచి |
| 3. | శ్రీ కల్లూరి సిద్ధాంతి (మేథ్స్ లెక్చరర్) | కసి |
| 4. | శ్రీ కుర్రా రుద్ర పురుషోత్తం (కెమిస్ట్రీ) | కురుపు |
| 5. | శ్రీ కంబాల పురుషోత్తం (ఫిజిక్స్) | కంపు |
| 6. | శ్రీ జంపని తిరుమల కనకయ్య (తెలుగు) | జంతిక |
| 7. | శ్రీ పాకాల చిన్నయ్య (ఇంగ్లీష్ లెక్చరర్) | పాచి |
| 8. | శ్రీమతి కానూరి కిరణ్మయి (తెలుగు లెక్చరర్) | కాకి |
| 9. | శ్రీమతి చేకూరి పద్మ (కెమిస్ట్రీ లెక్చరర్) | చేప |
| 10. | శ్రీమతి కోలా కనకం (") | కోక |

గమనిక :– సప్లిమెంటరీ జాబితా త్వరలో ఇవ్వబడును. జై మనకాలేజీ... జైజై మన తెలుగుకీ...

తెలుగు వాళ్లమంతా తెలుగులో మాట్లాడుకొందాం. తెలుగు పేర్లతో పిలుచుకొందాం.

ఇట్లు
ఫలానా కాలేజీ విద్యార్థి బృందం

ఈ లిస్టును చదివిన ప్రిన్సిపాల్‌గారికి ఏం చేయాలో పాలుపోలేదు. 'రవి గీత లిద్దరూ కలిసి ఎంత నాటకమాడేరు' అని పళ్లు కొరుక్కున్నారు. అంతలోనే ట్యూబులైటు వెలిగి కాలేజీలో ఎక్కడెక్కడ అంటించారో జాగ్రత్తగా చూసి ఈ ప్రింటౌట్లను చింపేయమని సిబ్బందికి పురమాయించారు. రేపు రవి గీతలను ఇతర విద్యార్థి నాయకులను పిలిచి బతిమాలో, బామాలో విషయం సర్దుబాటు చేసుకుందామని అనుకొని భారంగా ఆలోచించుకొంటూ ఇంటిదారి పట్టారు ప్రిన్సిపాలుగారు, ఇతర లెక్చరర్లును -

కాని యువశక్తిది జెట్‌స్పీడని వాళ్లకప్పుడు అర్థంకాలేదు!!

మర్నాడు కాలేజీ టైముకు ముందే లెక్చరర్లు వచ్చేసి అమాంతం ప్రిన్సిపాలుగారి గదిలో సమావేశమయ్యారు.

"అయ్యా మనవాళ్లు మనకు పెట్టినపేర్లు... అదే నా బొంద హ్రస్వనామాలంటున్నారే, అవి బాగా ప్రాచుర్యమైపోయాయి. నిన్న సాయంత్రం టెన్నిస్ ఆడిన తర్వాత ఇంటికి వెళ్లేసరికి న్యూస్‌పేపర్ బోయ్ బిల్ ఇంట్లో ఇచ్చేసిపోయాడు. బిల్లిచ్చినందుక్కాదండి నా బొంద - బిల్లుమీద "గోచి"గారు, వైస్ ప్రిన్సిపాల్ ఫలానా కాలేజీ అని వ్రాసేడండి వెధవ... అని వాపోయాడు గోల చిదంబరం.

"నాకు కాలనీ వెల్ఫేర్ అసోసియేషన్ వాళ్లు జనరల్ బాడీ నోటీస్ "కురుపు" అన్న పేరుమీద పంపేరండీ - నేను రెండు సంవత్సరాలుగా సభ్యత్వ రుసుము కట్టడం లేదని దుగ్ధ కాబోలు"అని కుర్రా రుద్ర పురుషోత్తంగారు గద్గదస్వరంతో పలికేడు.

"వెధవది నాకొచ్చిన నోటీసు మీద 'జంతిక' అని స్పష్టంగా ఏడిచేరండి"

అంటూ దాదాపుగా ఏడిచేసారు జంపని తిరుమల కనకయ్య మేష్టారు. కంబాల పురుషోత్తంగారికి కూడా అలాంటిదేదో జరిగిందని ఆయన చెప్పకపోయినా ఆయన ముఖం చూస్తేనే అర్థమవుతోంది.

“ఇక్కడ ఎంతమంది వెధవలు నన్నెలాపిలిచినా లెక్కచేయనండి – కాని పొద్దున్నే పక్క జిల్లాల్లో ఉండే మాతోటికోడలు పనిమాలా ఫోనుచేసి “ఏంటక్కా మీ కాలేజీవాళ్లు నీకు “కాకి” అని పేరు పెట్టారంట కదా– వెధవది, బాధపడకు” అని పరామర్శించిందండి“ అని చెప్తూ నిజంగానే ఏడిచేసింది కానూరి కిరణ్మయి – ఆమె కొంచెం నల్లగానే ఉంటుంది. కొంత తెల్లగా ఉండే తోటికోడలి పరామర్శని తట్టుకోలేకపోయింది మరి. పాకాల చిన్నయ్యగారు ఇంకా రానందున ఆయనకెలాంటి అనుభవమయిందో తెలియలేదుగాని, మొత్తానికి లెక్చరర్లందరి పేర్లు – అవే విద్యార్థులు పెట్టిన హ్రస్వనామాలు, పట్టణ వాసు లందరికీ తెలిసిపోయాయని బాగా ప్రచారంలోకి వచ్చేసాయని ప్రిన్సిపాలుగారికి లెక్చరర్లందరికీ అర్థమైపోయింది. తమ పరువు ఎలా కాపాడుకోవాలో మాత్రం అర్థం కాలేదు. అందరి నోళ్లలోను ఈ పిచ్చిపేర్లు స్థిరపడిపోకుండా ఉండాలంటే ఏం చేయాలో అసలే అర్థం కాలేదు!

ఆరోజే యూనివర్శిటీ సెలక్షన్ బోర్డువారు తనని ఈ కాలేజీలో లెక్చరర్‌గా నియమిస్తూ ఇచ్చిన ఆర్డరు పట్టుకొని సర్వీసులో జాయిన్ అవుదామని వచ్చిన ఒకాయన ఇక్కడ సంగతంతా చూసి ఆర్డరు కాపీని ఉండచుట్టి పారేసి ఎవర్నీ కలవకుండా తిరుగు ప్రయాణమై వెళ్లిపోయేడు. ఈ కాలేజీలో ఉద్యోగం లేకపోతే పోయే! ఏదో ‘డీయస్సీ’ పరీక్ష రాసి ఇంకేదో చిన్న పల్లెటూర్లో బడిపంతులుగా పనిచేయటం మేలు దీనికన్న అని నిశ్చయించు కొన్నాడు. అంతేగాని ఈ కాలేజీలో చేరి అందరితో “పంది” అనిపించుకోవడానికి మాత్రం ఇష్టపడలేదు. ఇంతకీ ఆయన పేరు పంతుల దివ్యసాగర్!! కొంచెం లావుగా కూడా వుంటాడు!!

అంతా భయపడినట్లుగానే ఈ కాలేజీ బోధనాసిబ్బందికి విద్యార్థులు సరదాపడి పెట్టిన పొడక్షరాల పేర్లు స్థిరనామాలైపోయాయి. అందరి నోళ్లలో నాని నాని— ఇంతలో ఫైనల్ ఎగ్జామ్స్ అయిపోయాయి. వేసవి సెలవుల్లో అందరితో బాటు, కాలేజీ ప్రిన్సిపాల్‌గారికి ఇతర ఉపాధ్యాయులకు పెళ్లి పత్రిక అందింది –

ఆ శుభలేఖలో సరదాగా... లుంగీ వెడ్స్ రవికె, అని లుంగీతో రవికె పరిణయం అని ముద్రించారు రెండు భాషలలోనూ...

అయితే కవర్లమీద చిరునామాల్లో ప్రిన్సిపాల్, ఇతర లెక్చరర్ల అసలు పేర్లు మాత్రమే వ్రాయించి తమ గురుభక్తి చాటుకొన్నారు వధూవరులు, గీత రవిద్వయం...

***(21-7-2004** నవ్యవారపత్రికలో ప్రచురితం)*

# శృంగారభూతం

"నేను జీవితమంతా లోతుగా పరిశోధించి, అనుభవపూర్వకంగా కనుగొన్న విషయమిది - భూతాలు, దెయ్యాలు ఖచ్చితంగా ఉన్నాయంటే నమ్మవేంటి? నీకెలా నమ్మకం కలిగించాలో తెలియటం లేదు", బాగా విసుగ్గా అన్నాడు ప్రొఫెసర్ దశరథ, పడుచు పెళ్లాం ధైర్యలక్ష్మితో.

ఊరికి కొంచెం దూరంగా, ఓ స్మశానానికి దగ్గరలో ఉన్న తమ ఇంటి ఆవరణలో పెద్ద మర్రిచెట్టుకింద కూర్చోబెట్టి, ఓ సాయంత్రం దాదాపు గంటనుంచి, తన జీవితకాల పరిశోధనా సారాంశాన్ని ఎంత విడమర్చి బోధించినా, భార్యారత్నానికి మాత్రం 'దెయ్యాలు' ఉంటాయన్న నమ్మకం ఏ మాత్రం కలిగించలేకపోయాడు. తను విన్న ఇతరుల అనుభవాలతోపాటు, స్వానుభవాలంటూ, ఎన్నివిధాలుగా విపులీకరించి చెప్పినా ప్రయో జనం లేకపోయింది.

'శివుడు' ఉన్నది ఎంత నిజమో, ప్రేతాత్మలు ఉండటమూ అంతే నిజమని, దృష్టాంతాలతో సహా చెప్పి చూశాడు. దెయ్యాల ఉనికి గురించి చాటి చెప్పిన, పురాణ గాథలు, వాస్తవ ఘటనలు ఎన్ని చెప్పినా ప్రయోజనం కలగలేదు. మానవ జన్మ ఎంత వాస్తవమో, కోరికలు తీరక చనిపోయినవాళ్లు, దెయ్యాలవుతారన్నది అంతే వాస్తవమని, ఢంకా భజాయించి చెప్పేడు. దెయ్యాలన్నీ చెడ్డవి కావని శివుడు వరాలిచ్చినట్లే కొన్ని దెయ్యాలు వరాలిస్తాయని ఉదాహరణకు 'నీ ఇల్లు బంగారం కానూ' అని ఏదైనా దెయ్యం అందంటే, నిజంగానే మనిల్లు బంగారమైపోతుందని, అదేవిధంగా దెయ్యాలకి కోపం వచ్చిందంటే మనం తట్టుకోలేమని అవి అంత శక్తివంతమైనవని నూరిపోశాడు దశరథ.

అబ్బే ఏం లాభం లేకపోయింది. భార్య ధైర్యలక్ష్మికి ఏమాత్రం నమ్మకం కలిగించలేక పోయేడు. పైగా వితండవాదం మొదలెట్టింది....

"కోరికలు తీరని మానవులు దెయ్యాలవుతారంటున్నారు కదా. మరి అదేవిధంగా కోరికలు తీరకుండా చచ్చిపోయే ఇతర జీవులు జంతువులు కూడా

దెయ్యాలవ్వాలి కదా. ఆ లెక్కన కుక్క దెయ్యాలు, ఎలుక దెయ్యాలు కూడా ఉండాలి కదా" అని పిచ్చి లాజిక్ తీసింది.

వళ్ళు మండించింది. దాంతో ఎక్కువ ఆలోచించకుండా "ఆ! ఉంటాయి. మరణానంతరం దెయ్యాలుగా మారే కుక్కలు, పిల్లులు కూడా ఉంటాయి. కానయితే అవి మన జోలికిరావు. కనపడవు. ఆయా జాతుల జీవులకే కనపడ్తతాయి" అని బుకాయించేశాడు.

"అయితే దెయ్యాలకి మరణముంటుందా? చచ్చిన తర్వాత మళ్ళీ దెయ్యాలవుతాయా?" అని అమాయకంగా ప్రశ్నించేసరికి ప్రొఫెసర్‌గారు రెచ్చిపోయి పప్పులో కాలేశాడు.

"అబ్బే! నీ తెలివి తెల్లారినట్లే ఉంది. దెయ్యాలకి చావుండదు" అనేశాడు. బాగా ఉడుకుమోత్తనం వచ్చి కాబోలు –

"దొరికాడు గురుడు" అనుకుని ధైర్యలక్ష్మి ఇంకా రెచ్చిపోయింది. భర్తని మరింతగా ఆటపట్టించసాగింది, లాజికల్‌గానే.

"సృష్టి మొదలైనప్పటినుంచి కొన్ని లక్షల కోట్ల మనుషులు, ఇతర జీవులు పుట్టి గిట్టి వుంటాయి. ఏ జీవీ తన జీవితకాలంలో అన్ని కోరికలూ తీర్చుకోలేదు. ఏదో ఒక్క కోర్కైనా తీరకుండా చచ్చిపోవచ్చు. మీరు చెప్పిన ప్రకారం ఇన్ని లక్షల కోట్ల జీవులు దెయ్యాలైపోయుంటే. వాటికి మరణమే లేకుంటే, ఈ అసంఖ్యాకమైన దెయ్యాలకు, అదే మనిషి దెయ్యాలకు, ఇతర జంతువుల కీటకాల దెయ్యాలకు, సరిపడే చోటుందా ఈ విశ్వంలో? పరిమితమైన జీవితకాలమున్న ఈ మనుష్యులకే సరిపోవటం లేదే ఈ భూమి! అన్నట్టు, మగదెయ్యాలు, ఆడదెయ్యాలు కలిసి పునరుత్పత్తి సాగిస్తే, దెయ్యాల సంఖ్య ఇంకా పెరిగిపోతూనే వుంటుంది కదా. ఇవన్నీ ఉండటానికి చోటెక్కడుందండి బాబూ! అన్నట్టు దెయ్యాలు చెట్లమీదే వుంటాయో, వేలాడుతాయో అన్నారు కదా. అన్ని చెట్లున్నాయా భూమిమీద. ఉన్న అరణ్యాలను నరికేస్తూ పోతూంటే, రోడ్ల విస్తరణ వంకన, ఉన్న చెట్లనీ నరికేస్తుంటే ఈ దెయ్యాలెందుకు 'ప్రొటెస్ట్' చేయటం లేదు? నోర్మూసుకుని ఉంటున్నా యెందుకు?"

సీరియస్ గొంతుకతో, కొంటెగా అడిగేసరికి ప్రొఫెసర్ దశరథ నోరు పెగలలేదు. సమాధానం చెప్పలేక పళ్ళు పటపట కొరికేడు. నీళ్ళు నమిలేడు. ఆఖరికి నిస్పృహగా అన్నాడు అప్పుడే -

"నీకెలా నమ్మకం కలిగించాలో నాకు తెలియటం లేద"ని.

"ఏముంది? ఓ దెయ్యాన్ని తీసుకొచ్చి నాతో మాట్లాడించండి. అప్పుడు చూద్దాం" దృఢంగా అంది ప్రొఫెసర్ భార్య ధైర్యలక్ష్మి.

ఏం చెప్పలేక నుదురు కొట్టుకున్నాడు.

అప్పుడే... కీచురాళ్ల రొదల మధ్య నక్కల ఊళల మధ్య మర్రిచెట్టు మీదినుంచి ఏదో కిందికి దూకినట్లు ధబేలుమని శబ్దమయింది. భార్యాభర్తలిద్దరూ ఉలిక్కిపడ్డారు. తామిద్దరి మధ్య నిలబడ్డ 'వింత ఆకారాన్ని' చూసి గజగజా వణికిపోయేరు. ఊపిరి పీల్చుకోవటం మర్చిపోయేరు.

ఆ ఆకారం నిస్సందేహంగా దెయ్యమేనని గ్రహించిన దశరథ కొయ్యబారిపోయేడు.

'నిజంగా దెయ్యమే. దెయ్యం ఎలా ఉంటుందని తను ఊహించుకున్నాడో అలానే ఉంది' ఆంజనేయ దండకం జ్ఞాపకం వచ్చి చావటం లేదు. ఇప్పుడెలా? ఏం చెయ్యాలి?'

ఊపిరాగిపోయినట్లయింది దశరథకి. గాలి స్తంభించింది. లేని గాలికి ఆ ఆకారం కట్టుకొన్న తెల్లని వస్త్రాలు రెపరెపలాడుతూ ఏదో ఒక విధమైన భయంకర సంగీతాన్ని వెలువరిస్తున్నాయి. పైగా దూరాన ఓ నక్క భయంకరంగా మూలిగిన శబ్దం. ముసుగులోంచి చింతనిప్పులా మండుతున్న దాని కళ్ళు కూడా నేలమీద ఆన్చినట్లు లేదు. ఆడో మగో తెలియడం లేదు గాని నిస్సందేహంగా దెయ్యమే.

ఇప్పుడెందుకు వచ్చినట్లు? తనని కరకరా నమిలేసి మింగేస్తుందా?

'కాదు కాదు... దెయ్యాల ఉనికిని ససేమిరా ఒప్పుకోనంటూ అపహాస్యంగా మాట్లాడిన తన పెళ్ళాం ధోరణి విని, బుద్ధి చెప్పటానికి వచ్చుంటుంది. తనకెందుకు

అపకారం చేస్తుంది? - ఇలా పరిపరి విధాల ఆలోచిస్తున్న ప్రొఫెసర్ దశరథ, గజగజా వణుకుతున్న శరీరాన్ని అదుపు చేయటానికి విఫలయత్నం చేస్తూ ఏదో అన్నాడు. కాదు అన్నానని అనుకున్నాడు. కాని నోటినుండి ఏవో వింత వింత శబ్దాలు మాత్రమే వచ్చాయి.

కాని 'దెయ్యమే' ముందు మాట్లాడింది! ప్రొఫెసర్ చెవుల్లో అమృతం నింపింది.

"ఓయ్ ప్రొఫెసర్! దెయ్యాల గురించి నువ్వు చేసిన కృషి, శ్రమ నాకు నచ్చాయి. ఏం కావాలో కోరుకో"

అంతే, దశరథ ఉబ్బి తబ్బిబ్బైపోయాడు. 'ఇది మహా మంచి దెయ్యం, నాకేం అపకారం చెయ్యదు గాక చెయ్యదు' అని నిర్ణయానికొచ్చేడు. తల పైకెత్తడానికి మాత్రం ధైర్యం సరిపోలేదు. తల వంచుకునే "సార్... అదే దెయ్యంగారూ! నాకు ఒక లక్ష ఆ... ఆ... కాదు ఒక కోటి రూపాయలు దయచేయండి.." ఆలస్యం చేయకుండా భయం భయంగానే అడిగేడు.

"ఓస్ ఇంతేనా! ఈ రాత్రి బాగా నిద్రపోయి, రేపు ఉదయం నీ తలగడ కింద చూసుకో. డబ్బుమూట ఉంటుంది. విప్పి లెక్క వేసుకో. సరేనా" దర్జాగా అంది దెయ్యం.

తబ్బిబ్బైపోయేడు ప్రొఫెసర్. అంతలోనే ఇంకా ఎక్కువ డబ్బో మరింత విలువైనదేదైనా అడగకపోయినందుకు తనను తానే బాగా తిట్టుకున్నాడు. ఏదో అనబోతుండగా వారిస్తూ భూతం గంభీరంగా పలికింది ఆజ్ఞ రూపంలో.

"అయితే ఒక కండిషన్! నీ భార్యతో కాసేపు ఒంటరిగా గడపాలి నేను"

గుండె గుభేలుమంది దశరథకి.

'ఓ మై గాడ్. నా ముద్దుల భార్యనేం చేద్దామని? దెయ్యాల గురించి అపహాస్యంగా మాట్లాడినందుకు శిక్షగా గుటుక్కున మింగేద్దామనా? లేదా తన జాతి ప్రయోజనాలు దృష్టిలో పెట్టుకుని, జాతిపురాణం ఈ పిచ్చిదానికి చెప్పి దయ్యాలున్నాయని నమ్మకం కలిగించటం కోసం మాత్రమే ఆమెతో ఒంటరిగా గడపాలనుకుంటున్నదా? ఖర్మ కాలి, ఇది శృంగారం తనివి తీరకుండా చచ్చిపోయి దెయ్యం అయిన బాపతా?

ఇప్పుడు నా పెళ్ళాన్ని అనుభవించాలని కోరుకుంటున్నదా... కాదు... వద్దంటే - అమ్మో అసలే దెయ్యం. కోపం వచ్చి ఇద్దర్నీ కరకరా నమిలేసి మింగేస్తే - బ్రతికుంటే బలుసాకు తినొచ్చు. దెయ్యానికి కోపం తెప్పిస్తే అంతే సంగతులు. అయ్యో దేముడా ఏమిటి దారి... ఏదో అడుగుదామని కాదు, అర్థించుదామని నెమ్మదిగా కళ్ళెత్తి పైకి చూశాడు.

'అమ్మో! దెయ్యం కళ్ళలో మండుతున్న కాఠిన్యాన్ని గ్రహించి, ఇంకేమీ దారి లేదని అర్జంటుగా నిశ్చయించుకుని భార్యవైపు చూపు మరల్చాడు. నా శీలం పోగొట్టుకోమంటావా అన్న ప్రశ్న ఆవిడ కళ్ళలో ప్రతిఫలించింది.

"ఆ! శీలమా గాడిద గుడ్డా, నువ్వు ధైర్యలక్ష్మివి. మహా పతివ్రతవి. దెయ్యం నిన్నేం చేయదు. అసలు దెయ్యాలకు మానవులకుండేలా శృంగారం, సెక్సు భావనలుంటాయా? ఉండవు గాక ఉండవు. వెళ్ళు, కూడా వెళ్ళు. ఏదో పిచ్చాపాటీ మాట్లాడి తన దారిన తను పోతుంది. అంతే. అసలు దెయ్యాలంటే ఏమిటి? స్పిరిట్. ఉత్త గాలి అన్నమాట. అలాంటి గాలితో కాసేపు 'గడిపితే' శీలం పోవటం లాంటిదేమీ జరగదు. అంతా ఉత్తుత్తినే నన్నమాట. ఉఫ్... ఉఫ్... అంతే. అయినా దెయ్యంగారు కాసేపు ఒంటరిగా గడపాలన్నారు అంతే, ఇంకేమీ డైరెక్టుగా అడగలేదే. మనమెందుకు ఏదో ఊరికినే ఊహించుకోవటం? కాదంటే ఇద్దర్నీ చంపేయడం ఖాయం. ఇద్దరికి ప్రాణభిక్ష పెట్టటం నీ చేతిలోనే వుంది. వెళ్ళు... వెళ్ళు కాసేపు ఏదో అలా అలా... ఉఫ్..." ఇన్ని అర్థాలు గోచరించాయి, ధైర్యలక్ష్మికి తన భర్త పిచ్చిచూపుల్లో, అతనేమీ పైకి మాట్లాడలేకపోయినా! దెయ్యాన్ని అనుసరించి చీకట్లో కలిసిపోయింది ధైర్యలక్ష్మి. 'ప్రొఫెసర్ ఉన్నచోటునే కొయ్యబారిపోయాడు. ఎన్నో రకాలైన ఆలోచనలు అసంఖ్యాకమైన వికృత దెయ్యాల్లా ముసురుకొన్నాయి. ఎంతసేపు గడిచిందో అర్థం కాలేదు.

కాలం స్తంభించిపోయింది. వళ్ళు, మెదడు మొద్దుబారిపోయాయి. భూతం, తన భార్య ధైర్యలక్ష్మి తిరిగి తన ముందు సాక్షాత్కరించే వరకు ఎంత సేపయిందో అర్థం కాలేదు.

"అమ్మయ్య! నా భార్య నాకు దక్కింది' అనుకున్నాడు.

మనస్ఫూర్తిగా నలిగిన పువ్వులా ఉన్న ఆమె ముఖంలోని భావాల్ని ఆ చిమ్మచీకట్లో చదవలేకపోయేడు. ఎంతో తృప్తిగా ఉన్న ఆమె ముఖాన్ని, నలిగిన చీరనీ గమనించలేదు.

ధైర్యలక్ష్మి ఏమీ మాట్లాడలేదు.

"గుడ్‌బై ప్రొఫెసర్" దెయ్యం దర్జాగా పలికింది.

"సరే... సరే..." తత్తరపోవటం దశరథ వంతయింది.

"మరి.. మరి..." నోరు పెగల్చుకొని ఏదో అడగబోయాడు. ధైర్యం సరిపోక ఆగి పోయాడు.

"దెయ్యాలు, భూతాలు ఉన్న మాట నిజమైతే నీ కోటిరూపాయల మూట రేపు నీకందుతుంది" అని గంభీరంగా పలికి మారు మాట్లాడటానికి అవకాశం ఇవ్వకుండా ఆ 'ఆకారం' చిమ్మ చీకట్లోకి అంతర్థానమయిపోయింది.

సొమ్ము మూట ఇస్తానన్న దెయ్యం – శృంగార భూతం మాట నిలబెట్టుకోలేదని చెప్పనవసరంలేదు. కాని వృద్ధ ప్రొఫెసర్‌కి అప్పటినుంచి అనుమాన భూతం పట్టుకుంది.

*(2005 నవ్యవారపత్రిక దీపావళి ప్రత్యేక సంచికలో ప్రచురితం)*

# అవాక్కయిన కాంతం

కాంతం నా నిజభార్య - వ్యావహారికంలో చెప్పాలంటే మా ఆవిడ - అంటే నా ఒక్కడికే ఎప్పుడూ గలగలా, వసపోసిన పిట్టలా వాగుతూనే ఉంటుంది. తన సంభాషణా చాతుర్యంతో, అందర్నీ కాకపోయినా, నన్ను మాత్రం తరచూ, 'అవాక్కు' చేస్తుంటుంది. 'టైడ్' డిటర్జంటు ప్రచార ప్రకటనలోలా 'న్యూపించ్' అని గిల్లకుండానే తన ఈ చతురతకు కారణం, రోజులో సింహభాగం, టీవీ ముందే, చిప్స్ నములుతూ కూర్చుని, లెక్కలేనన్ని సీరియల్సు, ఇతర ప్రోగ్రాములు, వివిధ చానల్సులో వాణిజ్య ప్రకటనలతో సహా, నిరంతరం చూస్తుండటమేనని చెప్పుకోవచ్చు-

ఇది చాలామంది ఆడవాళ్ళు చేసే పనేనంటారా- కాని మా ఆవిడ ప్రత్యేకత ఏమంటే, సీరియల్సులోని బరువైన డైలాగుల్ని ప్రచార ప్రకటనల్లోని తేలికైన సంభాషణల్ని, కంఠతాపట్టేసి, అవసరమైతే కొంత సొంత పైత్యం రంగరించి, ఇతరులమీద, ముఖ్యంగా మొగుడిమీద, సందర్భోచితంగా ప్రయోగించటం.

తను ఏది మాట్లాడినా, వాగినా, అర్థకుణ్ణైన నేను ఆస్వాదించినట్లు నటించాలి. లేకపోతే ఆ రోజుకి అన్నివిధాలా ఉపవాసమే! అయితే, నేనేదయినా చెప్పబోతే మాత్రం, రిన్ అడ్వాన్సడ్ వైట్ డిటర్జెంటు ప్రచార ప్రకటనలో అమితాబ్ బచ్చన్ యొక్క గంభీర స్వరాన్ని అనుకరిస్తూ "నేనడిగానా?" అని కసురుకొని 'భలే అనుకరించాను' అని తనకు తానే మురిసిపోతుంది. 'భర్త వీలైనంతగా మౌనంగా ఉండటమే అనుకూల దాంపత్యానికి రహదారి' అని ఏదో సీరియల్‌లోని డైలాగు పేలుస్తుంది తర్వాత -

అలాంటి మా ఆవిడ కాంతం ఇప్పుడు వంటింట్లో ఉంది. "టర్బోజెట్ డీసిల్ ఆయిల్ ప్రకటన"లోని "మైలే...జ్" అన్న గీతాన్ని సాగదీసి పాడుకొంటూ, గిన్నెలు దబదబలాడిస్తోంది. బయటి వరండాలో ఉన్న నేను, తిన్నదరక్కో తిన్నగా ఉండలేకనో..." ఏఁవోయ్ కాంతం ఏం చేస్తున్నావ్?" అని అడిగేను. అంతే రెచ్చిపోయింది.

"హు! ఏం చేస్తాను. ఈ దేశంలో ఆడవాళ్ళు వంట చేయటానికే కదా పుట్టినా గిట్టినా- పుట్టింట్లో పట్టింపు లేకుండా చేశాను చాకిరి – ఓ 'పోకిరీ'ని కట్టుకొని ఇప్పుడూ, ఇక్కడా అదే చేస్తున్నాను. హు! నా సృజనాత్మకతని ఆశల్ని ఆశయాల్ని చేతులారా చంపుకొని నిలువెత్తు గోతిలో పూడ్చి, వంటకే పరిమితమయ్యాను. అపరిమితమైన ఓపికతో, ఈ మాయదారి పప్పు ఉడికిస్తున్నాను. హు! నా బతుకింతే. ప్రెస్టేజ్ కుక్కరు లేదంతే! పప్పు ఓ పట్టాన ఉడకదు. హు. ఉడకదు" ఏదో సీరియల్‌లోని డైలాగును సందర్భోచితంగా, సవరించి పేల్చింది.

నేనెప్పటిలాగానే నోర్మూసుకొని ఉన్నాను. కాని తన ధోరణి ఆగలేదు.

"భార్యలంటే ప్రేమ వున్నవాళ్ళు ప్రెస్టేజ్ కుక్కర్ కొనకుండా ఉంటారా?" అని మరో ప్రకటన వెలువరించింది.

మాకు కుక్కర్ లేకపోలేదు. ఈ మధ్యనే పాడయిందంతే. 'ఇక ఆలస్యం చేయకూడదు. ఎక్స్ఛేంజ్ ధమాకాలో కొత్తది తీసుకోవాలని లేకపోతే వంటింట్లో ఆవిడికి పప్పు, పడగ్గదిలో నా పప్పులు ఉడకబోవని నిశ్చయించుకొన్నాను. అదే చెప్దామనుకొనేలోగానే, తన ధోరణి మళ్ళీ మారిపోయింది. క్షణక్షణంబుల్ జవరాండ్ర చిత్తముల్ కదా!

"అవునండీ, మా పెద్దమ్మ కొడుకు మొన్నీమధ్యే పెళ్ళయిందే... చంద్రం... వాడు కొత్తకారు కొనుక్కొన్నాడట. ఇంటికీ ట్రాక్టర్ ఎమల్షన్ పెయింట్ వేయించాడట... అందరూ... అదిరిందయ్యా చంద్రం... కొత్త ఇల్లూ కొత్త కారూ కొత్త పెళ్ళాం... అంటున్నారట. హు! మీరూ వున్నారు".

ఈ దెప్పుడుతో నా తలపగిలిపోయింది. కాని బయటపడితే 'ఇమామీ మెంతోప్లస్' వాళ్ళ పదితలకాయల రావణాసురుడిని అనుకరిస్తుందని, భయపడి, నోర్మూసుకొన్నాను. మొన్నొకరోజు మాట జారి కొంచెం టెన్షన్‌గా ఉందని అన్నానో లేదో, వెంటనే "నా బుర్ర తినకయ్యా టెన్షన్ ఎందుకు దండగ – క్రేన్ వక్కపొడి ఉండగ" – అనేసి పకపకా నవ్వేసింది, ధర్మవరం సుబ్రహ్మణ్యంగారి గొంతుకతో. అంతేగాని, అమృతాంజన్ బాటిల్ తెచ్చిద్దామనుకోలేదు. ఇంత పిచ్చున్నమాట మా ఆవిడికి ప్రచార ప్రకటనలు, సీరియల్స్ లోని సంభాషణలు

అంటే.

నేను నోర్మూసుకొని ఉన్నా, తనుండలేదుగా! ఇంకా వంటింట్లోనే ఉన్న కాంతం, ఈసారి ప్రచార ప్రకటన కాదుగాని, స్వంత భాషలో ఓ సీరియస్ డైలాగ్, డైనమైట్‌లా పేల్చింది.

"హు! ఏమండీ రోజురోజుకి నేనంటే లెక్కలేకుండా పోతోంది మీకు. ఎన్ని రోజుల్నించి చెప్తున్నాను? కాలనీలోని నలుగురు పెద్దమనుషుల్ని తీసుకొని వెళ్ళి రోడ్డవతల పచ్చ డాబాలోని విలాస పురుషుణ్ణి నాలుగు చివాట్లు పెట్టిరమ్మని, చెవినిల్లు కట్టుకొని పోరు తున్నానా లేదా? ఆ మనిషినన్నా వదిలేయ్, లేకపోతే ఈ కాలనీనైనా వదిలేయ్ అని గట్టిగా చెప్పిరమ్మన్నానా లేదా?"

నిజమే. మా ఆవిడ నాలుగు రోజుల క్రితమే, పక్కింటి వర్మగారి భార్య చెప్పిందని ఓ రహస్యం, నా చెవిలో ఊదింది.

అదేమిటంటే ఎదురింట్లోకి, ఈ మధ్యనే దిగిన శర్మగారు కొన్నిరోజులు ఒంటరిగానే వుండి తర్వాత నెమ్మదిగా, తన కన్న వయసులో చాలా చిన్నదైన ఓ వగలమారిని తెచ్చి . ఉంచుకొన్నాడని ఉంపుడుగత్తె గాబట్టే వాళ్లిద్దరు ఎవరితోనూ కలవరని అసలు బయటికి వచ్చేదే అరుదని, పగలూ రాత్రి, ప్రణయప్రపంచంలోనే తేలిపోతూంటారని, అందుకే వాళ్ళింటికి బంధువులెవరూ, ఆఖరికి ఆయన బిడ్డలు కూడా రారని చెప్పింది అలాంటివాళ్ళు ఈ కాలనీలో ఉంటే సంసారులందరికీ అరిష్టమని, నలుగుర్నీ తీసుకొని ధాష్టీకం చేసి, వాళ్ళు ఇక్కణ్ణుంచి వెళ్ళిపోయేలా చేయమని చెప్పిన మాటా నిజమే. ఆవిధంగా సామాజిక సేవ చేయమని ఆజ్ఞాపించిందన్నమాట!

"ఏమండీ! మాట్లాడరేమిటి బెల్లం కొట్టినరాయిలా – మీ మగాళ్ళకి చేతకాకపోతే ఆ మాటే చెప్పేదవండి. మా ఆడాళ్ళమే పూనుకొంటాం ఊ... చెప్పండి..." లోపల్నుండే రెట్టించింది. పప్పు ఉడికిపోయింది. కాబోలు గిన్నె దించిన చప్పుడు చుయ్‌మంటూ విన్పించింది.

అప్పుడే ఎదురుగా ఉన్న పచ్చడాబాలో ఉంటున్నావిడ, బయటికి రావటం

గమనించిన నాకు హుషారొచ్చింది. నోరు పెగిలింది.

"కాంతం ఓసారి బయటికిరా... నిన్నేనోయ్" ఇంచుమించుగా అరిచాను.

"ఏం? ఎందుకు.. అర్థం కాని మొగుడు సీరియల్‌లో పరాంకుశంలా మాట మార్చే స్తున్నారెందుకు?" సాగదీస్తూ పలికింది.

"మాట మార్చటం కాదోయ్. నువ్విప్పుడు మాట్లాడుతున్న విషయమే. ఇలా రా, నీకొకావిణ్ణి చూపిస్తా. ఆలసించిన ఆశాభంగం. రాకపోతే నాకేం – నువ్వే మిస్సవుతావు!" హుషారులో మామూలు ధోరణికి భిన్నంగా ఎక్కువ మాట్లాడేను.

"ఓహో! ఏమిటా సంబడం! ఎవరా మిస్సమ్మ?" ఎదురింట్లో ప్రియురాలు సీరియల్‌లో జనార్ధనంలా ఈ వయసులో బుద్ధి పక్కదారి పడుతుందా మహానుభావా" బయటికి రాకుండానే సన్నాయి నొక్కులు నొక్కింది.

ఇక సస్పెన్స్ కొనసాగించటం నా తరం కాదనిపించింది. పైగా అరటిపళ్ళు బేరమాడు తున్న ఎదిరింటి భామ, వనిపూర్తి చేసుకొని లోపలికి వెళ్ళిపోతుందేమోనని భయం కలిగింది.

"అదేం కాదోయ్. ఇన్నాళ్ళూ నీ కంట పడలేదని టెన్షన్ పడిపోతున్నావే. ఆ ఎదురిం టావిణ్ణి చూపించుదామని పిలుస్తున్నాను. త్వరగా రా ఓసారి. లేకపోతే నీ ఇష్టం. నాకే!" అనునయం, బెట్టు సమపాళ్ళలో కలిపి అన్నాను.

నేను మాట పూర్తి చేసేలోగానే గతంలో బాగ్దాద్ నగరం మీద అమెరికా వాడు వేసిన బాంబుల శబ్దాల్లా ఎన్నో వింత వింత ధ్వనులు వినవచ్చాయి. పడింది మా ఆవిడ కాదు. తన చేతిలోని పింగాణీ పళ్ళేలని అర్థమవడానికి క్షణం పట్టింది. అంతలోనే సుడిగాలిలా బయటికి వస్తూ కాదు పరుగెత్తుతూ, వంటింట్లోని పాలగిన్నెని, కాఫీ ఫ్లాస్కుని, దోసెల పిండి వున్న పాత్రని తన్నుకొంటూ, హడావిడిగా, వగర్చుకొంటూ వచ్చేసింది మా ఆవిడ! కాసేపటివరకు ఏం మాట్లాడలేక వగర్చింది.

"ఎక్కడండీ. ఏదీ ఆ వగలమారి?" వగరుస్తూనే నన్ను కుదిపేస్తూ అడిగింది.

"అదిగో" అని ఎదురింటి శర్మగారి ఇంటిముందు నిలబడి అరటిపళ్ళు బేరమాడుతున్నావిణ్ణి చూపించాను. అంతేగాని శర్మగారిని మిసెస్ శర్మగారిని ఈ రోజునే పొద్దున్న గుళ్ళో కలిసానని చెప్పలేదు.

కళ్ళు చిట్లించుకొని చూస్తున్నదే గాని, ఆవిణ్ణి పూర్తిగా గుర్తుపట్టలేకపోతున్నదని అర్థమయింది. అంతలో పళ్ళ బేరం పూర్తి చేసుకొన్న ఆ ఎదురింటావిడ తనవైపే చూస్తున్న నన్నూ కాంతాన్నీ చూసి పలకరింపుగా నవ్వి, వెంటనే రోడ్డు దాటుకొని మావైపు విసవిసా రాసాగింది.

ఏదో దెబ్బలాడడానికి వస్తుందేమోననుకొన్న మా ఆవిడ, కొంచెం బిత్తరచూపులు చూడసాగింది. దగ్గరికి వచ్చేసాక "ఏమిటి కాంతం అక్కయ్యా - నన్ను గుర్తు పట్టినట్లు లేదు. నేను సత్యభామని. ఆలమూరులో బాదం చెట్టు ఇల్లు..."

"ఆ! సత్యభామ. మా చెల్లెలి క్లాస్‌మేట్. మరేమిటి నువ్విక్కడ మరి శర్మగారు..." నీళ్ళు నమిలింది కాంతం.

"అవునక్కయ్యా శర్మగారు, మా వారే. మా పెళ్ళై పదేళ్ళయింది. ఇద్దరికీ పదేళ్ళ తేడా ఉందనుకో... చాలా బాగా చూసుకొంటారు నన్ను. ఈమధ్యనే ఆయనకిక్కడికి ట్రాన్స్‌ఫర్ అయింది. ముందు ఒక్కరే వచ్చి ఈ ఇంట్లో చేరి చేతులు కాల్చుకొన్నారు. నేనొచ్చి నాలుగు రోజులే అయింది. ఎక్కడివక్కడివే ఉండటంతో ఎవర్నీ కలవడానికి తీరలేదు. నేనొచ్చినరోజునే ఈ ఇంట్లో నిన్ను చూసి గుర్తుపట్టేను. తీరిగ్గా వద్దామని ఇంతవరకూ రాలేదు. అన్నట్టు మీవారు పొద్దున్న గుళ్ళో కలిసారు. నన్నూ మావారినీ కూడా. అసలు మా వారూ మీవారు ఎప్పట్నుంచో తెలుసున్నవాళ్ళట. పదేళ్ల తర్వాత కలుసుకొన్నామని ఎన్నో కబుర్లు చెప్పుకొన్నారు. నీకిదంతా చెప్పలేదా. అన్నట్టు పొయ్యిమీద పప్పు పెట్టి వచ్చాను. మళ్ళీ వస్తానే..." గలగలా మాట్లాడేసి చకచకా వెళ్ళిపోతున్న సత్యభామకేసి పిచ్చిగా చూస్తూ ఉండిపోయింది మా కాంతం.

"ఔను... శర్మగారి ఏకైక భార్య సత్యభామ. వాళ్ళకి పిల్లలు లేరు. అన్యోన్య దంపతులు. ఇప్పుడేమంటావ్" ఎక్కడాలేని ధైర్యం వచ్చి అడిగేను. కాదు కడిగేసేను.

"ఉంపుడుగత్తె కాదని తెలిసిందా" అని.

కాంతం ఏం మాట్లాడలేకపోయేసరికి ఇంకా ధైర్యం వచ్చేసింది. థమ్స్ అప్ కూల్ డ్రింక్ ప్రచార ప్రకటనలో చిరంజీవిని అనుకరిస్తూ. "నాకు నచ్చనిది, పుకారు" అన్నాను. కాంతం ఇంకా మాట్లాడలేదు. "టైడ్ డిటర్జెంటు" ప్రచార ప్రకటనని అనుకరిస్తూ 'అవాక్కయ్యావా బామ్మా' అన్నాను. "నేను బామ్మనేం కాదు.." అని కూడా అనకుండా లోపలికి వెళ్ళిపోయింది అవాక్కయిన కాంతం!!

***(15-3-2006, నవ్యవారపత్రికలో ప్రచురితం)***

# భలే కవలలు

తెల్లవారుజామున బ్రహ్మ ముహూర్తం - కాదు, మన్మథ ముహూర్తంలో, బెడ్‌రూమ్‌లో కాలం స్తంభించిపోయింది - భార్యాభర్తలైన రాంబాబు, జయ ఏకశరీరులై, శృంగార సామ్రాజ్యాన్ని ఏలుతున్నవేళ - సంపూర్ణమైన, సంతృప్తితో, రాసక్రీడ ముగిసింది. రాంబాబు ప్రణయశిఖరాన్ని అధిరోహించిన విజయగర్వంతో ఉండగా, భార్య జయ తాననుకొన్నది సాధించడానికి, ఇదే సమయమని నిశ్చయించుకొంది.

"ఏమండీ..." అని గోముగా పిలిచి, "ఊఁ అన్నాక, "నేనిప్పుడు మీకు సైన్సు నేర్పాలి" అంది.

తను 'ఎమ్మెస్సీ జెనెటిక్సు' చేసిందని తెలుసు గనుక సమయోచితంగా భార్య ఏవో మధురమైన విషయాలు చెప్తుందని ఆశించాడు రాంబాబు. కాని అలాంటి ఆశలమీద నీళ్ళు జల్లుతూ, "నేనిప్పుడు చెప్పబోయేది, రాత్రి జరిగిన సంవాదానికి కొనసాగింపే! నా చెల్లులు విజయ యొక్క దాంపత్యాన్ని బాగు చేయడానికి మనం చేయాల్సిన 'ఉపవాసవ్రతం' యొక్క అవసరాన్ని బలపరిచే అదనపు సమాచారమే" అని బాంబు పేల్చింది, తెలుగు టీవీ సీరియల్ భాషలో.

"మైగాడ్! నా ముద్దుల పెళ్లాం, తన పిచ్చి ఆలోచనలు ఇంకా మానుకోలేదన్నమాట - నన్ను ఒప్పించడానికే మళ్ళీ ప్రయత్నం మొదలుపెట్టిందన్నమాట" అని మనసులోనే వాపోయాడు. గతరాత్రి ఇద్దరి మధ్యన జరిగిన సంవాదమో, వివాదమో, ఏమిటో తెలుసుకోవాటంలే, కొన్ని గంటలు వెనక్కి వెళ్ళాలి-

రాత్రి పదకొండు గంటల వరకు జయ టీవీ వీక్షణం సాగించి, అసహనంగా బెడ్‌రూమ్‌లో పడుకొని ఎదురుచూస్తున్న రాంబాబు పక్కలోకి చేరింది - మరుక్షణమే మరులు గొల్పేలా అతన్ని మెత్తగా హత్తుకొంటూ "ఏమండీ - మీరు నాకో చిన్న సాయం చేయాలి" అని గారాలు పోయింది. మెత్తదనాన్ని ఆస్వాదిస్తున్న మైకంలో.

"మీరజాలగలనా, నీ ఆనతిని" అని రాగం తీశాడు. అంతలోనే ఏదో అనుమానం వచ్చి "అసలేంటి కథ" అని అడిగాడు.

"రేపు మా చెల్లెలు విజయ వస్తోంది మనింటికి" మెల్లగా చెప్పింది.

రాంబాబుకి విజయ తెలుసు – తన భార్య 'జయ', 'విజయ'లు కవల పిల్లలు – ఇద్దరిలో కొన్ని నిమిషాల పెద్దదైన జయతో రాంబాబు పెళ్ళయిన ముహూర్తంలోనే, చిన్నది విజయకు సోంబాబుతో పెళ్ళయింది – పెళ్ళిలో మాత్రమే, విజయను, రాంబాబు చూశాడు.

"అరే! ముమ్మూర్తులా నా పెళ్ళాంలానే ఉందే' అని ఆశ్చర్యపోయి వెంటనే 'ఎప్పుడైనా తారుమారయ్యే ప్రమాదం, ప్రమోదం ఉందిరా, నాయనోయ్' – అని కొంటెగా మనసులోనే అనుకున్నాడు. కాని, అటువంటి ప్రమాదానికి అవకాశం లేకుండా, ఇరు జంటలు పెళ్ళయిన రాత్రే వేర్వేరు ప్రాంతాల్లోని, 'అత్తవారిల్లి'కు సాగనంపబడ్డారు. కాబట్టి రాంబాబుకి మరదలు విజయని, బాగా చూడ్డానికి గాని, మాట్లాడటానికి గాని, తన మనస్తత్వాన్ని అర్థం చేసుకోవడానికి గాని, అవకాశం సంభవించలేదు.

పెళ్ళయిన తర్వాత, ఈ మూడు నెలలూ మూడు రోజులుగా గడిచిపోయాయి రాంబాబుకు! విజయ ఎప్పుడూ పెద్దగా జ్ఞాపకం రాలేదు. – తన సంసారం మూడు రాత్రులు ఆరు మధురానుభూతులుగా హాయిగా సాగిపోయినందువల్లన! అయినా, ఇప్పుడు విజయ వస్తోందంటే ఏదో, ఎందుకో తెలియని ఆనందం కలిగింది!

అయినా పైకేమీ తేలకుండా 'ఓకే, రానీయ్ గెస్ట్‌రూంలో ఉంచుదాం' అన్నాడు దర్జాగా.

"అలా కాదండీ! మా చెల్లెలు ఉన్నన్నాళ్ళూ మీరే గెస్ట్‌రూమ్‌లో, ఒక్కరే పడుకోవాలి" – 'ఒక్కరే' అన్న మాటను బాగా నొక్కి పలికింది జయ దృఢంగా!

"అలా ఎందుకు? అని పిచ్చి చూపులు చూస్తున్న మొగుడి మీద జాలి కలిగి, "అబ్బే, కొద్దిరోజులేనండి – నాకోసం, మీరు నిగ్రహించుకోవాలి మరి! అన్నట్టు

అది ఉన్నన్నాళ్ళు మనం వేర్వేరు గదుల్లో పడుకోవడమే కాదు రాత్రుళ్ళు - పగలంతా 'ఉప్పు నిప్పు'లా కాట్లాడుకుంటూ ఉండాలి. ఏమైనా మన మధ్యన 'అది', ఏదీ , 'అది' లేనట్లే ఉండాలి. అర్థమయిందా" అని రెట్టించింది. ఆ వెంటనే "ఏమండీ నాకోసం, నా చెల్లెలి కాపురం బాగుచేసే సత్కార్యం కోసం, కొద్ది రోజులు ఉపవాసం' చేయలేరా? నా బంగారుకొండ కదా" అని ఉబ్బుమంత్రం కూడా వేసింది.

రాంబాబుకి విషయం సొంతం కాదుగాని కొంత అర్థమైంది, 'అది' లేకుండా ఉండాలని, నాలుగు రోజులు 'ఉపవాసం' చేయమంటోందని, అవగతమైంది. దాంతో సహజంగానే తిక్కరేగింది. ఇంకేమీ వివరాలడక్కుండానే విజయ సంసారం బాగైపోవడానికి, జయ చేయమంటున్న 'ఉపవాస వ్రతానికి' మధ్యనున్న లింకేమిటో అర్థం కాకపోయినా, "నో - నో - కుదర్దు" అని గట్టిగా అరిచేశాడు. ఎప్పుడూ లేనిది భర్త రాంబాబు అలా అరిచేసరికి, జయకి కోపం అరికాలిలో మొదలై నెత్తికెక్కింది.

"ఛీ పాడు! నాలుగు రోజులుండబట్టలేని మాయదారి యావ" అని గొణుక్కుంటూ అటు తిరిగి పడుకొంది. రాంబాబు కూడా బెట్టుగానే దూరం జరిగి పడుకొన్నాడు!

ఈ రాత్రి కొన్ని గంటలు గడవగానే, ఎవరు ముందు 'చొరవ' చూపారో తెలియదు గాని, తెల్లవారుజామున, మన్మథ ముహూర్తంలో 'కలయిక' రసవత్తరంగా జరిగింది. పిదప, ముందే చెప్పుకున్నట్లుగా, జయ 'సైన్సు పాఠం' చెప్పడానికి సంసిద్ధురాలైంది.

"పిల్లలెలా పుడతారో తెలుసా?" అచ్చు మాస్టారు శిష్యుణ్ణి అడిగినట్టు ప్రశ్నించింది సీరియస్‌గా.

అది విని ఫక్కున నవ్వాడు రాంబాబు. జయ ఉరిమి చూస్తుంటే తమాయించుకుని, 'ఇది ఈ రోజుల్లో చిన్నపిల్లలకి కూడా తెలుసునోయ్! మగాడు ఆడది ప్రణయోత్సాహంతో, బట్టలు... పరిత్యజించి..."

"ఛీ! మీ బూతు ధోరణి, పిచ్చి కవిత్వం వద్దు.. నేను సైంటిఫిక్‌గా చెప్తా వినండి. స్త్రీలో ప్రతీ ఋతుచక్రానికి ఒక అండం విడుదలవుతంది. సాధారణంగా – 'ఫెర్టిలైజ్డ్ డేస్'లో. దాంపత్యంలో పాల్గొన్నప్పుడు, స్ఖలించబడిన వీర్యంలోని వీర్యకణాల్లో కేవలం ఒకటి స్త్రీ యొక్క అండంతో కలయిక పొందుతుంది. ఇలా ప్రతిసారీ జరగాలని లేదనుకోండి – ఆవిధంగా వీర్యకణంతో కలయిక పొందిన అండాన్ని "ఫెర్టిలైజ్డ్ ఓవమ్" అంటారు. ఈ ఫలదీకరణ చెందిన ఓవమ్ 'పిండం'గా మారుతుంది. ఈ ప్రక్రియనే, స్త్రీ గర్భవతి అవటం అంటారు. పిండం క్రమేణా ఎదిగి తొమ్మిది నెలలకి, సంపూర్ణ శిశువుగా మారుతుంది– ప్రసవం ద్వారా ఈ ప్రపంచంలోకి, ఆడబిడ్డో, మగబిడ్డో వస్తుందన్నమాట! ఇదీ పిల్లలు పుట్టటమంటే – అర్థమయిందా?" అని రెట్టించింది జయ.

రాంబాబు, నిజమైన విజ్ఞాన తృష్ణ ఉన్న విద్యార్థిలా అడిగాడు. తన భార్య కవల పిల్లల్లో ఒక్కతె అని జ్ఞాపకం వచ్చి "మరి కవల పిల్లలెలా పుడతారు?"

"గుడ్ క్వశ్చన్ నాథా! నేనూ అదే చెప్తామనుకొంటున్నాను. వీర్యకణంతో సంయోగం చెందిన అండం ఫలదీకరణ పొంది ఫెర్టిలైజ్డ్ ఓవమ్‌గా మారుతుందని చెప్పుకున్నాం కదా! అయితే, ఒక్కోసారి ఆ ఫెర్టిలైజ్డ్ ఓవమ్ రెండుగా చీలి, రెండు పిండాలుగా రూపొందుతుంది. రెండు పిండాలు, రెండు శిశువులుగా పరిణామం చెంది, ఇద్దరూ మగపిల్లలు లేదా ఇద్దరూ ఆడపిల్లలు లేదా ఒక ఆడపిల్ల ఒక మగపిల్లవాడుగా జన్మిస్తారు. కొద్దిక్షణాల తేడాలో అన్నట్లు ఫెర్టిలైజ్డ్ ఓవమ్ రెండుకన్నా ఎక్కువగా చీలితే ఆ సంఖ్యను బట్టి ఒకే కాన్పులో ముగ్గురు, నలుగురు జన్మిస్తారు. ఒకే ఫర్టిలైజ్డ్ ఓవమ్ ద్వారా కవల పిల్లలు పుడితే వాళ్లని, 'మోనో జైగోటిక్ ట్విన్స్' అంటారు. గర్భంలో ఉన్నప్పుడు ఈ కవలలకి ఒకే 'మాయ' ఉంటుంది. బొడ్డు తాళ్ళు మాత్రం చెరోటి ఉంటాయి. ఇలాంటి కవలలు సాధారణంగా ఒకే రూపురేఖలు కలిగి ఉంటారు. దాదాపుగా ఒకే డి.యన్.ఏ ఉంటుంది. కాబట్టి ఒకేవిధమైన మానసిక శారీరక స్థితి, ఒకేరకమైన ప్రవృత్తి, ప్రవర్తన కలిగి ఉంటారు. చిన్నప్పుడే ఇద్దర్నీ వేరేచేసి, వేరువేరుగా పెంచినా అదేవిధంగా ఉంటారు. పెంపకాన్ని బట్టి కొంత ప్రవర్తనలో తేడాలుండొచ్చనుకోండి."

"మరి సినిమాల్లో చూపిస్తారే, ఒకడిని కొడితే రెండోవాడికి కూడా దెబ్బలు తగిలినట్టు, వాడి వంటిమీద కూడా వాతలు తేలినట్లు...."

"ఛ! అదంతా ట్రాష్! అలా జరగదు. సినిమాల్లో మాత్రమే జరుగుతుంది"

రాంబాబుకి కవలల గురించి ఇంత సైన్సు తెలుసుకున్నాక, ఇంకా తెలుసుకోవాలన్న ఉత్సాహం వచ్చింది. "మరి విజయ, నువ్వు కవలలు కదా. నువ్వు చెప్పిన ప్రకారం ఒకేవిధమైన ప్రవర్తన, ప్రవృత్తి ఉండాలి కదా, నేను విన్నదాని ప్రకారం..." కొంచెం సంశయించాడు.

"మీరు విన్నది నిజమే! అందరి కవలల్లో ఉన్నట్లే మా ఇద్దరి మధ్య పరస్పరం ప్రేమానురాగాలు ఉన్నా, ప్రవర్తనలో ప్రవృత్తిలో చాలా భేదం ఉంది. నేను సౌమ్యంగా ఉంటాను కదా! తను బాగా దురుసు. చండీరాణి. హైస్కూల్లో చదివే రోజుల్లోనే ఎవడో ఈల వేస్తే గూబ పగలగొట్టింది. చిన్నప్పుడు, తోటి ఆడపిల్లలతో నేను అచ్చనగాయలు ఆడుకుంటుంటే, తను మగపిల్లలతో క్రికెట్, ఫుట్‌బాల్, ఆఖరికి కబాడీ కూడా ఆడేది. నేను లంగా వోణీలతో సంప్రదాయబద్ధంగా ఉంటే తను ప్యాంటు టీషర్టులే ధరించేది. కాలేజీలో నేను సైన్సు సబ్జెక్టు తీసుకుంటే, విజయ నాన్నమాట కూడా కాదని, ఆర్ట్స్ తీసుకుంది. తర్వాత ఎం.బి.ఎ. చేసింది. నేనంటే అంతరాంతరాల్లో ఇష్టమేగాని, తనకి తెలియకుండానే చిన్నప్పట్నుంచీ, ఒకవిధమైన పోటీతత్వం అలవర్చుకుంది. నాకన్నా తను భిన్నంగా, డిఫరెంట్‌గా వుండాలన్న తపన పెంచుకొంది. నాకు లభించిన ప్రతీదీ తను కూడా కావాలనుకొనేది. అది గుర్తించే నాన్న, అమ్మ ఏదైనా కొత్త వస్తువు తెస్తే, రెండు తేవడమే కాదు, ఒకటి ముందు దానికే ఇచ్చేవారు. లేకపోతే నానాగొడవ చేసేది. మీకో సంగతి తెలుసా? నాది ఫక్తు ఎరేంజ్‌డ్ మేరేజ్ కదా! నాన్న ఎంపిక చేసిన 'బదుద్దాయి' చేతనే తలవంచుకొని, మూడుముళ్ళు వేయించుకున్నాను కదా! విజయ అప్పటి వరకు పెళ్ళి వద్దనేది – నా పెళ్ళి ముహూర్తం నిశ్చయం కాగానే, నాకన్నా ముందే తను పెళ్ళి చేసుకొని తీరాలని నిర్ణయించేసుకుంది. కొద్దిపాటి పరిచయం ఉన్న 'సోంబాబు'ని ఆకర్షించి పెళ్ళికొప్పించి, మన పెళ్ళికి మూడు రోజులకు ముందే రిజిస్ట్రారు ఆఫీసులో ప్రేమ పెళ్ళి చేసుకొని, ఆ సోంబాబుతో సహా ఇంటికొచ్చింది. నాన్న ఇక చేసేదేమీ లేక, తననెలాగో ఒప్పించి, మన

పెళ్ళి ముహూర్తానికే వాళ్ళిద్దరి పెళ్ళి మళ్ళీ శాస్త్రోకంగా చేసి, తృప్తి పడ్డారు. ఈవిధంగా నేనూ, మా చెల్లెలు రూపురేఖల్లో ఒకటిగా ఉన్నా, ప్రవృత్తిలో, ప్రవర్తనలో చాలా డిఫరెంట్!"

"అలా ఎందుకు జరిగింది?" అని కుతూహలంగా అడిగాడు.

"అదీ చెప్తాను. నేను ముందు చెప్పింది. 'మోనో జైగోటిక్ ట్విన్స్' గురించి. వాళ్ళు రూపురేఖల్లోనే కాదు, ప్రవర్తనలోను ఒకటిగా ఉంటారు. కాని నేను విజయ 'డైజోగోటిక్ ట్విన్స్' - 'ఫ్రెటర్నల్ ట్విన్స్' అని కూడా అంటారులెండి. వీళ్లెలా జన్మిస్తారో చెప్తా. జాగ్రత్తగా వినండి. కొందరు స్త్రీలలో ఒకే ఋతుచక్రంలో ఒకటికి మించి అండాలు విడుదల అవుతాయి. అలా విడుదలైన అండాలు సంభోగ సమయంలో వేర్వేరు వీర్యకణాలతో కలయిక చెంది వేర్వేరుగా ఫలదీకరణ చెందుతాయి. ఇదివరకు చెప్పుకొన్నవిధంగానే ఆ ఫెర్టిలైజ్డ్ ఓవమ్‌లు వేర్వేరు పిండాలుగాను, తర్వాత శిశువులుగాను పరిణామం చెందుతాయి. అరుదుగా, కొంతమంది స్త్రీలలో ఒక ఋతుచక్రంలో విడుదలైన అండం ఫలదీకరణ చెందిన తర్వాత కొన్నాళ్ళకు ఇంకో అండం విడుదలై అదీ ఫలదీకరణ చెందుతుంది. పిండంగా మారుతుంది. దాదాపు ఒకే నెల తేడాలో తయారైన పిండాలు వేర్వేరు శిశువులుగా గర్భంలో ఎదుగుతాయి. ఈ శిశువులకు మాయ బొడ్డుతాళ్ళు వేరుగా ఉంటాయి. ప్రసవం మాత్రం ఒకేసారి జరుగుతుంది. కొన్ని నిమిషాల తేడాలోనే కవలలు జన్మిస్తారు. పిండాల వయసులో ఒక నెల తేడా ఉన్నా - రెండో శిశువు మాత్రం కొంచెం బలహీనంగా ఉంటుంది. అండాలు, వాటిలో కలిసిన వీర్యకణాలు ఒకేవిధమైనవైతే, కవలలు ఒకే రూపురేఖల్లో ఉంటారు. లేకపోతే కొంచెం భిన్నంగా ఉంటారు. ఇలాంటి 'డైజోగోటిక్' కవలలు ప్రవర్తనలో, ప్రవృత్తిలో 'మోనోజైగోటిక్' కవలలా కాకుండా, కొంచెం భిన్నంగా వుంటారు. నేను, విజయ పది నిమిషాల వ్యత్యాసంలో పుట్టాం. నేను ముందుగా పుట్టాను. మేం డైజోగోటిక్ ట్విన్స్. అందుకే ప్రవర్తనలో, ప్రవృత్తిలో కొంచెం తేడా! పైగా చెల్లెలు పుట్టినప్పుడు కొంచెం బలహీనంగా వుండేదట. అందుకే దాన్ని పదేళ్ళు వచ్చేవరకు ఇంకో ఊళ్ళో అత్తయ్య పెంచింది. అమ్మ ఎంత సౌమ్యురాలో అత్తయ్య అంత కోపిష్టి, గయ్యాళి అని కూడా చెప్పవచ్చు. పదేళ్ళు వచ్చేవరకు తనే పెంచింది కదా చెల్లెలిని - పెంపకంలో

తేడా వలన కూడా, మా ప్రవర్తన, ప్రవృత్తులలో కొంచెం తేడాలొచ్చాయన్నమాట అర్థమైందా?"

భార్య జయ ఎంతో తార్కికంగా చెప్పిన విషయాలన్నీ విన్న రాంబాబుకి ఎంతో ఆశ్చర్యం కలిగింది 'తనకింత విషయ పరిజ్ఞానం ఉందా' అని.

"ఇదంతా సరే. మీరిద్దరు 'డైజోగోటిక్ ట్విన్స్' అవడానికి, మనం విజయ ఉన్నన్ని రోజులు ఉపవాసాలు చేయడానికి మధ్యనున్న లింకేమిటో నాకర్థం కాదు జయా" అన్నాడు.

"అదీ చెప్తాను. మనమైతే పెళ్ళయిన నాటినుంచి 'మూడు రాత్రులు ఆరు ఆటలు' అన్నవిధంగా రాసకేళీలలో నిండా మునిగి వున్నామా, విజయ సంసారం అందుకు విరుద్ధంగా ఉంది. కేవలం పోటీతత్వంతో పెళ్ళి చేసుకుంది గానీ, సంసారం చేయటం లేదని అమ్మద్వారా తెలిసింది. పాపం తనని ప్రేమించి పెళ్ళి చేసుకున్న సోంబాబు డిప్రెషన్‌లో మునిగిపోయున్నాడట! అందుకే విజయ మనతో ఉన్న నాలుగు రోజులు వేర్వేరు గదుల్లో రాత్రుళ్ళు పడుకుని, పగలు 'నిప్పు–ఉప్పు'లా దెబ్బలాడుకోవటం చూస్తే విజయలోని "అక్కకన్నా డిఫరెంట్‌గా ఉండాలన్న ఫోబియా" మేల్కొంటుంది. మన దగ్గరినుంచి వెళ్ళిన వెంటనే సోంబాబుకి సంసార సుఖాన్ని చూపిస్తుంది. అయామ్ ష్యూర్! ఆ పుణ్యం మీకే దక్కుతుంది" అని దృఢంగా పలికింది. రాంబాబుకిక అయిష్టంగానే 'సరేనోయ్' అనాల్సొచ్చింది.

తర్వాత మాగన్నుగా నిద్రపట్టిన రాంబాబుకి ఏడుగంటల వరకు మెలకువ రాలేదు. అలవాటుగా పక్కన తడిమి చూస్తే జయ లేదు. దంతధావనం చేసుకుని, తల దువ్వుకుని మేడమీది గదిలోంచి కిందికి వెళ్ళేడు. డైనింగ్ టేబుల్ ముందు కూర్చుని కబుర్లాడుతున్న ఇద్దరు సుందరాంగులను చూశాడు. ఇద్దరికీ ముమ్మూర్తులా ఒకటే రూపం! కాదంటే, పేంటు షర్టు వేసుకున్నది మరదలు విజయ అని, చీర సింగారించుకున్నది తన భార్య జయ అని పోల్చుకోగలిగాడు.

"బావగారూ బాగున్నారా!" సినిమా టైటిల్‌తో పలకరించేసరికి ఆనందపడిపోయాడు. ఆ మోడర్న్ డ్రస్సులో ఉబికి ఉబికి ఉన్న అవయవ

సౌష్టవాన్ని చూసి మనసులోనే చొంగ కార్చేడు. అయినా తమాయించుకుని "యా... యా..." అంటూ హాల్లో సోఫాలో కూలబడి న్యూస్‌పేపరు ముఖానికడ్డం పెట్టుకుని, మరదలివైపు దొంగచూపులు చూడసాగాడు.

ఇంతలో జయ ఉప్మా ప్లేటు తెచ్చి, ముందుంచింది. 'ఉప్పు-నిప్పు' అని కోడ్ వర్డ్ మెల్లగా అని కన్నుకొట్టింది. రాంబాబుకి తను చేయవలసిందేమిటో అర్థమైంది. "నాకు ఉప్మా ఇష్టం లేదని తెలియదా" అని కసురుకొన్నాడు. ప్లేటుని తోసేశాడు. నిజానికతనికి ఉప్మా అంటే చచ్చేంత ఇష్టం. పైగా జీడిపప్పు పలుకులు చాలా ఉండి ఊరిస్తున్నాయి.

"ఎవరికి తెలుసు" అని పెడసరంగా జవాబిచ్చి, జయ జీడిపప్పుతో నిండిన ఉప్మా ప్లేటును తీసుకొని వెళ్ళిపోతుంటే, నిస్సహాయంగా వుండిపోయాడు. తర్వాత తెచ్చిచ్చిన కాఫీ సగమే తాగి వదిలేసి, దానికీ వంకలు పెట్టాడు. నిజానికి కాఫీ ఎప్పటిలా బాగానే వుంది. జయ కూడా మాటకి మాట చెప్పి నాటకం రక్తి కట్టించింది. రాంబాబు రుసరుస లాడుతూనే తయారై ఆఫీసుకు వెళ్ళిపోయాడు. రాత్రి లేటుగా ఇంటికి వచ్చాడు ధుమధుమలాడుతూ. భోజనమయ్యాక టీవీలో క్రికెట్ మేచ్ చూస్తుంటే, జయ వచ్చి చానల్ మార్చేసింది. కాసేపు ఇద్దరి మధ్య మాటల తూటాలు పేలాయి. రాంబాబు ధుమధుమ లాడుతూ గెస్టు రూమ్‌లోకి దూరిపోయి అక్కడే పడుకున్నాడు. ఇలా మిగిలిన మూడు రోజులు ప్రతి చిన్న విషయానికి దెబ్బలాడుకుంటూ రాత్రిళ్ళు వేర్వేరు గదుల్లో పడుకున్నారు. ఇదంతా చూస్తున్న విజయ మౌనంగానే వుండిపోయింది గాని పైకేమీ అనలేదు. ఇద్దరికీ సర్దిచెప్పడానికి గాని, రాజీ చేయడానికి గాని ప్రయత్నించలేదు. అస్తమానూ ఏదో ఆలోచిస్తూ ఉండిపోయేది. అది చూసి జయ మనసులో సంతోషించింది. చిట్కా పనిచేస్తుందనుకొంది.

ఇక, ఆఖరిరాత్రి రాంబాబుకి కాళరాత్రయింది. పన్నెండు గంటలైనా నిద్రపట్టడం లేదు. ఆఖరికి 'అమ్మయ్య' ఇది చివరి రాత్రి. రేపు ఉదయం విజయ వెళ్ళిపోతుంది. ఇక నాకు మళ్ళీ స్వర్గద్వారాలు తెరుచుకుంటాయి' అని పదే పదే అనుకున్నాడు. దాంతో నిద్రపట్టింది. గాఢనిద్ర పట్టింది. మధురమైన కల వచ్చింది.

తను జయ ఆకాశంలో తేలిపోతూ ఉన్నారు. ఒకరినొకరు గాఢాలింగనం చేసుకొని- కాసేపటికి ఒక ధవళవర్ణ మేఘం ఎదురొచ్చి పలకరించింది. నన్ను పరుపుగా చేసుకొని మీ ప్రణయకలాపం సలిపి ధన్యురాలిని చేయండి అని అభ్యర్థించింది. సరేనని, దానిపై శయనించి ప్రణయ క్రీడ సాగించారు. పరస్పరం ఆర్తితో చుంబించుకున్నారు. చేతుల్ని మాత్రం ఖాళీగా ఎందుకు ఉంచాలని రాంబాబు జయ శరీరంలోని ఎత్తుల్ని తడిమి పట్టుకొని బాగా మర్థించసాగాడు.

"ఊ... ఊ..." అని తన్మయత్వం నిండిన స్త్రీ మూలుగు విని రాంబాబుకీ మెలకువ వచ్చింది. ఈ లోకంలోకి వచ్చి కళ్ళు తెరిచి చూస్తే తననల్లుకుని ఉన్న స్త్రీ కనిపించింది.

"ఓహో! ఇది కలకాదు – భార్య జయ పక్కలోకి వచ్చింది. తను కూడా ఇక తాళలేక, ఈ ఆఖరిరాత్రి గడిచేదాకా ఆగే ఓపికలేక, చెల్లెలు గాఢనిద్రలో మునిగాక, తన పక్కలోకి దూరిందన్నమాట. ఇక తనకెందుకు అభ్యంతరం అనుకున్నాడు. అంతే ప్రణయోత్సాహం రెట్టింపయింది. ఇక మన్మథుడు వ్యవహారం మొత్తం తన చేతిలోకి తీసుకున్నాడు. స్పందన, ప్రతిస్పందనలోను, కొంతమేరకు సైజుల్లోను ఉన్న తేడాను గమనించనీయలేదు. కాలం స్తంభించిపోయింది. రెండు శరీరాలు ఒకటైనాయి. ఇద్దరికీ నోళ్ళు మూగబోయాయి. మాటల్లేకుండానే, శృంగారాంబుధిలో మునకలేస్తూ, తేలుతూ క్రీడించసాగారు. ఎంత సమయం గడిచిందో గాని, సంపూర్ణ తృప్తితో రెండు శరీరాలు విడిపోయాయి. ఇంకా ఆర్తి చల్లారక, ఒకర్నొకరు గట్టిగా హత్తుకున్నారు. ఆలింగనం నుంచి నెమ్మదిగా విడిపించు కుని, మంచంమీద నుంచి దిగి, మెల్లగా నైటీ వేసుకుంటున్న శృంగారమూర్తిని, తన్మయత్వంతో అరమోడ్పు కళ్ళతో చూస్తూ అన్నాడు రాంబాబు, హృదయపూర్వకంగా "థేంక్యూ జయా" అని.

"కాదు బావా నేను విజయను – నేనే థేంక్సు చెప్పాలి. స్త్రీ పురుషుల కలయికలో ఇంత మధురిమ ఉంటుందని తెలియజేసినందుకు నా కళ్ళిప్పుడు తెరుచుకున్నాయి. నా సంసారం బాగుపడ్డట్టే. ఇన్నాళ్ళూ దూరంగా ఉంచిన సోంబాబుని ఇక దరికి తీసుకుంటాను. మీ ఇద్దరి కోరిక ఇదేనని నాకు తెలుసు. మీ దాంపత్య జీవితం హాయిగా ఉందనీ తెలుసు. కేవలం నాలో మార్పు తీసుకుని

రావడం కోసం "ఉప్పు- నిప్పు"లా నాటకమాడారని మొదటిరోజునే అర్థమైంది. ఇదంతా అక్కయ్య ఆలోచనేనని ఊహించాను. కాని నాకో బలహీనత ఉంది. అక్కకి దొరికిందేదైనా, నేను కూడా పొందాలని. నేనంటే నీకూ ఆకర్షణ ఉందని గ్రహించాక ఇలా సాహసించాను. ఇది అక్కయ్యకు ఎట్టి పరిస్థితుల్లోనూ తెలియకూడదు. ఇంకోసారి జరగకూడదు. జీవితంలో ఒకేసారి పొందదగ్గ అద్భుతమైన అనుభూతిగా, ఈ సంఘటనను భావిద్దాం. అక్కయ్య నిజంగా దేవత, తన ముందు మనం అల్పులం. సరే మరోసారి థేంక్స్" అంటూ వెళ్ళిపోయింది.

రాంబాబు కాసేపు కొయ్యబారిపోయాడు. తర్వాత తేలుకుట్టిన దొంగలా ఉండి పోయాడు-

మర్నాడు పొద్దున వెళ్ళిపోయేటప్పుడు విజయ ఏమీ జరగనట్టు "వస్తా బావా" అని చెప్పి నిష్క్రమించింది రాంబాబు ఇంట్లోంచి.

వారం రోజుల తర్వాత జయ సంతోషంగా గంతులు వేసుకుంటూ వచ్చి, మన నాటకం ఫలించిందండి. ఉపవాస వ్రతం కూడా ఫలించిందండి. ఇదిగో విజయ ఉత్తరం రాసింది. అంటూ ఉత్తరం ఇచ్చింది. అందులో విజయ నంగనాచిలా ఇలా రాసింది -

ప్రియమైన అక్కకు

క్షేమం - నేను చాలాకాలం స్త్రీ పురుషుల కలయికను అసహ్యించుకునేదాన్ని - కాని ఇప్పుడు అందులో ఉన్న మధురిమను హాయిగా ఆస్వాదిస్తున్నాను. ఇన్నాళ్ళు ఓపిక పట్టిన సోంబాబు నాకెలాగో నచ్చజెప్పి ఇందులోకి దించాడు. ఇక నాకు బయటికి రావాలని లేదు. నువ్వు కూడా మళ్ళీ బుద్ధి తెచ్చుకుని సంసార సుఖానికి ద్వారాలు తెరిచి, నాలానే ధన్యురాలివి కావాలని మనసారా కోరుకుంటున్నాను. అక్కడికి వచ్చినప్పుడు గమనించాను. మీరిద్దరు అస్తమానూ కొట్లాడుకుంటున్నారని - శరీరాలు ఏకం అయితే మనసులు ఏకం అవుతాయి. స్వానుభవంతో చెప్తున్నాను. సంవత్సరం లోపులో కవల పిల్లలకు తల్లి కావాలన్న ప్రయత్నంలో ఉన్నాను. నా కవలవి గాబట్టి నువ్వూ అదే చేయాలి ఇక ఉంటాను-

నీ చెల్లెలు.

ఉత్తరం చదివాక ఏం మాట్లాడాలో తెలియలేదు రాంబాబుకి 'అమ్మ ఎంత నంగనాచి' అనుకున్నాడు మనసులో.

"ఓహో బావగారికి నమస్కారాలు అని రాయలేదని కోపమా? సరేలెండి - సోంబాబు అదృష్టవంతుడు - నా చెల్లెలు చాలా మంచిది" అంటూ లోపలికి వెళ్ళిపోయింది.

వీళ్ళెక్కడి 'డైజోగోటిక్ ట్విన్స్'రా బాబూ. ఒకతె ఎంతో అమాయకపు ముద్ద - రెండోది గడుగ్గాయి. భలే కవలలులే' అనుకున్నాడు రాంబాబు.

*(**22-11-06** నవ్యవారపత్రికలో ప్రచురితం)*

# తాతగారి చిన్నిల్లు

బామ్మగారి భర్త "ఏర్పాట్లు చేసుకున్న చిన్నిల్లు" గురించి పూర్తి వివరాలు సేకరించవలసిన 'పరిశోధన' ఇది........

ధనాకుల ధనపతి, "డిటెక్టివ్ ధనాధన్" అని బోర్డు పెట్టుకొని తన బాబాయ్‌గారి ఖాళీ కారు షెడ్డులో "అపరాధ పరిశోధనా కార్యాలయం" ప్రారంభించిన మూడు నెలల తరువాత, వచ్చిన మొదటి కేసు ఇది.

"ఆయ్! ఈవిడ మా బామ్మండి... ఆయ్... ఆ రోజుల్లో మీ మామ్మగారి క్లాస్‌మేటండి... ఆయ్.. మెట్రిక్ పరీక్ష రాసిందండి... ఆయ్... ఫెయిల్ అయిందనుకోండి... టీవీలోలా భలే మాట్లాడతాదండి... ఆయ్... ఇంగ్లీష్ వచ్చండి... ఆయ్..." తను కూర్చోమనకుండానే కూర్చుని చున్నీ సర్దుకుంటున్న ముద్దుగుమ్మ కేసి మురిపెంగా చూశాడు... ధనపతి అదే డిటెక్టివ్ ధనాధన్... మరీ ఎక్కువసేపు పిల్లకేసి చూస్తుండిపోతుంటే, కేసు జారిపోతుందే మోనన్న భయం కలిగి, ఆ పిల్ల కూడా వచ్చి, అపసోపాలు పడుతూ సోపాలో కూలబడిన బామ్మగారి వైపు దృష్టి మరల్చాడు.

బూరుగు దూది పరుపుకు బూడిద రంగు చీర చుట్టినట్లున్న భారీకాయం... పాపిట్లోంచి, చెంపల చివర్లోంచి, తొంగి చూస్తూ మెరుస్తున్న తెల్ల వెంట్రుకల కొనల్ని బట్టి మిగతా జుట్టంతా నల్లనల్లగా నిగనిగలాడుతున్నా అసలు రంగు ముగ్గుబుట్టేనని తెలిసిపోతోంది. దట్టించిన పౌడరు, భానుమతి టైపు బొట్టు, వయసుకు తగని విధంగా ధరించిన స్లీవ్‌లెస్ లోనెక్ జాకెట్‌లో ఇమడలేకపోతున్న సౌష్టవం... ముఖ్యంగా ఉదరం, నడుం చుట్టూ ఉన్న ట్రాక్టరు టైర్లు... మొత్తానికి 'మోడ్రన్ బామ్మే' అని అంచనాకు వచ్చాడు మన డిటెక్టివ్ ధనాధన్... ఈవిడకి తనతో ఏం పని పడిందో అని ఆశ్చర్యపోయాడు కూడా...!

అంతలోనే మళ్లీ అందుకొంది ముద్దుగుమ్మ... "ఆయ్! నా పేరు గీతండి... మా బామ్మకు మీతో పనిపడిందండి.

"మీ బామ్మపేరు"

"లంగాయమ్మ, లంగాయమ్మ..." బామ్మగారి గొంతు ప్రతిధ్వనించింది గీతకడ్డు వస్తూ...

ఆ! ఇదేంపేరు అని విస్తుపోతున్న డిటెక్టివ్‌ని చూసి కిసుక్కున నవ్వింది గీత... "ఆయ్ బామ్మ పేరు రంగాయమ్మ అండి తనకి 'ర' పలకడం రాదండి... కానీ భలే మాట్లాడ తాదండి.... ఆయ్.... టీవీ సీరియల్స్ బాగా చూస్తాందండి" ఈసారి ఆయ్ అనకుండా 'కుయ్యో' అంది బామ్మ పిక్కపాశం పెట్టినందువల్ల.

"ఒకే.... లంగా... సారీ రంగాయమ్మ పేరు రాసుకున్నా"

"మరి వయస్సు..." నోట్‌బుక్‌లో కెలుకుతూ అడిగేడు డిటెక్టివ్‌లానే ఫోజు కొడుతూ.

"అలవై మూడు... సిక్స్‌టీత్రీ" లాసుకో బాబూ "వెంటనే పలికింది" మా కామాక్షి మనవడివి కదా ఫీజు ముందే మాట్లాడనక్కర్లేదని తెల్సులే అంటూ ముందరి కాళ్లకి బంధం వేసింది.

ఫీజు ప్రస్తావనతో కంగుతిన్నా. 'సరే మొదటి కేసు కదా' అని సర్దిచెప్పుకొని తర్వాతి ప్రశ్న అడిగేడు ధనాధన్ ముక్కుమీద పెన్సిల్‌తో కొట్టుకుంటూ... "సెక్స్" అని.

"ఫిమేల్" అని దర్జాగా చెప్తాదనుకున్నాడు; ఇంగ్లీషు వచ్చు గాబట్టి-

మెలికలు తిరిగిపోతూ... "ఆ, ఏదో అప్పుడప్పుడు తంటాలు పడుతుంటాంలే బాబూ.... అని బామ్మ చెప్పేసరికి అర్థం కాక బిత్తరపోయాడు.

మళ్లీ కిసుక్కున నవ్వింది గీత.

"ఆయన అడిగింది అది కాదే బామ్మా......

సర్లే అప్పుడప్పుడు కాదు రోజూ తంటాలు పడమని తాతగారికి చెప్పమంటావా..." అనేసి మళ్లీ గిల్లుతుందేమోనని ఆవిడకి దూరంగా జరిగి

అతికష్టం మీద తెరలు తెరలగా వస్తున్న నవ్వాపుకుని డిటెక్టివ్ కేసి సీరియస్‌గా చూస్తూ అడిగింది.

"ఏం క్వశ్చన్ అండి అది?"....

"అయ్.. అడక్కుండానే రాసుకోవచ్చు కదా... ఫిమేల్ అని... ఆడో మగో చూస్తుంటే తెలియడంలా అయ్!"

అంటూ గీత కసురుకున్న కాసేపటికి ధనాధన్‌కి ట్యూబ్‌లైట్ వెలిగింది.

'హోత్తెరీ! ఈవిడ వయసు అరవైమూడు.... ఆయనింకా పెద్దోడే అయ్యుంటాడు. వీళ్ళింకా సంసారంలో 'రిటైరవ్వ'లేదా? అప్పుడప్పుడు తంటాలు పడుతున్నారా?" అని బోలెడు ఆశ్చర్యపోయాడు!!

ఇంకేమి అడిగితే ఏం తంటా వస్తుందో అనిపించి బుక్ మూసేసి... "లంగాయమ్మ గారూ... సారీ రంగాయమ్మగారూ... అసలు మీ సమస్య ఏమిటో చెప్పండి" అన్నాడు.

ఎదురుగా ఉన్న ఖాళీ కప్పుకేసి అదేదో సినిమాలో డిటెక్టివ్‌లా చూస్తూండిపోయాడు ధనాధన్....

రంగాయమ్మగారు టెలీ సీరియల్లులో పాత్రధారిలా, భారంగా నిట్టూర్చి అరవవాసనతో కూడిన తెలుగు డబ్బింగులా 'ర' పలుకలేని తన భాషతో తన సమస్యను చెప్పసాగేరు.... సుదీర్ఘంగా సాగదీశారు...

"హూ!హూ!చెప్తా బాబూ...

నా సమస్యని...

కాదు కథని...

ఈ వయస్సులోనే ఇలా... భలేగా ఉన్నానా....

"....మీ మామ్మ కామాక్షి నేనూ చిన్నప్పుడు లంగా ఓణీ వేసుకొని 'టింగు లంగా' అంటూ జంటగా..." ఇక ఓర్చుకోలేకోయిన ధనాధన్ అరిచేడు... ఆగండి...

అసలు సంగతి చెప్పండి అని

"సలే... సలే... అసలు సంగతి ఎలా చెప్పను... ఎలా చెప్పాలి?"....

"హు! నా పచ్చని కాపులంలో ఒక తాచుపాము చేలి చిచ్చు పెట్టింది బాబూ... హూ... చిచ్చే పెట్టింది ఈ లంగాయమ్మ కాపులంలో... హూ....

....లంగా....లంగా.... అంటూ నా కొంగు పట్టుకొని తిలిగే నా తింగలి నాధుడ్ని... అదే నా నాయుడు బావని నాకు కాకుండా చేస్తోందావిధి... హూ...!

ఈ 'క్లూలాతి క్లూలమైన' విధికి బుద్ధిలేదు...

దీనికి దయలేదు....

అయ్యో 'లామా'...

అయ్యో 'లామాచంద్లా....' కొంగుతో ధారాపాతంగా కారుతున్న కన్నీళ్లు తుడుచుకుంటూ... పనిలో పనిగా ముక్కు చీదుకోబోతుంటే అదిరిపడ్డాడు ధనాధన్ అనబడే ధనపతి...

పొరపాటున చీమిడి తనమీదకి తేస్తుందేమో అని... అలా చేయలేదు కానీ... చక్కని సోఫా కవరుకి ముక్కును సుతారంగా తుడుచుకోవడం చూసి కళ్లు మిటకరిస్తూ ఉండిపోయాడు.

కిటికీలోంచి ఆకాశంకేసి ఓసారి దీర్ఘంగా చూసి "హూమ్" అని భారంగా నిట్టూర్చి... తన కథని... తన వ్యధని చెప్పటానికి మళ్ళీ ఉపక్రమించింది రంగాయమ్మ.

గట్టిగా గాలి పీల్చుకొని కదిలిపోతున్న భారీకాయాన్ని అదుపు చేయడానికి యత్నిస్తూ సీరియల్ భాషని కొనసాగించింది.

.... ఇంతకీ చెప్పొచ్చేదేమంటే... మలేమో... మలేమో... నీకిందాకనే తెలిసొచ్చింది కదా... మాదప్పుడప్పుడు.... "తంటాలు పడే కాపులం" అని... కానీ బాబూ దానికీ ఈ మధ్య 'గండి' పడింది బాబూ... 'గండి' పడింది...

ఒక్కమాటలో చెప్పాలంటే మా ఆయన... మా నాయుడు బావ ఈ మధ్య ఎక్కడో "చిన్నిల్లు" పెట్టాడు... హు... "చిన్నిల్లు" పెట్టాడు....

భారంగా నిట్టూర్పుల తర్వాత నిట్టూర్పులు విడుస్తూ ఆయాసపడుతుంటే ఆవిడ మానానికి ఆవిడని వదిలేసి గీతని అడిగాడు అమాయకంగా... "చిన్నిల్లు అంటే ఏమిటి గీతగారు".....

కిసుక్కున నవ్వింది గీత.... బొమ్మ మొట్టికాయ వేయబోతుంటే తప్పించుకొంటూ చెప్పింది...

భలేవారే... 'చిన్నిల్లు' అంటే తెలియదా? "సెకండ్ సెటప్"! ఇంకోదాన్ని తగులుకొని...

వెంటనే అందుకొంది రంగాయమ్మ..."ఛ... అదేం భాషే తల్లీ... నేనే చెప్తా... ఇప్పుడు... మళ్లీ... మంగళతోలణాల సాక్షిగా....

"ఆగండి... బాబోయ్ ఆగండి... ఓ 'కీప్'ని వేరే ఇంట్లో పెట్టి మెయిన్‌టెయిన్ చేస్తున్నాడన్న మాట పెద్దాయన... అదన్నమాట – 'చిన్నిల్లు' అంటే అర్థమైపోయింది" ఇంచుమించుగా అరిచేడు ధనాధన్...

అయినా రంగాయమ్మగారు ఆగలేదు... ఈ మధ్యలో భర్తలో తాను కనుగొన్న మార్పుల్ని వివరించింది తన భాషలో... 'కొత్త రుచులు' చూసిన హుషారు.. అతనిలో దాచుకున్నా దాగని వైనం, ఎప్పుడూ లేనిది బయటికి వెళ్తూ చంకల్లో సెంటు కొట్టుకుంటున్న విషయం... 'ల ల్ల ల్లా' అంటూ కూనిరాగాలు తీసుకుంటూ రోజూ సాయంత్రం 'ఠంచనుగా' బయటకు పోయి ఎప్పుడో తెల్లవారుజామున ఇంటికొచ్చి 'అటుతిరిగి' పడుకొంటున్న వివరం... ఈ మధ్య డబ్బు కూడా ఎక్కువ ఖర్చు పెడుతున్నట్లు అనుమానం... అన్నీ ఎక్కువ సిగ్గుపడ కుండానే చెప్పేసింది!

కాదంటే పక్కనున్న చిన్నది అదే గీత మాత్రం కొంచెం సిగ్గు పడాల్సి వచ్చింది.

'మీరు చెప్పిన వివరాలు వింటూంటే మీఆయన 'చిన్నిల్లు' పెట్టాడనుకోవడానికి ప్రాథమికాధారాలు ఉన్నాయి..." బాగా లోతుగా పరిశోధించి...

"అదేదో త్వలగా" చెయ్ బాబూ.. మా కామాక్షి మనవడివి కాబట్టి ఫీజు...

బాబోయ్... ఫీజ్ మీరెంత ఇస్తే అంత... సరేనా... అయితే మీ ఆయన ఫొటో ఇచ్చి వెళ్లండి... అని అర్థించాడు చేతులు జోడించి.

"సలే... తీస్కో... మళ్ళీ ఇచ్చేయాలి సుమా... ఇది మంగళతోలణాల మధ్య...

తలకొట్టుకున్నాడు డిటెక్టివ్ ధనాధన్.... ఆవిడిస్తున్న పెళ్లినాటి ఫొటో చూసి... కాదండి లేటెస్టుది కావాలి అని మళ్ళీ చేతులు జోడించాడు.

గీత కిసుక్కుమంది... అంతలోనే... "ఆయ్! నేను తెచ్చాను లెండి లేటెస్ట్ ఫొటో తాతగారిది... ఆయ్" అంటూ తన హ్యాండ్ బ్యాగ్‌లోంచి ఫొటో తీసిచ్చింది. తన చెయ్యి తగలకుండా జాగ్రత్త పడింది.

రంగాయమ్మగారు, గీత లేచి వెళ్లిపోతుంటే చూస్తుండిపోయాడు... వాళ్ళు కనుమరుగయ్యాక కళ్లు మూసుకొన్నాడు... తన మొదటి కేసు గురించి దీర్ఘాలోచనలో పడిపోయాడు.

ఏదో చప్పుడయి... ఉలిక్కిపడి కళ్లు తెరిచి మళ్లీ లోపలికి వచ్చిన బామ్మగారిని చూసి ఆశ్చర్యపోయాడు...

"ఏం లేదు బాబూ... నా సెల్ నెంబలి"ద్దామని వచ్చా అంటూ తన విజిటింగ్ కార్డు ఇచ్చి వచ్చినంత వేగంగా వెళ్లిపోయింది.

'అమ్మ బామ్మా... విజిటింగ్ కార్డు... సెల్... ఇంకేం' అనుకొన్నాడు.

వారం రోజుల తర్వాత ఓ సాయంకాలం గులాబీరంగు పంజాబీ డ్రస్సువేసుకొని కళ్లద్దాలు పెట్టుకున్న ఓ భారీ శాల్తీ లోపలకొచ్చి సెల్‌లో సంభాషణలు కొనసాగిస్తుంటే గుర్తుపట్టలేకపోయాడు ధనాధన్.

"ఒకే... ముక్కలన్నీ బాగా వేగాయో లేదో చూడు... చిటికెడు పసుపు, ఉప్పు చల్లు... కాసేపుంచి మూకుడు దించేయ్... ఇందాక చెప్పానే ఆ పేస్ట్‌లో కలిపేయ్... ప్లేటులో అందంగా పెట్టు... అంతే లెడీ... కిచ్‌మిడి... లెడీ..."

"రెడీ" బదులు "లెడీ" అంటున్న వైనాన్ని బట్టి మాత్రమే, ఆ వచ్చిన భారీ శాల్తీ రంగాయమ్మ అని గుర్తుపట్టేడు.

"అయ్యో లామా.... నూనె మలుగుతున్నప్పుడు నీళ్ళు చల్లకూడదు... ముఖం మీద చిందుద్ది... జాగ్లత్తా..." ఈ సంభాషణని బట్టి రంగాయమ్మ కుకింగ్ క్లాసులను సెల్ ద్వారా నిర్వహిస్తోందని గ్రహించేడు ధనాధన్.. కానీ ఆవిడ డ్రస్సు తీరుమాత్రం అర్థం కాలేదు...

"ఇదేంటి బామ్మగారూ... ఈ డ్రస్సూ... ఈ అవతారం...

"కొత్త అవతాలమే బాబూ... ఇందాక ఫోన్ చేసి మా ఆయన చిన్నిల్లు కనిపెట్టేశానని చెప్పేవు కదా... అక్కడికి తీసుకు వెళ్తానన్నావు కదా... మాలు వేషం వేసుకువెళ్తే బాగుం టుందని.....

"ఇలా పంజాబీ డ్లస్సు వేసుకొని, పక్కపాపిడి తీసుకొని హైహీల్స్ వేసుకొని వచ్చాను... బాగుంది కదా.... బాగా చిన్నదానిలా కనపడుతున్నాను కదా..." అంటూ గారాలు పోయింది రంగాయమ్మ.

'మాయదారి మారువేషం! ఈవిడతో ఇలా వెళ్తే రోడ్డుమీద అందరూ తనని వింతగా చూస్తారు. ఖర్మ! తప్పదు... అని లోపలే అనుకొని పైకి మాత్రం... మారువేషం బాగానే ఉంది కానీ.... ఈమాత్రం సరిపోదు బామ్మగారూ... ఈ బుర్కా వేసుకోండి... పైగా ఇద్దరమూ ఈ హెల్మెట్లు పెట్టుకుందాం... ఎవరూ గుర్తు పట్టలేరు. డిటెక్టివ్‌లు అన్నీ ముందే ఆలోచించి ఉంచుతారు... ఊ... త్వరగా బయలుదేరండి... గీతను తీసుకురాకుండా మంచి పనిచేశారు... పదండి... బుర్కా వేసుకోండి... అంటూ తొందరపెట్టేడు. తనూ హెల్మెట్ తగిలించుకుంటూ, తన తెలివితేటలకు తనే మురిసిపోయేడు.

ఇష్టం లేకపోయినా బుర్కా వేసుకొని హెల్మెట్ తగిలించుకొని బయటకు వస్తుంటే మళ్లీ సెల్‌ఫోన్ మోగింది.

"ఓ.... నువ్వా లతా... పదమూడు ఆవాలు... తులం జీలగల్ల... అలస్పూన్ గసగసాలు... కొంచెం నూనె వేగాక వేయించి... ఆ.... అయిందా కొంచెం దోలగా

వేగాక... ఇందాక మిక్సీలో లుబ్బి ఉంచావే... ఆ క్యాలెట్ ముద్ద, అల్లం పేస్టు వేసి గ్లాసుడు నీళ్లు పోసి మలగబెట్టు... 'హై'లో కాదు 'లో'లో... మూడు నిమిషాలు తల్వాత పొయ్యి ఆల్పేయి... గిన్నెలోకి దించు... లెడీ... క్యాలెట్ కట్టు లెడీ... తిన్నాక ఎలా ఉందో ఫోన్ చేసి చెప్పు ఉంటా" అంటూ సెల్ ఆఫ్ చేసి ధనపతి అదే ధనాధన్ వైపు గర్వంగా చూసింది.

"అమ్మా... మీ కుకింగ్ క్లాసులకి ఓ దణ్ణం... కాసేపు సెల్ పూర్తిగా ఆపేసి బయల్దేరండి" అని కొంచెం గట్టిగా చెప్పేసరికి చిన్నబుచ్చుకొని సెల్ పూర్తిగా కట్టేసి బయటకు నడిచింది.

"ఏదీ మోటాల్ బైక్" అని అడిగింది. హెల్మెట్ పెట్టుకోమన్నాడు కదా... మోటార్‌బైక్ మీద తీసుకువెళతాడని ఆశపడింది.

"మోటారు బైకా... పాడా... నాకే బైక్ లేదు... ఈ రెండు హెల్మెట్లు అద్దెకు తెచ్చినవే... ఇవి పెట్టుకొని వెళ్తే మనల్నెవరూ గుర్తుపట్టరని..." తన తెలివితేటలకు తానే మురిసి పోయాడు ధనాధన్ మరోసారి...

నడిచి వెళ్లాలని అర్థమై నిరుత్సాహపడిపోయింది బామ్మగారు.

ఎన్నో సందులు గొందులు తిప్పి ఒక పాత పెంకుటింటి వెనక్కి తీసుకెళ్లాడు... . హెల్మెట్లు పెట్టుకొని నడిచి వెళుతున్న వీరిని దార్లో వింతగా చూస్తున్నా లెక్కచేయలేదు.

"ఇదే ఇల్లు... రోజూ ఈ ఇంటికే వస్తున్నాడు మీ ఆయన" అని గుసగుసగా చెప్పాడు. హెల్మెట్ ఉన్నందువలన స్పష్టంగా వినపడలేదు రంగాయమ్మకి... ఏం కాదులే నా వెనుకే రమ్మన్నట్లు సైగ చేశాడు. దొడ్డి గుమ్మాన్ని నెమ్మదిగా తోశాడు. కిర్రుమంటూ తెరుచుకొంది... ఇద్దరూ లోపలికి వెళ్లారు.. వరండాలోంచి హాలులోకి వెళ్లారు. చిమ్మచీకటిలో తడుముకుంటూ... హాల్లో మాత్రం కొంచెం వెలుతురు ఉంది. లోపల గదిలో మెల్లగా మాటలు, గుసగుసలు వినపడ్డాయి!

'రెడ్ హ్యాండెడ్'గా పట్టేసుకొందామని డిటెక్టివ్ ధనాధన్ చేసిన సైగను హెల్మెట్‌తో ఉన్న తలను ఊపుతూ ఆమోదించింది రంగాయమ్మ.

'మాయలోడు... ఈ గదిలో కులుకుతున్నాడా? అదెవత్తో మాయలాడితో...' అని పళ్ళు కొరుక్కుంది. ఇక కోపం ఆగలేదు... ఆవేశంతో గది తలుపులు ఫెడేలుమని తన్నింది. గడిపెట్టకపోవడంతో తలుపులు ధబేలున తెరుచుకున్నాయి. ఆ ఊపుకి ముందుకి పడి పోయింది... 'అమ్మో... అంటూ బాధగా అరిచింది... 'లామా... లామా...' అని రామచంద్రుడిని తలుచుకొని వెంటనే లేవలేకపోయినా, కళ్లు చిట్లించుకొని చూసింది. గదిలో వెలుతురు బాగానే ఉంది. గదంతా కలయజూసింది. మళ్లీ మళ్లీ చూసింది.

మంచంమీద కులుకుతున్న ఆడా మగద్వయం కనపడలేదు అనుకొన్నట్లుగా... హెల్మెట్ తొలగించి చూసింది. ఓ మూలన బిత్తర చూపులు చూస్తున్న నలుగురిని చూసింది. వారిలో మధ్యన ఉన్నది తన మగడే... నాయుడు బావ! మిగిలిన ముగ్గురూ మగవాళ్లే...తనకు పరిచితులే... ఆయన స్నేహితులు... నేలమీద చిందవందరగా పేకముక్కలు... డబ్బులు... సగం నిండిన గ్లాసులు... మాంసం పకోడి ప్లేట్లు!

ఆ నలుగురు రంగాయమ్మను మగడితో సహా 'లామ... లామ' అన్నప్పుడే పోల్చుకోగలిగారు. కానీ ఎందుకొచ్చిందో... కూడా ఉన్నదెవరో అర్థం కాక కంగారు పడసాగేరు...

పేకముక్కలు, మాంసం ముక్కల ప్లేటు చూసిన వెంటనే రంగాయమ్మకు విషయమంతా తేటతెల్లమైపోయింది. తన మగడు నాయుడు బావ, రోజూ రహస్యంగా వచ్చి ఇక్కడ చేస్తున్నది కేవలం చతుర్ముఖ పారాయణమే... అంటే పేకాట మాత్రమేనని... చిన్నిల్లు పెట్టలేదని అర్థమైపోయింది.

"అయ్యో లామచంద్లా. నా బావని ఎంత అపాల్దం చేసుకున్నాను.." అని పైకే అనేసి కళ్లొత్తుకుంది! అప్పుడు పక్కకి చూసింది. కానీ డిటెక్టివ్ ధనాధన్ కనపడలేదు. ఎప్పుడో జారుకున్నాడు. అతనికి నాయుడుగారు "చిన్నిల్లు" పెట్టలేదని ఇదంతా పేకాట రాయుడి తంటాలు మాత్రమేనని అర్థమైపోయింది మరి!!

***(28-6-2006 నవ్య వారపత్రికలో ప్రచురితం)***

# అఘాయిత్యం

ఈసారి నాకు మా ఆవిడమీద చాలా కోపం వచ్చింది . అంటే ఇదివరకెప్పుడూ అర్ధాంగి మీద నాకు కించిత్తైనా కోపం రాలేదని కాదు. మాకు పెళ్ళయిన ముహూర్తం ఎటువంటిదో గాని 'తను' నాకు కోపం తెప్పించని రోజు లేనేలేదు. అయినా 'భార్యనుకూలుడి' ఉండటం అలవాటయిపోయిన నేను ఎప్పుడూ కోపాన్ని దిగమింగుకొంటూనే ఉంటాను. ప్రతి చిన్న విషయంలోను తన ఇష్టమే చెల్లించుకొంటున్నా, లోలోపలే ఉడికిపోతూ, పైకి నోరెత్తకుండా, ఈ సంసార సాగరాన్ని ఏదో నేను కాబట్టి ముఖంమీద చిరునవ్వు చెదరకుండా ఈదుకొస్తున్నాను. ఏదో పోనీలేకదా అని, అలా మొదట్నుంచీ తను ఆడిందే ఆటగా, పాడిందే పాటగా జరుపుకొస్తున్నాను గాబట్టే తను ఈనాడు నాకింత అనుచితమైన ఆజ్ఞ జారీ చేసింది; ఎప్పటిలానే అభ్యర్థన రూపంలోనే –

ఈసారి మా ఆవిడ; "రాణీ" అను సార్ధక నామధేయురాలు, నన్ను కోరిన 'చిన్నకోరిక' వినగానే నాకు వళ్ళు కంపరమెక్కింది. మెదడు మొద్దెక్కిపోయింది. ఇంతకూ తను నన్ను కోరిన 'కోరిక' ఆవిడి భాషలోనే చెప్పాలంటే – 'సుందరి మీద అఘాయిత్యం చేయబోవాలట (అంటే ఇల్లు అద్దెకిచ్చినావిడికూతురు) – రామ! రామ! ఎంత ఘోరకలి!! – ఒక ఆడకూతురిమీద, అందునా, 'ఇంటావిడ' కూతురిమీద, ఏకపత్నీవ్రతుణ్ణి, సంస్కారవంతుణ్ణి అయిన నేను 'చెయ్యి' వేయబోవాలట! అసభ్యంగా రెండు డైలాగులు చెప్పాలట!! 'పోనీలే, ఏదో మన పెళ్ళామే కదా; అణకువగా, అనుకూలంగా ఉంటేనే మంచిదిలే పోయిందేముందిలే' అనుకొంటూ, పరిస్థితులతో రాజీపడిపోయి, అన్ని విషయాల్లోను తను ఎలా చెబితే అలా చేస్తున్నాను కదా అని, నాకిలాంటి పని చెప్తుందా. ఇలాంటి అసందర్భమైన కోరిక; ఇంతవరకు ఈ భూప్రపంచంలో ఏ భార్యా తన భర్తని అడగని కోరిక నాముందు వెలిబుచ్చుతుందా! ఈ సారేమయినాసరే, తనకి లొంగకూడదు – ఈ ఒక్క విషయంలోనైనా నావ్యక్తిత్వాన్ని, పెళ్ళయిన తర్వాత మొదటిసారిగా నిలబెట్టుకోవాలని నిర్ణయించేసుకొన్నాను – అందుకే ఎలాగో

ధైర్యం ప్రోగుచేసుకొని – “లాభం లేదు రాణీ!... ఈ పని నేను చేయలేను - నువ్వింకో మార్గం చూసుకో” అనేశాను. నా మెడచుట్టూ ప్రేమపాశంలా చుట్టుకొంటున్న తామరతూడుల్లాంటి తన మెత్తని చేతుల్ని దృఢ సంకల్పబలంతో తొలగిస్తూ – నిజానికి, నాకు మా ఆవిడ ఆడించదలచుకొన్న నాటకం, అందులో నేను నటించవలసిన పాత్ర వివరాలు వినగానే ఎంతో కోపం వచ్చింది. కాని ఆ కోపాన్ని తనమీదనే ప్రయోగించటం క్షేమకరం కాదు గాబట్టి సదరు కోపాన్ని ఆ సమయానికి అక్కడలేని సుందరిమీదికి మరలించాను–

అవును మరి! ఆ చుప్పనాతివల్లనే కదా, మా ఆవిడ నాకింత క్లిష్టమైన సమస్యతెచ్చి పెట్టింది. ఈ సుందరి పూర్తిపేరు వీరవెంకట సత్య సూర్యవరప్రసాద త్రిపుర బాలాసుందరి – మా “ఇంటావిడ” – అంటే మాకు తన ఇంట్లో ఒక భాగాన్ని అద్దెకిచ్చిన గంగా భాగీరథీ సమానురాలు, శాంతమ్మగారి ఏకైక గారాలకుమార్తె – నా ఖర్మకాలి సదరు సుందరి ఆరునెలల క్రితం, నిజ భర్తతో ఏదో చిన్నవిషయంలో పెద్దగా పోట్లాడి, తీవ్రమైన విభేదాలు తెచ్చుకొని, తల్లి చేయించినవీ, మొగుడు చేయించి నవీ నగలన్నింటినీ మర్చిపోకుండా పెట్టెలో సర్దుకొని పుట్టింటికి చక్కా వచ్చింది. అంతే అప్పట్నుంచీ ఇక్కడే తన తల్లి గుండెల మీద తిరిగి రగుల్కొన్న కుంపటిలా ఉండిపోయింది. ఎవరెన్ని చెప్పినా భర్త రాయబారాలు పంపినా, కన్నతల్లి ఎంత మొత్తుకొన్నా లెక్కచేయకుండా, గంటకో తెలుగు నవల, రోజుకో హిందీ సినిమా చూస్తూ – పైగా మారాణీతో బాతాఖానీ వేయటంకోసం, తను ఇచ్చే కాఫీ టిఫిన్ వగైరాలు ఆరగించటం కోసం అస్తమానూ, మా ‘భాగం’లోనే తిష్ట వేయటం, తద్వారా నా ‘అర్ధభాగం’తో నాకు ఏకాంతం లేకుండా చేయటం, తరచుగా ఆవిణ్ణి కూడా సినిమాలకి తీసుకుపోయి, నాకు దూరం చేయటం, నాకిన్నాళ్ళుగా కంటకంగానే ఉంటున్న విషయాలు.

‘అక్కా అక్కా’ అంటూ తనతో ఎంతో అభిమానంగా ఉండే సుందరి కాపురం చక్కదిద్దాలన్న కోరిక మొదట్నుంచీ మారాణీ గుండెల్లో గూడు కట్టుకొనుందనీ నాకు తెలుసు – తిరిగి భర్త దగ్గరికి వెళ్ళటమే మంచిదని ఆవిడికి నచ్చజెప్పాలని ఎన్నోసార్లు విఫల ప్రయత్నాలు చేసిందనీ తెలుసు.

“భారత స్త్రీకి భర్తే సర్వస్వం – అతడితోడిదే లోకం – లేకుంటే శాశ్వతశోకం

– తెలుసుకోవే పిచ్చిమాలోకం...” అని మా ఆవిడ బరువుగా పలికే డైలాగులకు “వ్యక్తిత్వం చంపుకొన్న సతీత్వం వద్దు – అదికాదు నాతత్వం” – అంటూ సరిగ్గా తూకం వేసినట్టు సరిసమానమైన డైలాగులు సుందరి సమానంగా పలుకుతూండటం పక్క గదిలోంచి నేను చాలాసార్లు వినోదంగా విన్నాను –

ఇంతకీ మా ఆవిడ నా మెడచుట్టూ ఆప్యాయంగా చేతులు వేసి ఎంతో లబ్జుగా చెప్పిన ఉపోద్ఘాతం యొక్క సారాంశమిది –

ఈమధ్య ఒకరోజున సుందరితల్లి గం॥భా॥స॥ శాంతమ్మగారు “అమ్మా రాణీ! నువ్వు బృహస్పతిని మించిన తెలివైనదానివి – కాబట్టి గట్టిగా తల్చుకొంటే ఏమైనా చేయగలవు – ఏదో ఒక ఉపాయం పన్ని నా కూతురి కాపురం గట్టెక్కించుతల్లీ’ అని బ్రతిమాలి; ఆనక – “అలా చేయగల్గితే, నేను వీలయినంత తొందరగా చచ్చిపోయి; వెనువెంటనే నీ కడుపున పుడతానమ్మా –” అని ముక్కు చీదుకుంటూ కన్నీళ్ళు ధారాపాతంగా వర్షిస్తూ గట్టిగా వాగ్దానం చేసేసిందట; పిల్లలు లేని మారాణీ బలహీనతలు తెలుసున్నది గాబట్టి – ”

అంతే! దాంతో మా ఆవిడ ఉబ్బిపోయి వెంటనే ‘మాట’ ఇచ్చేసిందట ఆ గంగా భాగీరధీ సమానురాలికి!! –

– ఆ ఇచ్చిన మాట ప్రకారం సుందరిని మార్చటానికి తన ప్రయత్నాలు తిరిగి కొనసాగించిందట. సుందరిని ఒకసారి మా పందిరి మంచంమీద కూర్చోబెట్టి, బాగా టిఫిన్ పెట్టిన తర్వాత తన శక్తియుక్తులన్నీ ఉపయోగించి ఒక పెద్ద లెక్చరిచ్చి అదరగొట్టే సిందట! – తురుపుముక్కగా బ్రహ్మాస్త్రంగా ఆఖరి పాయింటుగా; “భర్తతోగాక వేరే ఉన్న ఆడదాన్ని సమాజం గౌరవించదని; అలాంటిదాన్ని అంతా చులకనగా చూస్తారని, సాంఘిక రక్షణ ఉండదని, ఆఖరికి ఆవిడి శీలాన్ని కూడా శంకిస్తారని“ గుక్క తిప్పుకోకుండా ఉపన్యసించి బెదరగొట్టేసిందట”–

పైకి అంతగా తేలకపోయినా, సుందరి మనసుకి తను ఎంతో తెలివిగా చెప్పిన ఈ పాయింటు నాటిందని, ఆవిడి మూర్ఖత్వాన్ని కొంతలో కొంత సడలించగలిగిందని, కొంచెం పునరాలోచనకు పూనుకొనేలా చేసిందని మా ఆవిడ

గట్టి నమ్మకం! అందుచేతనే ఇదే వేడిలో దానికి తగ్గట్టుగా ఒక 'సంఘటన' సుందరికి జరిగేలా చేయగల్గితే ఆవిడ తప్పని సరిగా తన అభిప్రాయాల్ని మార్చుకొని, భర్త నీడకు చేరుకొంటుందని, కాపురం చక్కదిద్దుకొంటుందని ఎంతో ఆలోచించిన పిదప తిరుగులేని నిర్ణయానికి వచ్చిన మా ఇల్లాలు నాకీ 'చిన్నపని'ని చేయమని కోరవలసి వచ్చిందట!!

కాని సదరు 'చిన్నపని'ని – అదే సుందరిపై 'అఘాయిత్యం' చేయ బూనుకొన్నట్లు నటించి, రెండు అసభ్యపు డైలాగులు చెప్పటానికి నేను అంగీకరించనని ఖచ్చితంగా చెప్పగలిగేసరికి తలక్రిందులయిపోయింది – అయినా మొండిఘటం ఓ పట్టాన వదులు తుందా! తన మంకుపట్టు విడవకుండా ఓ రెండుగంటలసేపు నా చెవులూదరగొట్టింది. తన ఈ ప్లాను వల్ల ఆశించిన ఫలితాలుండవేమోనని నేను మెల్లగా నసిగి, తప్పించు కొందామని చూశాను. దాంతో రెచ్చిపోయి తన 'పథకం'లోని బాగోగుల్ని మళ్ళీ వివరించింది. సుందరికి ఎలానూ నేనంటే మంచి అభిప్రాయమే వుంది గాబట్టి, అలాంటి నేనే తనపై 'అఘాయిత్యం' చేయబూనుకొంటే భర్త నీడనలేని ఆడదానికి సమాజంలో ఎంత భద్రత ఉంటుందో, అలాంటిదాన్ని సహజంగా మంచివాళ్లయినవాళ్ళు కూడా ఎంత తప్పుగా ఊహించుకొంటారో, బజారు స్త్రీతో సమంగా ఎలా చూస్తారో, చక్కగా తెలిసివస్తుందని మారాణీవాదం. చిన్న చిన్న సంఘటనలే గొప్ప గొప్ప ఫలితాలకి కారణాలవుతాయన్నది తన దృఢమైన నమ్మకం – ఉదాహరణకి, ఆ మధ్యన తను చూసిన ఒక సినిమాలో ఎవరెలా ప్రయత్నించినా త్రాగుడు మానలేకపోయిన ఒక 'దేవదాసు'; ఆఖరి రీలులో తన పెళ్ళాం పూటుగా తాగినట్లు నటిస్తూ వచ్చి, ఒక 'ఎల్లారీశ్వరి' పాట ఎత్తుకొని ఒక క్లబ్బు డాన్సు చేసేసి, ఆపైన మత్తుగా తన వళ్ళో వాలిపోయేసరికి, బేజారెత్తిపోయి, ఆనక పశ్చాత్తాపం కూడా పడిపోయి; తనిక తాగుడు పూర్తి మానేయాలన్న దృఢ నిర్ణయానికి వచ్చేశాడట! అలాగే ఈ మధ్యనే తను చదివిన ప్రముఖ రచయిత్రి సీరియల్‌లోని హీరోయిన్ 'సంఘసేవ' పిచ్చిలో పడిపోయి ఒక ఇరవై వారాల కథ అయేవరకు మొగుణ్ణి పిల్లల్ని నిర్లక్ష్యం చేస్తూ వచ్చి, ఆఖరివారం కథలోమాత్రం కలెక్టరుగారు మీద చెయ్యి వేయబోగా, ఆయన్ని రెండు పేజీల తిట్లు తిట్టి, దార్లో రెండు కేజీల

స్వీట్లు కొనుక్కొని ఇంటికి పరుగెత్తుకుని వచ్చి మొగుణ్ణి పిల్లల్ని ముద్దులాడి "నాకు జ్ఞానోదయమయింది - ఇక ఇంటిపట్టునే ఉంటాను - నా చేత్తోనే మీకు స్వీట్లు తినిపిస్తాను. దీన్ని మించిన సంఘసేవ లేదు" అనేసిందిట - ఇలాంటి చిన్న చిన్న సంఘటనల ద్వారా జ్ఞానోదయం పొందిన పాత్రలు ఎన్నో ఉన్నాయట, తను చదివిన సీరియల్సులో - కాబట్టి నేను కొంచెం 'రిస్కు' తీసుకొని సుందరిమీద దురభిప్రాయమున్నట్లు నటిస్తే ఒక కాపురాన్ని నిలబెట్టినవాణ్ణవుతానని మారాణీ వాదం!!

ఆవిడ వాదాన్ని ఖండించగలిగే శక్తి నాకెలానూ లేదు కాబట్టి, అలాంటి ప్రమాదపూరిత మైన పనులకొడిగట్టే సాహసం నాకులేదని నసిగాను. దాంతో ఇంకా పేట్రేగిపోయింది.

"ఒక కాపురం నిలబెట్టటం కోసం ఆమాత్రం సాహసం చేయవచ్చుండీ అంది..." నేనయినా మీకే పాపకార్యం పురమాయించటం లేదే! ఉత్తినే 'అఘాయిత్యం' చేయబూను కొన్నట్లు నటించమంటున్నాను గాని నిజంగా కీచకుడిలా ప్రవర్తించమనటం లేదే! - నా బంగారుకొండ, అలాంటి పనులు కలలోకూడా చేయలేరని నాకు తెలియదా! అంటూ ఉబ్బు మంత్రం కూడా వేసింది.

"నామీదెంతో అనురాగం ఉందంటారే, ఒక సత్కార్యం చేయటంలో అర్ధాంగికి మాత్రం సహకారం చేయనంటున్నారే!" అని దెప్పింది. తర్వాత కన్నీళ్ళ కుళాయి కూడా విప్పేసింది.

"ఈ కోరిక తీర్చకపోతే నేను రేపే మూటాముల్లె కట్టుకొని పుట్టింటికి తగలడతాను" అని బెదిరించింది! -

దాంతో నా 'దృఢసంకల్పం' తప్పనిసరిగా చాలావరకు సడలిపోయింది! అది కనిపెట్టే కాబోలు, ఆఖరిఅస్త్రం - అదే 'మన్మథశాస్త్రం' వదిలేసింది. మరి నా బలహీనతలన్నీ బాగా తెలుసున్న జాణగాబట్టి 'నా బంగారు స్వామి కదూ - ఈ ఒక్క వరం కాదనకండీ! ఇంకెప్పుడూ ఏమీ అడగనుగా... ఏమండీ... సరేననరూ..." అనురాగ లతలా నన్ను నిలువెల్లా చుట్టుకుపోతూ ఉక్కిరిబిక్కిరయేలా 'మోహపాశం' మధురంగా బిగించేసరికి 'అర్భకుణ్ణి' లొంగిపోయాను. ఓటమికి

చిన్నంగా మవునంగా ఉండిపోయాను.

"... అమ్మయ్య! శ్రీవారు ఒప్పుకొన్నారన్నమాట... నాకు ముందే తెలుసు.. నా మీద మీకు గల అంతులేని అనురాగం మిమ్మల్నెంతటి త్యాగానికైనా సంసిద్ధం చేస్తుందని. భగవాన్....! నాకీ అదృష్టం చాలు... నాకీ అదృష్టం చాలు..." అంటూ కళ్ళు సగం మూసుకొని నా చేతుల్లోకి వరిగిపోయింది! అచ్చు కథల్లో, సినిమాల్లోలా ఆనందపారవశ్యంతో మూర్ఛపోయిందేమోనని కంగారుపడి, తనని గట్టిగా కుదిపేశాను.

"అబ్బ! ఏవిటీ కొంటెవేషాలు..." అంటూ నన్నింకా గట్టిగా హత్తుకుపోయింది. నన్నేవో కొత్త లోకాల్లోకి ఎత్తుకుపోయింది – అంతే తర్వాత చాలాసేపటివరకు నాకు మళ్ళీ మాట్లాడగలిగే అవకాశం దొరకలేదు.

ఏదో అలా తప్పనిసరయి ఒప్పేసుకొన్నాను గాని, 'ఇదంతా ఎలా కడదేర్చగలనా అన్న ఆందోళన క్షణక్షణానికి అధికమవ్వసాగింది. నాకింతటి ఆందోళనను కలుగజేసిన మా ఆవిణ్ణి ఎలానూ ఏం అనలేను కాబట్టి; మొగుణ్ణి వదిలేసొచ్చిన సుందరిని; అలాంటి దాన్ని కన్న గంగా భాగీరథీ సమానురాలు శాంతమ్మను, పెళ్ళాన్ని నాలుగు తన్ని కాపురానికి తీసుకొని వెళ్ళలేని వాజమ్మయిన సుందరి తాలూకు మొద్దు మొగుణ్ణి, మా ఆవిడికిలాంటి ఘోరమైన ఐడియా రావడానికి కారణాలైన తెలుగు సినిమాల్ని; ధారావాహికంగా ప్రచురించ బడ్డ సీరియల్సు వ్రాసిన రైటరీమణుల్ని, మనసులోనే గట్టిగా కసిగా తిట్టుకొన్నాను; అంతకుమించి చేసేదేం లేక–

ఆ మర్నాడు మధ్యాహ్నం మూడు దాటిన వెంటనే మా ఆవిడ ఎక్కడికో ప్రయాణ మవ్వటం చూసి చాలా గాభరా కలిగింది. ఏదో తప్పనిసరియై తను చెప్పినట్టు చేస్తానని మాటనిచ్చేశానేగాని, అది ఇంత త్వరలోనే చెల్లించుకోవాల్సిన ఆగత్యం ఏర్పడుతుందని నేననుకోలేదు. లాభంలేదని తెల్సినా 'తర్వాత చూద్దాం రాణి! ఈవేళ మాత్రం వద్దు' అని ఎంతగానో గడ్డం పుచ్చుకొని బ్రతిమాలాను. అన్నిటికి సమాధానంగా చిరునవ్వు చిందిస్తూ గబగబా ముస్తాబయిపోయింది. ఇక చేసేదేమీ లేక అలాగే దిగాలుపడిపోయి కూర్చున్నాను.

"సుందరీ నేను తప్పనిసరి పనిమీద బయటకు వెళ్తున్నాను.. మావారేమో ప్రొద్దుట్నుంచీ విపరీతమైన తలనొప్పితో బాధపడుతున్నారు. కాస్త దయచేసి చూస్తూండూ... కాసేపయినాక కాస్త కాఫీ పెట్టివ్వు... రాత్రి ఎనిమిది కల్లా వచ్చేస్తాను..." అంటూ వరండాలోంచి మా ఆవిడ మాటలు వినపడగానే నీరసం ముంచుకొచ్చి మంచంమీద వాలిపోయాను. సుందరి ఏం సమాధానం చెప్పిందో వినపడలేదుగాని, జోళ్లు టకటకలాడించుకొంటూ, నాతో మాటమాత్రమైనా చెప్పకుండా గది తలుపులు చేరవేసి బయటికి సాగిపోవటం తెలిసి ఇంకా వళ్ళు మండింది. టక్... టక్... టక్... వీధి మెట్లమీద మా ఆవిడ జోళ్ళ చప్పుడు దూరంకాగానే అదే చప్పుడు నా మనోవీధిలో ప్రతిధ్వనించసాగింది... నిజంగానే విపరీతమైన తలనొప్పి ప్రారంభమయింది! అయినా అంతరాంతరాల్లో నేనాశించినట్లుగా సుందరి లోపలికి రాలేదు! నన్ను పలకరించలేదు!

అవును మరి! పిచ్చి మాలోకం; మా ఆవిడికి తెలియదు గాని, అప్పుడప్పుడు సుందరి, దొడ్లో బట్టలు ఆరవేస్తున్నప్పుడు, తడిచీర వంటికి చుట్టుకొని, బాత్రూంనుండి ఇంట్లోకి పరుగెత్తికొని వెళ్తున్నప్పుడు నేను కిటికీ దగ్గర నిలబడి ఆవిడి వంపుసొంపుల్ని, మిట్టపల్లాల్ని పరవశంగా, దొంగతనంగా చూస్తుంటాను. ఈ విషయం గమనించి ఒకటి రెండుసార్లు సుందరి నావైపు కోపంగా; 'అదోలా', చూసింది కూడాను; నా అదృష్టం బాగుండి మా ఆవిడికి 'రిపోర్టు' చేయలేదుగాని! అందుకే సుందరి రాదు.. పోనీలే అదే మంచిది... నాకు విషమ పరిస్థితి తప్పుతుంది.

ఇంతలో మా వంటింట్లోంచి కాఫీ పెడుతున్నట్లు గిన్నెల చప్పుడు వీనులవిందు వినపడసాగింది. ఓహ్! సౌందర్యదేవత సుందరి నాకోసం కాఫీ పెడుతోంది... చక్కని కోలముఖంలో చక్రాల్లాంటి కవ్వించే కళ్ళు... సన్నని నున్నని నడుము... స్వచ్ఛమైన మంచులాంటి తెల్లని పొట్టమీద కూర్చున్నందువల్ల పడిన ఆకర్షణీయమైన ముడతలు... సగం తొలగిన పైట క్రింద ఎగిరెగిరి పడుతున్న యవ్వనం... గుండ్రని జబ్బలు.. కాంతులీను తున్న బుగ్గలు... మొత్తానికి సౌందర్యానికి నిర్వచనంలా ఉండే సుందరి స్వరూపం ఒక్కసారిగా మనోవీధిలో తళుక్కుమంది, అంతే కొన్ని క్షణాలకన్నా ఎక్కువసేపు మంచంమీద ఉండలేకపోయాను – వద్దనుకొంటూనే

లేచివెళ్ళి వంటింటి గుమ్మంలో నిలబడ్డాను; వణుకు తున్న కాళ్ళను అదుపులో పెట్టటానికి విశ్వప్రయత్నాలు చేస్తూ -

అరవిచ్చుకొన్న పద్మాల్లాంటి పాదాలు... పాలరాయిలా నున్నగా, తెల్లగా ఉన్న కాళ్ళు, పాదాలు కనపడేలా కుచ్చెళ్ళు పైకెగదోపుకొని, మనస్సుకాహ్లాదాన్ని కలిగించేలా అందంగా కోతకు వచ్చిన పైరులా, అందమైన వంపులన్నీ దర్శనమిచ్చేలా, ముందుకు వంగొని జారిన పైటను, గుమ్మంలో నుంచున్న నన్నూ గమనించకుండా తన పనిలో నిమగ్నమయి పోయిన సుందరిని పరవశంగా చూస్తూండిపోయాను. కొంతసేపటివరకు స్టౌమీది కాఫీ నీళ్ళలా ప్రణయం పొంగసాగింది.

అంతలోనే సుందరి వెనక్కి చూసింది... అదోలా చూసింది... అంతలోనే నా కర్థం కాని విధంగా, నవ్వీ నవ్వకుండా నవ్వింది... మామూలు పలకరింపు నవ్వేనా అది!

ఇంతలో పొయ్యిమీద కాఫీనీళ్ళు పొంగగా వెంటనే పైటచెంగుతో పట్టుకొని గిన్నె క్రిందికి దించింది. నన్ను పిచ్చివాణ్ణి చేస్తున్న వంపులు మరింత స్పష్టంగా కనబడేలా!అంతే! నాకు ప్రణయావేశం పూర్తిగా తలకెక్కింది.

సుం...ద...రీ..... రెండడుగులు ముందుకు వేశాను!

"ఊ...." కొంచెం బెదురుగా పలికి తలవంచుకొనే కాఫీ చల్లారబెట్టసాగింది. దాంతో నా ఆవేశం ఒక్కసారిగా చల్లబడిపోయింది. అకస్మాత్తుగా మనోపథంలో మా ఆవిడ ఎదురవ్వటం ఇంకో కారణమని కూడా చెప్పవచ్చు.

అయినా ఇదేమిటి! నా అసలు పాత్ర మరిచిపోతున్నాను - అనుకొన్నదేమిటి? జరుగుతున్నదేమిటి? పాత్రలో తాదాత్మ్యమయిపోతున్నానా! అబ్బే ఇది మంచిది కాదు - నేను వట్టినే నటించాలి - మా డైరెక్టరు, అదే మా ఆవిడ చెప్పిన విధంగానే నటించాలి... నా డైలాగులేవో గబగబా వల్లించేసి ఓవరేక్షను చేయకుండా నిష్క్రమించాలి. అంతే-

"సుందరీ... నీ అధరామృతమివ్వవూ... దగ్గరికిరా... మొగుణ్ణి వదిలేసిన

దానివి... నీకు నీతేమిటి? రా" అన్నాను. లేదు అందామని ప్రయత్నించాను ఎంతగానో. కాని ఒక్క మాటైనా బయటకు రాలేదు. సరికదా, నోట్లోంచి 'గురగురమని వింతశబ్దాలు మాత్రం వెలువడ్డాయి. మొదటిసారిగా స్టేజెక్కిన నటుడిలా చెప్పవలసిన డైలాగులన్నీ మరచిపోయి, నటించడానికి బదులు, వింత వింత శబ్దాలు చేస్తూ, ఉన్నచోటనే ఉండిపోయాను!!

అతికష్టంమీద తలపైకెత్తి చూశాను –

సుందరి నావైపు వస్తోంది – కళ్ళల్లో కోపం మండుతోంది – అమ్మో... నా వాలకం కనిపెట్టేసింది... ఆడబెబ్బులిలా ముందుకురుకుతోంది... పంజా విసిరేస్తుంది సాచిపెట్టి లెంపకాయ కొట్టేస్తుంది. పోనీ పారిపోతే...

"ఏమిటండీ అలా వణికిపోతున్నారు...? ఏమయింది..." అంటూనే కళ్ళు తిరిగి వళ్ళు వశం తప్పి ముందుకు పడబోతున్న నన్ను ఒడుపుగా పట్టుకొంది... నన్ను గట్టిగా పట్టు కోవటంకోసం బాగా దగ్గరిగా... వెచ్చగా... మెత్తగా నన్ను తాకుతున్న కుసుమ కోమల శరీరాన్ని అసంకల్పితంగా రెండు చేతులతో దగ్గరికి లాక్కున్నాను! 'మైగాడ్ ఏం చేస్తున్నాను నేను!' "అమ్మదొంగా! ఇదావేషం.. ఛాపాడు... వంటిల్లే దొరికిందా ఈ కొంటె వేషాలు వేయడానికి... ఊ.... సరే... లోపలికి పదండి... ఊ...."

అంతే! ఒక్కసారిగా నాకు పక్కలో బాంబు పడ్డట్టయింది. డొక్కలో నన్నెవరో ఫెడీమని తన్నినట్లయింది... కాని... మనలో మాట! బూర్లెగంపలో పడ్డవాడు వెంటనే లేచి పారిపోగలడా? –

అంతే...! సుందరీ నేనూ లోపలికి నడిచాం...! అహ! అలా అనటం కన్నా తనే నన్ను నడుంచుట్టూ చెయ్యివేసి వెచ్చగా, మెత్తగా తాకుతూ, లోపలిగదిలోకి నడిపించుకు వెళ్ళిందని చెప్పటం సమంజసంగా ఉంటుంది మరి! – అఘాయిత్యం జరిగిపోయన తర్వాత ఓ గంట తర్వాత మాత్రమే 'అరెరే! పాపం మా ఆవిడ' అన్న భావం మనసులో కలుక్కుమంది.

***(1972లో యువభారతి కథా సంకలనం "ఉదయం"లో ప్రచురితం)***

# ఏయ్... ఇదిగో నిన్నే... (స్కెచ్)

పదహారు కోట్లమంది ప్రపంచవ్యాప్తంగా ఉన్న తెలుగువాళ్ళలో, ఆ మాటకొస్తే మొత్తం 103 కోట్ల భారతీయులలో, ఏకాభిప్రాయం లేనిది ప్రత్యేక తెలంగాణ రాష్ట్రం ఏర్పాటు విషయమొక్కటే కాదు, ఇంకా ఎన్నో ఉన్నాయి అందులో ఒకటి - భార్యాభర్తలు పరస్పరం, ఎలా పిలుచుకోవాలన్నది - భిన్న భాషల, ప్రాంతాల, ఉపప్రాంతాల, కులాల, వర్గాల, ఆర్థిక స్థాయీ భేదాలు, దంపతుల పిలుపుల్లో ప్రతిఫలిస్తాయని చెప్పుకోవచ్చు. ఒక్కమాటలో చెప్పాలంటే భారతదేశంలో, తెలుగువాళ్ళలో, దంపతుల పరస్పర సంభోదనల్లో, ఎంతో వైవిధ్యం ఉంది ప్రామాణికత గాని, ఏకత్వం (యూనిఫార్మటీ)గాని లేదు -

వేల సంవత్సరాల సాహిత్యాన్ని తిరగేసినా, చరిత్రను ఔపోసాన పట్టినా, ఆయా కాలాల్లో, భార్యాభర్తలు ఒకేలా, పిలుచుకొనేవారని చెప్పలేని పరిస్థితి ఉంది! ఉదాహరణకి రామాయణంలోని ప్రధాన జంటనే తీసుకొందాం - శ్రీరాముడు, సీతాదేవి - రాముడు క్షత్రియధర్మంగా కాబోలు, ఒకోసారి ధర్మపతిని "మీరు", "రాణీగారూ" అంటూ మన్నించినా ఎక్కువసార్లు చనువుగా ఆప్యాయంగా "నీవు" అని ఏకవచనంలోనే పలకరించేవాడు. ఒకోసారి "దేవీ" - "ప్రాణేశ్వరీ", అనీ ప్రేమ ఒలకబోసేవాడు. - అలాగే సీతా మహాసాధ్వి కూడా, వివిధ సందర్భాలలో భర్తను మీరు, తమరు, ఆర్యపుత్రా, ప్రాణనాథా, అని పిలిచేది. ఒకోసారి రాముణ్ణి పేరుపెట్టిగాని, ఏకవచనంలో నీవు అని పిలవడానికి గాని, ఇంకా చనువుగా ప్రేమగా, గారంగా, "ఏమిరా, రామా".. అని పిలవడానికీ, ఏమాత్రం సంకోచించేది గాదు - అదేవిధంగా మిగిలిన పురాణపాత్రలు, ప్రామాణిక (స్టాండర్డు) పతివ్రతలైన అనసూయ, సావిత్రి వగైరాలు కూడా భర్తలను వివిధ సందర్భాలలో వైవిధ్యంగా పిలిచేవారు. చారిత్రక దంపతుల్లోను అదే పరిస్థితి.

వర్తమానంలోనూ, దంపతుల పరస్పర సంభోదనల్లో ఎలాంటి ప్రామాణికత, ఏకత్వం, లేవు – మొదటిసారి వధూవరులు ఇంటికివచ్చినప్పుడు గుమ్మం దగ్గరేవాళ్ళని ఆపి, భార్యపేరు భర్త, భర్త పేరు భార్య చెప్పేవరకు లోనికి రానివ్వరు. అంటే భార్యాభర్తలు పరస్పరం, తమ తమ పేర్లతో పిలుచుకోవచ్చనే కదా అర్థం – మరి అన్ని ప్రాంతాల్లోనూ, పేర్లతో పిలచుకొనే దంపతులు అరుదు. ఇంకొకరికి చెప్పవలసి వచ్చినా, బిడియంగా, "తను" – "ఆయన" "వాళ్ళ నాన్నగారు", అనే చెప్తారు, చాలమంది స్త్రీలు, భర్త పేరు చెప్పకుండా – భర్తలు కూడా చాలామంది, "అది"... "తను", "వాళ్ళమ్మ" అంటారు.

ఎక్కువమంది భర్తలు, భార్యలను తాము, ఏమే, ఒసేవ్ అని పిలిచినా, తమని మాత్రం వాళ్ళు 'మీరు – ఏమండీ' అని గౌరవించాలనే కోరుకుంటారు – స్థూలంగా చెప్పాలంటే భార్యను పేరుతో గాకుండా – ఏయ్... ఇదిగో.... నిన్నే – అని పిలిచే భర్తలే ఎక్కువుంటారు, ఏమేవ్ – ఎహే... అని అరిచేవారూ ఉంటారనుకోండి – అందుకు బదులుగా అత్యంత మార్ధవంగా, సహజంగా – ఏమండీ... మిమ్మల్నే.. అని భార్యల సంభోదన ఉంటుంది. స్త్రీవాదం రచయిత్రులు, పురుషాధిక్యతకు వ్యతిరేకంగా మహిళామండల్లో ఉపన్యాసాలు దంచేవారు కూడా చాలాసార్లు ఇందుకు మినహాయింపుగాదు! పేరుతో గాకుండా, ఏయ్, ఓయ్, నిన్నే, మిమ్మల్నే వంటి పిలుపుల్లో ఒక ఇబ్బంది ఉంది. పెళ్ళి పందిళ్ళలోనో రైల్వే స్టేషన్లలోనో, అలాంటి ఇతర జన సమూహాల్లోనో ఎవరి"ఏయ్" – ఎవరి "నిన్నే"– ఎవరి "మిమ్మల్నే", – ఎవరో తెలియని గందరగోళం ఏర్పడుతుంది – కొన్ని క్షత్రియకుటుంబాల్లో భార్యలను భర్తలు ఎంతో గౌరవంగా మీరు, తమరు,అనే అలవాటుంది – "మీ మొహం మండ ఎక్కడ చచ్చారండీ"... అని పొలికేకలు వేసే పురుషాధిక్యభావంతోబాటు కొన్ని శ్రామిక కుటుంబాల్లో భార్యాభర్తలు ప్రేమగా ఏకవచనంలోనే పిలుచుకోవటంతో బాటు, అరే–, ఒరే–, ఏంటే, బావా, మావా ఇలా ఆప్యాయంగా పిలుచుకొనే అలవాటుంది. కొన్ని ఆధునిక జంటలూ ఈ విధమైన గారాలొలకబోస్తారు – లింగభేదం మర్చిపోయి ఏంట్రా, పోరా, అనే భర్తలూ ఉంటారు. పాశ్చాత్యుల్లా హనీ – డార్లింగ్ అనేవాళ్ళూ ఆధునికుల్లో ఉన్నారు. కొంతమంది చాదస్తులు "మేరీ బచ్చోం కీ మా...(నా పిల్లల తల్లీ) అని భార్యలను పిలవటం కద్దు; "తల్లి నిజం – తండ్రి నమ్మకం" – అనే సూక్తిని

స్ఫురణకి తెస్తూ. ఏతావాతా, విషయమేమంటే భార్యాభర్తల పరస్పర సంభోధనల్లో ప్రామాణికత – ఏకత్వం / యూనిఫార్మిటీ) లేకపోవటం చాలా గందరగోళానికి దారితీస్తోంది. గ్లోబల్ వార్మింగు, "తెలంగాణ" వంటి సీరియస్ విషయాలను కాసేపు పక్కనపెట్టి దంపతుల పిలుపుల్లో కులాలు, వర్గాలకతీతంగా, ఒక ప్రామాణికతను, ఏకత్వాన్ని నిర్ణయిస్తే బాగుంటుంది, ఇంకో యాభై సంవత్సరాల తర్వాత పునఃసమీక్ష జరుగుతుందని చెప్పి, నిర్ణయాల్ని కఠినంగా అమలు చేయాలి. ఇది శాసనసభలలో, పార్లమెంటులో స్త్రీలకు 33 శాతం రిజర్వేషన్ అమలు జరిగేలోగానే జరగాలి.

# కాంతం-కనకం - ఆడమనసు

మా ఆవిడ కాంతానికి, కనకం అంటే ఇష్టం లేదు - బాగా వళ్ళుమంట! అబ్బెబ్బే... బంగారం అంటే అందరి ఆడవాళ్ళలాగే తనకూ ఎంతో ప్రీతి. వళ్ళంతా తొడిగేసుకోవాలనే ఉంటుంది... తనకు వళ్ళుమంట - కనకం అనబడే నా వేలు విడిచిన మరదలంటేనే, బంగారం మీద కాదు - 'కనకం' అని పేరున్న ఈ నా మరదలు, బంగారం రంగులో ఉండదు కాని, చామన చాయే అయినా బాగానే ఉంటుంది. నేను వరసే ఐనా, అప్పట్లో, మొదట్లో, వాళ్ళ అమ్మా నాన్న నాకిచ్చి పెళ్ళి చేద్దామని అనుకొనేవాళ్ళు కాదు. కారణం, అప్పట్లో వాళ్ళు మాతో పోలిస్తే చాలా ధనవంతులు గాబట్టి - నాన్న పోయినప్పట్నుంచి, తనే తల్లితండ్రిగా ఊళ్ళో ఉన్న కొద్ది భూమిని వ్యవసాయం చేయిస్తూ, తను పట్టణంలో చిన్న కిరాణ కొట్టు నడుపుతూ, నన్ను ఏలోటూ రాకుండా, జాగ్రత్తగా, ప్రేమగా పెంచి పెద్దచేసిన అమ్మ కనకం తండ్రి పురుషోత్తం గారికి స్వయానా కాదుగాని వరసకు చెల్లెలు. తమకన్నా స్థితిగతుల్లో తక్కువగా ఉన్న మేమంటే ఆయనకు సహజంగానే చిన్నచూపు ఉండేది. వాళ్ళ మేడ పక్కనే చిన్న పెంకుటిల్లులో అద్దెకుంటున్న మమ్మల్ని తగినంత దూరంలోనే ఉంచుతూ, అడపాదడపా చిన్నా చితకా సాయాలు మాత్రం చేసేవాడు. ఆయన భార్య శారదత్తయ్య అప్పుడప్పుడు ఇంట్లో పనులకు అమ్మ సహాయం తీసుకొంటూనే, సూటిపోటి మాటలనేది. అప్పట్లో మా స్థితిగతుల మధ్యన ఉన్న వ్యత్యాసం వలన అది సహజమేనని సరిపెట్టుకొంటూ ఆవిడ పిలిచినప్పుడల్లా వాళ్ళింటికి వెళ్ళి సాయం చేస్తూనే ఉండేది అమ్మ. ఏవిధమైన ప్రత్యుపకారం, ప్రతిఫలం ఆశించకుండానే, కేవలం బంధుప్రీతితో మాత్రమే.

మరదలు వరసైన, కనకం నన్నెప్పుడూ 'బావా' అని పిలవలేదు. 'ఏయ్.. ఓయ్ - అనే పిలిచేది అంతగా అవసరం పడితే. తను చిన్నప్పట్నుంచీ, ఒక

విధమైన అహంభావి. నేను వీధి బళ్ళోనే చదువుకొంటుంటే తను కాన్వెంటుకి వెళ్లేది. కాలేజీకి వచ్చేక, నేను బికాంలో చేరితే, తను ఇంటర్‌లో బై.పీ.సి తీసుకొని, డాక్టరునైపోయినట్లు ఫోజు కొట్టేది. ఏమైనా, మా ఇద్దరి మధ్యన సాన్నిహిత్యం ఏర్పడలేదు. అయినా, కనకం అంటే చిన్నప్పుడు నాకు అభిమానం ఉండేది. తన అభిజాత్యధోరణి ఎలా ఉన్నా ఆ అభిమానం కనకంలో యవ్వనం వికసించే కొద్దీ ప్రేమగా మారింది; సహజంగానే అయినా బయట పడకుండా హృదయంలోనే దాచుకొన్నాను.

నా బి.కాం., కనకం ఇంటర్ పూర్తవకముందే, కనకం కుటుంబ పరిస్థితులూ తారుమారైపోయాయి. వాళ్ళ నాన్న పురుషోత్తంగారికి ఉన్న అన్ని వ్యాపారాల్లోనూ నష్టాలు వచ్చి, ఆస్తులన్నీ కరిగిపోయి, మేడ కూడా అమ్మేసి ఆ వీధిలోనే ఒక చిన్న పెంకుటింట్లోకి అద్దెకు దిగాల్సినంతగా, పరిస్థితి దిగజారిపోయింది. కనకం చదువూ చెట్టెక్కింది. ఇంతలో, బి.కాం. పూర్తయిన వెంటనే నాకు ఒక జాతీయ బ్యాంకులో ఆఫీసరుగా ఉద్యోగం వచ్చింది. ఆవిధంగా చాలా తక్కువకాలంలో బండి – ఓడ, ఓడ – బండి ఐపోయాయి.

అలా ఎక్కువరోజులు గడవకముందే, ఒకరోజు, మేం కొత్తగా మారిన ఇంటికి వచ్చి పురుషోత్తం మావయ్య, శారదత్తయ్య మా అమ్మను, తమ కూతురు కనకాన్ని కోడలిగా చేసుకోమని దీనంగా బ్రతిమాలుకోవటం పక్కగదిలో ఉన్న నేను విన్నంతనే అంతులేని ఆనందం కలిగింది. కాని కొంచెంసేపు మాత్రమే మౌనంగా ఉన్న అమ్మ, ఎన్నేళ్ళనుంచో దిగమింగుతూ ఉన్న ఆగ్రహాన్ని ఒక్కసారిగా కక్కేయటం నన్ను చాలా హతాశుణ్ణి చేసింది. 'ఇన్నాళ్ళకు మీ కంటికి మేం కనపడుతున్నామా' అని కడిగేసింది. మీతో సంబంధం ససేమిరా వీల్లేదని నిష్కర్షగా చెప్పేసింది. దాంతో చింత చచ్చినా పులుపు చావని ఆ దంపతులిద్దరూ కూడా రెచ్చిపోయేరు. ఇంతకన్నా మంచిసంబంధం తెచ్చుకోగలం అని ప్రగల్భాలు పలుకుతూ విసవిసా బయటికి నడుస్తూ ఇంకో మాట నా మనసులో గుచ్చుకొనేలా అనేసేరు. అదేమిటంటే, 'ఏదో బంధుప్రీతితో వచ్చాం గాని, అసలు మా అమ్మాయికి మీవాడు తగినవాడు కాదు. ఏవిధంగా చూసినా... దానికి మీ సంబంధం ఎట్టి పరిస్థితుల్లోనూ ఇష్టం ఉండదు" అని.

వాళ్ళా మాట అని ఉండకపోతే వాళ్ళు వెళ్ళిపోయిన తర్వాత అమ్మను ఎలాగోలాగు బ్రతిమాలి కనకంతో నా పెళ్ళికి ఒప్పించేవాణ్ణేమో! కనకానికే ఇష్టం లేనప్పుడు నేనెందుకు పాకులాడాలన్న భావం, అమ్మ మనసుకి కష్టం కలిగే, ఇష్టం లేని, ఏ పనీ తలబెట్టకూడదన్న అభిప్రాయంతో, సమపాళ్ళలో మిళితమై ఈ వ్యవహారంలో నన్ను మౌనంగా ఉండేలా చేసేయి. కొద్దిరోజులకే, హైద్రాబాద్‌కి బదిలీ అయినందున మళ్ళీ కనకాన్ని చూసే సందర్భం కలుగలేదు. కొన్నాళ్ళకి, కనకానికి పెళ్ళయిపోయిందన్న సమాచారం రూఢీగా తెలిసింది. శుభలేక రాకపోయినా–

ఇంకేముంది, 'అనుకొని అమ్మ చూసిన సంబంధం చేసుకొన్నాను. కాంతాన్ని భార్యగా పొందాను. నిజంగానే, బంగారం రంగులో, శృంగారాల మూర్తిలా, ఒడ్డుకు తగ్గ పొడవు, పెద్ద పెద్ద కళ్ళు, కోటేరులాంటి ముక్కు, సొట్టలు పడే బుగ్గలు, ఆకర్షణీయమైన అవయవ సౌష్టవంతో మొత్తానికి బంగారపు సన్నజాజి తీగలా ఉండే కాంతానికి నేను అనతికాలంలో పూర్తిగా 'స్వాధీన'మైపోయాను. మొదటిరాత్రే, "నువ్వు బాగా నచ్చేవు – నేను అదృష్టవంతుణ్ణి" అనేశాను. అదే కొంపముంచింది! చేతులారా, దాంపత్యంలో ఆధిపత్యానికి, నీళ్ళొది లేసుకొన్నాను. ఆ క్షణం నుంచి, ఇప్పటివరకు ఏమాత్రం తేడా లేకుండా భార్యా లోలుణ్ణి అయిపోయాను.

సరే అదలా ఉంచితే, ఇంకో ప్రమాదం కూడా జరిగిపోయింది మొదటిరాత్రే. ముద్దూ ముచ్చటా తీర్చుకొనే ఆత్రం పూర్తిగాకముందే అడిగేసింది నిష్కర్షగా.

"ఔనూ, – మీకేదో అయిన సంబంధం ఉండేదట – మరి మీరంత ఇష్టపడిన ఆ అమ్మాయినెందుకు చేసుకోలేదూ..." అని దీర్ఘం తీసింది – ఈ సమాచారం తనకెలా తెలిసిందో నాకిప్పటికీ తెలియదు.

తిన్నగా ఉండకుండా పెద్ద సత్యహరిశ్చంద్రుడిలా వాగేసేను. తన బుగ్గ సుతారంగా గిల్లుతూ – "నిజమే కాంతం – కనకం, అని వరసకి మరదలు – నీ అంత బాగుండదు. ఏదో యవ్వన చాపల్యంతో పెళ్ళి చేసుకొంటే బాగుంటుందేమోనని అనుకోకపోలేదు. కాని అమ్మకైనా చెప్పలేదు – నీ అంత

అందాల రాణి నాకు భార్యగా లభించే అదృష్టం ఉన్నప్పుడు ఆవిడితో పెళ్ళెందుకవుతుంది! అని తెలివిగా మాట్లాడేననుకొంటూ పలికిన పలుకులే నాక్కు తర్వాతతర్వాత మానసిక సంక్షోభానికి గురిచేస్తాయని తెలుసుకోలేకపోయాను!

"ఓహో! అలాగా" అని కాంతం ముక్తసరిగా అనేసరికి "ఈ అధ్యాయం ఇంతటితో ముగిసిపోయిందని ఆనందించేను - కాని నా అంచనా తప్పింది.

మర్నాటినుంచి ఈ రోజువరకు, మా పెళ్ళై ఏడేళ్ళు గడిచినా ఇద్దరు ముత్యాల్లాంటి పిల్లలు కలిగిన తర్వాత కూడా, రోజుకోసారైనా ఆ ప్రస్తావన తెస్తూంటుంది కాంతం - "ప్రేమా లేదూ దోమా లేదు... ఏదో నిన్ను చూడకముందు ఈ పిల్లను చేసుకుంటే ఎలా ఉంటుందన్న అస్పష్ట ఆలోచన కలిగినా మా ఇద్దరిమధ్య ఏం జరగలేదు,అసలా అమ్మాయికి నేనంటే ఇష్టంలేదు... "ఇలా ఇలా కొన్ని వివరణలు ఇవ్వటానికి ప్రయత్నించినా లాభం లేకపోయింది. పదే పదే ఆ అస్పష్ట గతాన్ని తవ్వుతూ బాధించేది. తనకదో వినోదం అయిపోయిందనే చెప్పాలి. ఇదంతా మా అమ్మ దగ్గరలో లేనప్పుడే చేసేది. పెళ్ళైన రెండేళ్ళకే, అమ్మ కూడా చనిపోయిన తర్వాత, ఇక పట్టపగ్గాలేకుండా అయిపోయింది. తనకి సర్వాధి కారాలు వచ్చేశాయి. భర్తను పదే పదే నంజుకొని తినటం ఇంకా సరదా అయిపోయింది – పిల్లికి వినోదం ఎలుకకి ప్రాణసంకటం రీతిలో–

ఎప్పుడైనా, నాకు పులమారితే – "పాపం మీ కనకం తలుచుకొంటోంది కాబోలు అని మూతి తిప్పుకొంటుంది. ఒకసారి ముచ్చటపడి కొత్త పట్టు చీర కొనితెస్తే – "అబ్బే ఇది నాకేం నప్పుతుంది. మీ కనకానికైతే బాగుంటుంది గాని – ఆవిడి కలర్‌ని దృష్టిలో పెట్టుకొని తెచ్చారనుకొంటాను" అంది ముసిముసి నవ్వులు ఒలికిస్తూ, ఆవిణ్ణి ఎప్పుడూ చూడకపోయినా – "పిల్లల్ని అస్తమానూ కసురుకోకోయ్..." అని ఒకసారి అంటే 'ఓహో కనకం అయితే పిల్లలు అల్లరి చేసినా బుజ్జగిస్తుందా" అని పూనకం వచ్చినట్లు అరిచింది. ఒకసారి "కూర సరిగ్గా కుదిరినట్లు లేదు" అని నసిగిన పాపానికి, "ఓహో మీ కనకమైతే వంటల్లో ఆరితేరిందేమో – నేనుకాదులెండీ" అని సాగదీసింది. నేను క్రాఫు పైకి దువ్వుకోవటం చూసి "మీ కనకానికి అలాంటి క్రాఫు ఇష్టమా..." అని అడిగేసింది.

"ఏమోయ్ నీ జాకెట్ స్లీవ్స్ బుట్టల్లా కుట్టించుకోవటం చాలా బాగుందిస్మీ..." అని అన్నానో లేదో "ఓహో కనకం జాకెట్లు ఇలానే కుట్టించుకొనేది కాబోలు" అని సణిగింది - బహశ్య "లోనెక్" కూడా కుట్టించేదేమో - మీరు నిశితంగా చూసేవారేమో, అందాల పొంగుల్ని... నావల్ల కాదు బాబూ అలాంటి జాకెట్లు వేసుకోవటం... "ఇలా ఇలా చంపుకు తినేస్తోందన్న మాటేగాని, మిగతా అన్ని విషయాల్లోను బాగానే చూసుకొంటుంది. అందుకే ఈ అసౌకర్యాన్ని భరిస్తూనే సంసార మధుర సాగరాన్ని ఈదుతున్నాను.

ఇలా కాలం జరుగుతూండగా, కనకం నుంచి ఉత్తరం వచ్చింది నాకు! ఇంటి అడ్రస్సుకే, ఎలా తెలుసుకొందో గాని రాసింది. ఇంటి అడ్రసుకి వచ్చే ఉత్తరాలన్నీ తనే ముందు చింపి చదివే అలవాటుకి భంగం కలిగించకుండా, బ్యాంకునుంచి వచ్చిన వెంటనే తను చదివేసిన ఉత్తరాన్ని చేతుల్లో పెట్టింది కాంతం. "కనకం దగ్గరనుంచి ఉత్తరమండీ" అని ముక్తసరిగా అంటూ ఆశ్చర్యపోవటం నా వంతైంది. నెమ్మదిగా చదివేను.

*బావా,*

*నా పెళ్ళైన కొన్నాళ్ళకే అమ్మానాన్న పోయేరని తెలుసనుకొంటాను. నా దురదృష్టం కొద్దీ నిరుడు నా భర్త కూడా కాలం చేసేరు. నేను కొంత కాలంగా అనారోగ్యంగా ఉంటున్నాను. ఇక్కడి డాక్టరు, హైద్రాబాదు వెళ్ళి గర్భసంచి ఆపరేషన్ చేయించుకోవాలని, ఆలస్యం చేస్తే కష్టమని చెప్పేరు. నా ఆర్థిక పరిస్థితి అంత బాగాలేదు. అక్కడికి వచ్చి గవర్నమెంటు హాస్పిటల్‌లో ఆపరేషన్ చేయించుకోవాలను కొంటున్నాను. పిల్లలిద్దర్నీ చుట్టాల ఇంట్లో పెట్టి నేను మాత్రం వస్తాను. గవర్నమెంటు హాస్పిటల్‌కి దగ్గరలో ఒక గది, పదిహేనురోజులకు తక్కువ అద్దెలో, ఏర్పాటు చేయగోర్తాను. నాకు సాయం చేసే వాళ్ళింకెవరు హైద్రాబాద్‌లో లేరు. అందుకే నీకు శ్రమ ఇస్తున్నాను. ఏ సంగతీ రాయగోర్తాను - కొంత సొమ్ము అప్పు తీసుకొని వస్తాను. నీకు ఆర్థిక భారం కాబోను.*

*ఇట్లు*

*కారుమంచి కనకం*

నేను ఉత్తరం చదివేదాకా ఓపిగ్గా ఆగి, కాంతం నెమ్మదిగా అడిగింది

"ఏం చేద్దామనుకొంటున్నారూ?"

వెంటనే సమాధానం చెప్పలేకపోతే మళ్ళీ రెట్టించి అడిగింది –

ముందు తత్తరబడ్డా, జాగ్రత్తగా ఆలోచించి జవాబిచ్చేను... "ఆ! ఏముంది? నాకెందు కొచ్చిన సంత... ఏ జవాబూ రాయకుండా ఉంటే, నా సాయం దొరకదని తెలుసుకొని, తన తంటాలేవో తను పడుతుందిలే..."

"ఊహూ! అది చాలా తప్పు – అమానుషం – కిరాయికి రూము అవసరం లేదు. మా ఇంట్లో గెస్ట్ రూము ఖాళీగానే ఉంది. నువ్వు మాతోనే ఉండవచ్చు. ఆపరేషన్, ఆ తర్వాత చికిత్స పూర్తయేవరకు మొహమాటమేమీ పడకుండా పిల్లలతో కలిసి వెంటనే వచ్చేయ్" అని రాయండి. ఆలస్యం చేయవద్దు" అని ఆర్డరేసి తన ముఖంలోని భావాలేమి చదవడానికి వీలు లేకుండా, వంటింట్లోకి వెళ్ళిపోయింది. నా బుర్ర తిరిగిపోయింది. కాంతం మాటలకి! రోగి కోరుకొన్నదే వైద్యుడు చెప్పినట్లయింది. అయినా, "కాంతం నాకెప్పుడు అర్థమైంది గనుక" అని గొణుక్కుంటూనే, తను ఆదేశించిన ప్రకారం, తు.చ. తప్పకుండా కనకానికి జాబు వ్రాసేశాను గాని, "ముందున్నది ముసళ్ళ పండగ!" అనుకొంటూ రోజులు గడిపేశాను. కాంతం కూడా ఆ ప్రస్తావన మళ్ళీ తేలేదు. కనకం ప్రస్తావనతో నన్ను నంజుకొని తినడానికి విరామమిచ్చింది.

వారం తిరక్కుండానే నేనింట్లో ఉన్నప్పుడే, కొద్దిపాటు సామానుతో పిల్లలు లేకుండానే, రిక్షాలో మా ఇంటికి వచ్చిన కనకాన్ని నేనే ముందు గమనించినా, గదిలోనే ఉండిపోయేను! అంతలో కాంతం, లోపలికి రావడానికి సంకోచిస్తున్న కనకానికి ఎదురెళ్ళి ఆప్యాయంగా లోపలికి తీసుకొని వచ్చి అతిథి సత్కారాలు చేయసాగింది. "పిల్లల్నీ తీసుకు రమ్మని రాశాం కదా" అని అడిగింది. గెస్టు రూములో బస ఏర్పాటు చేసింది. అంతా మౌనంగా గమనిస్తూ, గదిలోనే ఉండిపోతే, "ఏమండీ ఒకసారి కనకాన్ని పలకరించి వెళ్ళండి" అని ఆర్డరేస్తే, అటు వెళ్ళి "ఆ! బాగున్నావా"అని పొడిపొడిగా పలకరించి సమాధానం వినకుండా ఎవరో తరుముతున్నట్లు వేగంగా వెనక్కి వచ్చేశాను. మరి కాంతం అంటే అంత భయం

నాకు! అంతేకాదు బొట్టు లేకుండా విషాద వదనంతో ఉన్న కనకాన్ని ఎక్కువసేపు చూడలేక పోయాను. ఆవిడి మనసులోని పశ్చత్తాపం, ముఖంలో స్పష్టంగా కనపడింది –

కనకం ఉన్నన్నాళ్ళూ ఘనంగా అతిథి సత్కారాలు, భోజనాది వసతులు కల్పించటమే కాకుండా, తను వద్దంటున్నా వినకుండా ఒక పెద్ద ప్రైవేటు హాస్పిటల్‌లో ఆపరేషన్ తదనంతర చికిత్స ఏర్పాట్లు చేసి ఫీజులు కూడా తనే చెల్లించింది కాంతం. చికిత్స పూర్తయ్యేవరకూ ఇంట్లోనే ఉంచింది. హాస్పిటల్లో ఉన్న రెండు రోజులూ తనే తోడు వుంది.

కనకం ఇంటికి తిరిగి వెళ్ళే రోజు వచ్చింది. కాంతం కన్నీళ్ళు కారుస్తూ, టాక్సీలో రైలు స్టేషనుకి కూడా వెళ్ళి రైలెక్కించి వచ్చింది. వెళ్ళేముందు చీర కూడా పెట్టిందని వేరేచెప్పాలా?

కాంతం ఇంతలా మారిపోవడానికి కారణమేంటో నాకంతుపట్టలేదు. ఇదంతా, నాకు అత్యంత ప్రీతికరమైన రీతిలో జరిగినా, మనసు ఎందుకో విచిత్రలోకంలో విహరిస్తున్నట్లు, ఆగమ్య ప్రపంచంలో తిరుగాడుతున్నట్లు అన్పించింది. కాంతానికి నా వేలు విడిచిన మరదలు కనకం పట్ల ఇంత ప్రేమ ఎందుకు కలిగింది. ఇంత అకస్మాత్తుగా ఇంత అపారంగా, అన్న ప్రశ్నలు మనసుని దొలిచివేయసాగేయి. జవాబులు ఆ రోజురాత్రే లభించాయి.

పిల్లలు పడుకొన్నాక, ఏకాంతం లభించిన వెంటనే కాంతం నన్ను ప్రేమగా చుట్టుకు పోతూ, కన్నీళ్ళతో తడిసి ముద్దయిపోతున్న ముఖాన్ని మాత్రం మరోవైపు తిప్పుకొని గద్గద స్వరంతో చెప్పింది...

"ఏమండీ... ఇన్నాళ్ళూ కనకం అంటే ఈర్ష్య, కోపం వెలిబుచ్చుతూ అనుక్షణం మిమ్మల్ని వేధించిన కారణాన్ని ఇప్పటికీ చెప్పకపోతే నన్ను దేవుడు కూడా క్షమించడండీ... మీకు తెలియదు నాకో బావ ఉన్నాడు... ఉండేవాడు.... పేరు సుందరం – పేరుకు తగ్గరూపం – ప్రేమ కలాపాలేమీ జరగలేదుగాని చిన్నప్పట్నుంచి అతన్నే ఇష్టపడ్డాను. వయసు వచ్చేక తననే పెళ్ళి చేసుకోవాలని కలలు కన్నాను. గాఢంగా కోరుకున్నాను. కాని అతనికి మేనరికాలు ఇష్టం లేదో

నేను నచ్చలేదో తెలియదు గాని, కాంతాన్ని నేను ఎట్టి పరిస్థితుల్లోనూ పెళ్ళి చేసుకోనని నిష్కర్షగా చెప్పేసాడు....

"మీతో నా పెళ్ళికి ముందే ఎవరో దూరపు బంధువుల అమ్మాయిని ఏదో పెళ్ళిలో చూసి, మనసు పారేసుకొని, ఆపైన పట్టుబట్టి కట్నం లేకుండా పెళ్ళి చేసుకొన్నాడు. ఆవిడే కనకం... బావను నాకు కాకుండా చేసిందన్న కోపం, ఆవిణ్ణెప్పుడు చూడకపోయినా అంతకంతకూ బలపడిపోయింది. కనకం పేరు జ్ఞాపకం వస్తేనే, వళ్ళు మండిపోయేది. మీతో పెళ్ళయాక కోపం, ఈర్ష్య మరీ పెరిగిపోయాయి. మీరు కనకాన్ని ఇష్టపడ్డారని చూచాయగా విన్న విషయం మొదటిరాత్రే నిర్ధారణయింది. కనకం అంటే ఇంకా ఇంకా కోపం పెరిగిపోయింది. తననేం చేయలేను గాబట్టి అనలేను గాబట్టి, ఆ కోపమంతా అమాయక చక్రవర్తి అయిన మీ పైకి మళ్ళించేదాన్ని. పదే పదే మిమ్మల్ని వేధించేదాన్ని – కనకం నుంచి ఉత్తరం వచ్చినతర్వాతనే బావ సుందరం చనిపోయేదని తెలిసింది. చాలా బాధ కలిగింది. కనకం మీద సానుభూతి కలిగింది. మా బావ భార్యకు సాయం చేస్తే అతనికి ఆత్మశాంతి కలుగుతుందని అనిపించింది. అందుకే పిలిపించి మన ఖర్చుమీదనే ఆపరేషన్ చేయించాను – ఇంకో విషయం చెప్పాలి – మిమ్మల్ని కాక, బావనే చేసుకొనుంటే, కనకానికి వచ్చిన వైధవ్యం నాకు వచ్చేది కదా... దాన్నుంచి తనే నన్ను రక్షించింది కదా...అని కూడా అనిపించింది... అందుకే ఇదంతా చేశాను... అయినా తెలిసీ తెలియని వయసులో బావని ఇష్టపడ్డా, ఇప్పుడు మీరంటేనే నాకు ప్రేమ,అనురాగం... నమ్మండి..." ఇంకేమీ చెప్పలేక వెక్కి వెక్కి ఏడుస్తున్న "నా కాంతాన్ని" దగ్గరకు తీసుకొని నీ మనసు అర్థం చేసుకొన్నానని నమ్మబలికి సముదాయించాను. తర్వాత కూడా, కాంతం కనకానికి అప్పుడప్పుడు ఆర్థికసాయం చేస్తున్నా నేను అభ్యంతరం పెట్టలేదు. ఆడ మనసునర్థం చేసుకొన్నాను గాబట్టే –

# ఛీ! నాన్న పెళ్ళి చేసుకొన్నాడా!!

–"ఛీ! నాన్న పెళ్ళి చేసుకొన్నాడా...!!!" – గత ఆదివారం నుండి ఈ ఆదివారం వరకు ఒక లక్ష, రెండువేల, మూడువందల నలభై అయిదో సారి, కోపం, ఆక్రోశం, ఉక్రోషం, అపరాధభావం, అవమానభారంతో కలిపిన ఆశ్చర్యానికి గురయింది, భారత వనిత, అనిత, – అమెరికాలో, న్యూజెర్సీలో స్వగృహంలో, వంటింట్లో ప్రతి ఆదివారంలానే కష్టావధానం అష్టావధానం చేస్తూ – ఇంటి పని, వంటపనితో సతమతమవుతూ –

అనిత, అనంత్ ధర్మపత్ని – అనంత్‌కి గ్రీన్‌కార్డు వచ్చేసినందున, 'న్యూజెర్సీ'లో సాఫ్ట్‌వేర్ ఇంజినీరుగా పనిచేస్తున్నందున, అనిత కూడా వేరే ఉద్యోగం చేస్తున్నందున 'స్వంత ఇల్లు' కూడా ఏర్పాటు చేసుకొని అమెరికాలో దాదాపు స్థిరనివాసులైపోయారు. రెండేళ్ళకోసారి మాత్రం; భారత్ దర్శనానికి సంతోషంగా వస్తూంటారు. ఏమయినా ఇద్దరూ 'భారతీయత', నూరుపాళ్ళు నిల్పుకున్నారనే చెప్పుకోవచ్చు.

అనిత, భరత ఖండం ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం, పశ్చిమగోదావరి జిల్లా భీమవరం వాస్తవ్యులు, రిటైర్డ్ కాలేజీ ప్రిన్సిపాల్ 'సింగారం నాయుడు' గారి గారాలపట్టి. తల్లి చిన్నప్పుడే పోయి నందున, తండ్రి నాయుడు వారి ఆలన, లాలన, పాలనలో గారంగా పెరిగింది. తల్లి గురించి పెద్దగా స్వంతజ్ఞాపకాలు లేవు గాని, కొంత పెద్దయ్యాక, వాళ్ళూ వీళ్ళూ మాట్లాడు కొంటే విని, తన తల్లి ఎప్పుడూ అనారోగ్యంతో ఉండేదని, దానికి తోడు ఐశ్వర్యవంతుల కుంటుంబం నుంచి వచ్చానన్న అహంభావం కూడి భర్తతో పెద్ద సాన్నిహిత్యంగా ఉండేది కాదని తెలుసుకొంది. తల్లి పోయిన కొత్తలో పెద్దమ్మ వరస ఓ ముసలావిడ వీళ్లింట్లో ఉండేది... "ఇతగాడిని, నీకేం తక్కువ... మళ్లీ పెళ్లి చేసుకోమని సలహా ఇస్తున్న

వెధవలు చాలా మందున్నారు వాళ్ళ మాటలకు లొంగిపోయి, పొంగిపోయి, పెళ్ళి చేసేసుకొంటాడో ఏమిటో – ఈ పిల్లకి – సవతి తల్లి యాతన వ్రాసిపెట్టిందో ఏమిటో దేవుడా!" అని తరచూ గొణుక్కుంటూ ఉండేది –ఈ పిల్ల మీది ప్రేమ కన్నా నాయుడుగారు పునర్వివాహం చేసేసుకొంటే ఈ ఇంట్లో ఇంకో ఆడది ప్రవేశిస్తే తన 'ప్రాబల్యం' తగ్గిపోతుందన్న 'దుగ్ధ'యే కారణం ఆ గొణుగుడికి. – అయితే, అప్పటికి, ఏడేళ్ళ లేతవయసున్న అనితపై మాత్రం మానసికంగా చాలా దుష్ప్రభావం పడింది. తనని ఒకవిధమైన అభద్రతాభావానికి గురిచేసింది – స్కూల్లో సవతి తల్లులు, పెట్టే హింసల గురించి కొన్ని కథలు వినటంతో, చాలా సంవత్సరాల వరకు, అనిత 'సవతి తల్లితో ఉపద్రవం' అన్న ఫోబియాకి లోనయేది – ఎప్పుడూ నాన్న గదిలోనే పడుకొనేది అప్పుడప్పుడు సవతితల్లి పెట్టే బాధలకు సంబంధించిన పీడకలలు వచ్చి, వెంటనే నాన్న పక్కలోకి దూరిపోయి, ఆయన్ని కరిచిపెట్టుకొని పడుకొనేది – అయితే, వయసుతో పాటు, నాన్న గురించి పెరిగిన అవగాహన వలన, తన భయాల్ని బెదురుని ఎవరితోనూ పంచుకోకుండా ఉండేది. మనసులోనే దాచుకొనేది – అయితే, ఈ క్రమంలో, తండ్రికి బాగా చేరువ అయింది – "నాన్నకూచి" అయిపోయింది – కూతురులో గూడు కట్టుకొన్ని అభద్రతాభావాన్ని' అర్థం చేసుకొన్నారో లేదోగాని, నాయుడుగారు మాత్రం, ఎప్పుడూ ఎవరెంత నచ్చజెప్పజూసినా, బలవంతం చేసినా, పునర్వివాహం ఊసే తలపెట్టలేదు!! కూతురు అనితే తన సర్వస్వంగా జీవనం సాగించేరు – అయినా, సమయం వచ్చినప్పుడు ప్రేమను పక్కనపెట్టి, తన బాధ్యతకు పెద్దపీట వేసారు. కుమార్తె ఉన్నత విద్యాభ్యాసం పూర్తిచేసి, యుక్తవయస్కురాలైన వెంటనే, ఆలస్యం చేయకుండా, బంగారం లాంటి అమెరికా సంబంధాన్ని కుదిర్చేరు. అమెరికాలో 'సాఫ్ట్‌వేరు ఇంజనీరు' గా పనిచేస్తున్న 'బంగారం' వారబ్బాయి అనంత్‌కిచ్చి వైభవంగా పెళ్ళి చేసారు. కండువాతో కళ్ళు తుడుచుకొంటూ, అమ్మాయిని, విమానం ఎక్కించేరు. ఇది, అనిత కూడా ఇష్టపడి చేసుకొన్న పెళ్ళే. చదివింది మేనేజ్‌మెంటు కోర్సే అయినా, కొంచెం దూరదృష్టితో ఇండియాలో ఉన్నప్పుడే, కొన్ని కంప్యూటరు కోర్సులు చేసి యున్నందువలన, తను కూడా అమెరికాలో తగిన ఉద్యోగం సంపాదించుకొని భర్తతో దాదాపు సమానంగా వేతనం పొందసాగింది – అయితే భారతీయ వనిత కాబట్టి, ఉద్యోగ భారానికి అదనంగా ఇంటి చాకిరీ, పెద్దగా

మగసాయం లేకుండా, ఆనందంగా చేయసాగింది. పెళ్ళై అయిదేళ్ళయినా, ఇంకా పిల్లలను ప్లాన్ చేయలేదు.

అనిత, అలా అమెరికాలో ఆనందంగా సంసారం చేసుకుంటున్నా, సర్వీసులోంచి రిటైరైపోయి, కేవలం ఒక వంటవాడిని మాత్రం పెట్టుకుని, లంకంత ఇంట్లో దాదాపు వంటరి జీవితం గడుపుతున్న నాన్నని తలుచుకొని బాధపడని రోజుండదు!! అలానే, ఆయన ఎంత ధర్మపరుడో, ఎంత నిష్ఠాగరిష్టంగా జీవితం గడుపుతూ అన్నీ తనే అయి, తనను ఎలా పెంచి, పెద్ద చేసాడో, భర్త అనంత్‌కి మాత్రమే కాకుండా పరిచయస్తులు మిత్రులందరికీ ఎన్నిసార్లు చెప్పుకొని మురిసిపోయినా, తనివి తీరదు అనితకు –

రోజూ ఒక ఎత్తు – ఆదివారం ఒక ఎత్తు – అంత పనుంటుంది అమెరికాలోని భారతీయ గృహిణులకు, వారమంతా భర్తతో సమానంగా ఉద్యోగం చేస్తున్నవాళ్ళతో సహా! మొగాళ్ళైతే, భారతీయులు గాబట్టి ఇంటి పనంతా అర్ధాంగులకే ఉదారంగా వదిలిపెట్టి, టెన్నిస్ ఆడుకోవటంతోను, భారతీయ సినిమాల కేసెట్లు చూడటంతోను "ఇంటర్నెట్ వీక్షణం'తోను హాయిగానే గడిపేస్తారు ఆదివారాల్ని – అంతేగాని ఇంటి పనిలో భార్యకు సాయం చేసేవాళ్ళు తక్కువే ఉంటారు.

అనితకి కూడా, ఆదివారం ఇంటిపనీ చాలా ఉంటుంది. అయినా ప్రతి ఆదివారం తప్పనిసరిగా న్యూజెర్సీ సమయం, ఉదయం పదకొండు గంటలకు అంటే భారతీయ కాలమాన ప్రకారం రాత్రి తొమ్మిది గంటలకు, తన పనులు చేసుకొంటూనే కార్డ్‌లెస్ ఫోను చెవి దగ్గర పెట్టుకొని, నాన్నతో ఒక గంట మాట్లాడే తీరుతుంది. ఆయన కూడా ఈ "కాల్" కోసం ఎంతో ఆత్రంగా, ఎదురుచూస్తూ ఉంటారు. ఈ గంట సమయాన్ని, ఎంతో అపురూపంగా చూసుకొంటారు ఇద్దరూ! అనిత గలగలా, ఎంతో ప్రేమగా మాట్లాడి, ఇద్దరి మధ్యనున్న ఖండాంతరాల దూరాన్ని అవలీలగా తగ్గించేస్తుంది.

నాయుడుగారు "ఏంట్రా మనవణ్ణి ఇచ్చేదెప్పుడ్రా బాబూ" అంటే కిలకిలా నవ్వుతూ "ఇప్పుడప్పుడే వద్దులే నాన్నా – ముందు ఇంటిమీద ఇద్దరి కార్లమీద అప్పుతీరాలి – బ్యాంకులో పొదుపు ఖాతా లక్ష డాలర్లకి చేరుకోవాలి – ఇంకో

రెండు సంవత్సరాలేసుకో..." అని ఖచ్చితంగా చెప్పేస్తుంది - అమ్మ ఉన్నా చెప్పుకొనేది కాదేమో, అనుకొనే విషయాలెన్నో అరమరికలు లేకుండా నాన్నతో పంచుకొంటుంది.

"అంతేలే నాన్నా మగవాళ్ళంతా ఒక్కటే! నువ్వేమనుకొన్నా సరే, నాకు అమ్మాయినే కనాలనుంది - చూడు, అనంత్ కూడా అబ్బాయే కావాలంటాడు - బోడి - అంతా తన ఇష్టమేనా? ఓ నాన్నోయ్! మధ్యలో నువ్వు పెద్ద తెలివితేటలు ఉపయోగించి, ఇద్దరిఇష్టాలు, తీరేలా కవలల్ని కనమని 'తీర్పు' ఇవ్వొద్దు బాబోయ్! నాకంత ఓపిక లేదు నాన్నోయ్!" అని ఆట పట్టిస్తుంటే, హాయిగా నవ్వేసుకొంటారు నాయుడుగారు - తను మాట్లాడిన, తర్వాత మేడమీదుండే అనంత్‌కి, కనెక్షనిచ్చి కాసేపు మాట్లాడిస్తుంది -

కాని ఈ ఆదివారం మాత్రం, మిగతా అన్ని పనులు, అన్యమనస్కంగానైనా చేసుకొంటున్న అనిత, నాన్నకు ఫోనే చేయలేదు!!! మధ్యలో ఫోను దగ్గరకు ఎన్నోసార్లు వచ్చింది గాని, పళ్లు బిగించుకొని, ఎలాగో నిగ్రహించుకొని, ఫోను చేయకుండా వెనక్కి వెళ్ళిపోవటం అనంత్ కూడా గమనించాడు, మేడ మీదే, ఏదో పనిలో ఉన్నా -

అనితకు, మనసునిండా నాన్న గురించే ఆలోచనలు - కాని, ఫోను చేయడానికి మాత్రం మనస్కరించలేదు. కాసేపటికి ఎలాగో వంట పూర్తయిందనిపించి, అనంత్‌ని భోజనానికి పిలిచింది. కిందికి వచ్చిన అనంత్, ముఖం కళ్ళూ ఉబ్బిపోయి చాలా దైన్యంగా కనబడుతున్న భార్యను చూసి, నిజంగానే చలించిపోయాడు. ఏదో ఓదార్పు మాటలు చెప్పాలనుకొన్నంతలోనే, గత ఆదివారం నుండి ఎన్నోసార్లు లోపలే అనుకొంటున్నది ఈసారి పొరపాటున పైనే అనేసింది - "ఛీ! నాన్న పెళ్ళి చేసుకొన్నాడా!!' - అని వెంటనే భోరున ఏడ్చేసింది, మనసులోను, గొంతులోను, సుళ్ళు తిరుగుతున్న బాధ వేడినీటి ఊటలాగ పైకి ఎగదన్నేసినందువలన -

ఏం చేయాలో, ఏం చెప్పాలో, ఎలా ఓదార్చాలో తెలియక అనంత్ కొయ్యబారిపోయాడు "పెళ్ళివార్త" చెప్పి అనితను, అంతలా అప్‌సెట్ చేసినది

తనే కదా, అని ఫీలవుతూ గత ఆదివారం జరిగింది మననం చేసుకోసాగేడు – అసలేం జరిగిందంటే –

గత ఆదివారం అనిత, వంటపని, ఇంటిపని చేసుకొంటూనే, ఎప్పటిలా నిర్దిష్ట సమయానికి, నాన్నతో మాట్లాడుదామని ఫోన్ కలిపింది భీమవరానికి. కాని "ఇంట్లో నాన్న లేడని" ఆన్సరింగు మెషీన్‌లో మెసేజ్ ఉండేసరికి హతాశురాలైంది. ఆ మెసేజ్ సరిగా వినకుండా, ధబేల్‌మని ఫోను పెట్టేసింది, అంతులేని నిరాశతో – తిరిగి ఇంటి పనితో పడిపోయినా, ఏదో పోగొట్టుకున్నట్లు ఫీలవుతూనే ఉంది. తనకు అలాగే ఉంటుంది, ఏ వారమైనా నాన్నతో మాట్లాడలేకపోతే – పైగా ఈ వారంలో ఎన్నో ముఖ్యమైన విషయాలు చెప్దామనుకొంది. తనకూ, అనంత్‌కీ 'సేలరీరైజ్' వచ్చిందని, ఇక త్వరలో 'మూడోవ్యక్తి' రాక ప్లాన్ చేసుకొంటామని...

ఆ సమయంలో టెన్నిస్ ఆటనుంచి, తిరిగివచ్చిన అనంత్ వంట ఇంకా పూర్తికాలేదని గమనించి, మేడపైకి వెళ్ళిపోయి, కంప్యూటర్‌లో "ఇంటర్నెట్" ఓపెన్ చేసి ఆ రోజువి, భారతీయ దినపత్రికలు, ముఖ్యంగా తెలుగువి, చూడసాగేడు. – మన ప్రధాన దినపత్రికలన్నిటికి "ఇంటర్నెట్" ఎడిషన్లున్నాయి. అంటే ప్రపంచంలో ఎక్కడున్నవాళ్ళయినా, మన దినపత్రికలను, తమ కంప్యూటర్ స్క్రీన్ మీదికి రప్పించుకొని ఆసాంతం చూడవచ్చు, చదవొచ్చున్నమాట! మనదేశంలోనే, కొన్ని మారుమూల పల్లెలకు దినపత్రికలు ఒకరోజు ఆలస్యంగా చేరుతాయి. అంటే నిన్నటి పేపరు ఈ రోజు చదువుతారన్నమాట! అయితే, ఎక్కడో అమెరికాలో ఉంటున్న ప్రవాస భారతీయులు ఏ రోజు పేపరు ఆ తేదీనాడే చదువుకొని తాజా వార్తలు తెలుసుకోగలరన్నమాట!! ఇది సమాచార విప్లవంలో ఒక పార్శ్వం!!

గత ఆదివారం ఒక తెలుగు దినపత్రిక మెయిన్ ఎడిషన్లో హెడ్‌లైన్లు సాంతం చదివేసి, పశ్చిమగోదావరి జిల్లా సప్లిమెంటరీని, తన కంప్యూటరు స్క్రీన్ పైకి తెచ్చుకున్నాడు. అనితలానే, అతను కూడా పశ్చిమగోదావరి జిల్లావాడే – మొదటపేజీలోనే ప్రచురితమైన ఒక 'ఫొటో' చూసి ఆశ్చర్యచకితుడయ్యాడు కళ్ళు నలుముకొని మళ్ళీ మళ్ళీ చూసేడు – అది ''పెళ్ళి ఫొటో'' అని నిర్ధారించుకొన్నాడు.. అనితా".. అని పైనుంచీ పిలిచేడు – కాదు అరిచేడు

"ఆ! ఏమిటీ... వంట అయిపోవచ్చింది.. ఒక్కక్షణం..." మామూలుగానే అంది "ఆ... అదికాదు... మరి, మరి... మరి... మీ నాన్న పెళ్ళి చేసుకొన్నాడు" - బాంబు పేల్చేడు!!!

"వ్యాట్ నాన్సెస్ యూ ఆర్ టాకింగ్? ... బ్లడీ" ఇంకా ఏదో గర్జించబోయి తమాయించుకొంది అనిత... తనకూ నాన్నంటే ఎంతో గౌరవం - నన్ను స్వంత కొడుకులా చూసుకొంటారు మా మావగారు - ఆయన చాలా గొప్ప వ్యక్తి - అని అందరికీ చెప్పుకొనే అనంత్, ఇలా వాగుతున్నాడేమిటి? అమ్మ పోయి ఇరవై ఏళ్ళయినా, ఎవరెన్నిసార్లు బలవంతపెట్టినా, మళ్ళీ పెళ్లి చేసుకోని నాన్న ఇప్పుడు, అరవై మూడేళ్ళ వయసు వచ్చాక, పెళ్ళి చేసుకొంటాడా?? అనంత్ ఇంత 'క్రూయల్ జోక్ వేసాడేమిటీవేళ.." ఇలా ఆయోమయంలో పడిపోయింది అనంత్ కిందికి వచ్చేడు చేతిలో ఉన్న ఏదో కాగితం అనితకీయ బోయాడు.

"ఏమిటన్నట్లు" - ఉరిమి చూసింది అది, అందుకోకుండానే

"మరేమో... తెలుగు డైలీ ఇంటర్నెట్‌లో చూస్తుంటే, వెస్ట్ గోదావరి జిల్లా ఎడిషన్‌లో మీ నాన్న పెళ్ళి ఫొటో పడింది... ఇది ప్రింటవుట్ - డౌన్‌లోడ్ చేసి తీసుకొచ్చాను" - అన్న అనంత్ మాటలకి ఇంకా అయోమయంలో పడిపోయింది నాయుడు గారి కుమార్తె అనిత-

నాన్న పెళ్ళి ఫొటోనా - అప్పుడెప్పుడో అయిన పెళ్ళి ఫొటో ఇప్పుడెందుకువేస్తారు??? అమ్మ వర్ధంతి కూడా దగ్గరలో లేదే!" విస్మయం చెందింది.

పాత పెళ్ళి ఫొటో కాదు అనితా... మీ అమ్మతో పెళ్ళిది కాదు - మళ్ళీ పెళ్ళన్నమాట ఇంకో అమ్మాయిని రెండ్రోజులక్రితం చేసుకొన్నారన్నమాట.. నేనూ నమ్మలేకపోయాను.. కాని..." ఇంకా ఏమో చెప్పబోతుంటే, అతని చేతిలోని ఆ కాగితం... ఆ ప్రింటవుట్ లాక్కొంది - ఫొటో చూసింది.. మళ్ళీ మళ్ళీ చూసింది... నిజమే నాన్న మళ్ళీ పెళ్లి చేసుకొన్నాడు! పేపరు మీద తేదీలు చూస్తుంటే, రెండు రోజులక్రితం జరిగిన పెళ్ళని తెలుస్తోంది. కట్టుకొన్న బట్టల కన్నా తెల్లని జుట్టుతో నాన్న ఫొటోలో ఎలా నవ్వుతున్నాడో ఈ వయసులో పెళ్ళి చేసుకొన్నానని ఏమాత్రం

సిగ్గుపడకుండా!! నవ్వుతుంటే కొన్ని పళ్ళు ఊడిపోయినట్లు స్పష్టంగా తెలుస్తోంది. ముసలితనం కన్పడుతోంది – మరి పెళ్ళి కూతురు... దండ వేస్తున్న యువతికి... ఇరవై ఏళ్ళుంటాయేమో... పోనీ పాతిక... నా కన్న చిన్నది... కూతురి కన్నా చిన్నదాన్ని, కూతురితో ఏమాత్రం చెప్పకుండా ఎలా పెళ్ళి చేసుకోగలిగేడు... ఈ ముసలాయన సరదా సరే... ఆ పడుచు పిల్లకేమయింది.... ఏ పరిస్థితుల్లో ఈ పాడుపెళ్ళి చేసుకొన్నట్లు... తన కన్నెరికం విడిపించడానికి మా నాన్నే దొరికాడా ఈ మహాతల్లికి... నాకు పిన్నై కూర్చుంది... పాడు... అసలావిడెలాంటిదో... కేవలం ఆస్తి కోసం కక్కుర్తి పడిందా?..." ఇలా, అనిత మనసు పరిపరివిధాల సుళ్ళు తిరిగింది... ఫొటో చూస్తున్నకొద్దీ ఆశ్చర్యం అంతకన్నా కోపం, ఉక్రోషం... అంతకన్నా అవమాన భారం కమ్ముకోసాగేయి

మధ్యలో ఒకసారి అపరాధభావం కూడా కలిగింది... 'అంటే ఇన్నేళ్ళూ తనకు మళ్లీ పెళ్ళి అవసరమనిపించినా, కేవలం నాకోసం తన కోరిక ఆపుకొన్నాడా? ఇప్పుడు, నేను ఇంత దూరం వచ్చేసానని ఇంకే అడ్డూ లేదని పెళ్ళి చేసేసుకొన్నాడా? ఛ! షిట్.. నేనెప్పుడైనా ఆయన్ని పెళ్ళి చేసుకోవద్దని బ్రతిమాలానా? ఎప్పుడో చేసుకోవలసింది... పోనీ ఇప్పుడైనా ఒక మాటైనా చెప్పకుండా ఛఛ... పోనీ ఈడు జోడు అయినా చూసుకోకుండా అంత చిన్నవయసు దాన్ని పెళ్ళి చేసుకొని గొంతు కోయడానికి మనసెలా వచ్చింది???

భర్తతో కూడా తన బాధ పంచుకోకుండా, ఈ వారం రోజులూ అతిభారంగా గడిపేసింది అనిత... ఇండియాలో, ఇంకెవరికీ ఫోను చేయడానికి సాహసించలేకపోయింది, ఎవరేవిధంగా మాట్లాడుతారో, తనింకా "షేమ్" ఫీలవాల్సి వస్తుందేమోనని భయపడి!! ఈ ఆదివారం కూడా ఎవరికీ చేయలేదు – మధ్యలో ఒకసారి అనంత్‌కి అనిపించింది – ఓసారి వాళ్ళ నాన్నతో మాట్లాడిస్తే మంచిదని అనితకి చెప్పకుండానే మావగారింటికి ఫోను కలిపేడు.

నల్లబడిన ముఖంతో ఫోను భార్య కందించాడు... "ఏదో మెసేజ్ ఉంది... వినలేదా" అంటూ – అప్పుడు అనితకి జ్ఞాపకం వచ్చింది. ఫోను ఆన్సరింగు మెషీన్‌లో నాన్న పెట్టిన మెసేజ్ తను సరిగా వినలేదని మళ్ళీ వినేసరికి ఇంకా వళ్ళు మండిపోయింది.. ఇదీ మెసేజ్ నేను ఇంట్లో లేను... పిన్నీ నేను కలిసి

యాత్రలకు వెళ్తున్నాం... వచ్చే శనివారం రాత్రికి వస్తాం..." మొదటిసారి విన్నప్పుడు పిన్ని ప్రస్తావన పట్టించుకోలేదు. ఇప్పుడు విని ఛీ! షిట్... పిన్ని అని చెప్తున్నాడు సిగ్గులేకుండా! యాత్రలకట, యాత్రలు... పడుచు పెళ్ళాంతో హనీమూన్‌కని డైరెక్టుగా చెప్పడానికి సిగ్గు అడ్డు వచ్చింది కాబోలు... మాయదారి సిగ్గు... పెళ్లి చేసుకోవడానికి లేదు సిగ్గు...' అని మండిపోయింది.

"అయినా ఈ మెసేజ్‌లోనయినా – 'ఆ, ఏం అనుకోకమ్మాయ్ – నీకు ముందు చెప్పలేదని... ఏదో అలా జరిగిపోయింది... ఈవిణ్ణి మన కుంటుంబంలోని వ్యక్తిగా అంగీకరించు... ఆదరించు తల్లీ..." అని చెప్తే ఎంత బాగుండేది.. తను కూడా కరిగిపోయేది కాదా... ఇప్పుడు నా పరువేం కావాలి... అందరికీ గొప్పగా మా నాన్న త్యాగమూర్తి... అని చెప్పుకొనేదే! ఇప్పుడీవిణ్ణి మా పిన్ని అని ఎలా చెప్పుకోవాలి?... మా నాన్న ఈ వయసులో ఆ వయసమ్మాయిని పెళ్లి చేసుకొని గొప్ప నిర్వాకం చేసేడని ఎలా చెప్పుకోవాలి? – ఇలా ఈ వారమంతా కుమిలిపోయింది – మథనపడిపోయింది అనిత! –

ఇంకో కోణంలో ఆలోచించి సమాధానపడడానికి, రాజీ పడడానికి ఈ వారం రోజుల్లో అప్పుడప్పుడు అనిత ప్రయత్నించకపోలేదు.

'పోన్లే ఇక్కడ అమెరికాలో వయసు మీరినవాళ్ళు పెళ్ళి చేసుకోరా? నాన్నా అదే చేసేడని అనుకొంటే పోలా–' అని, తనకు తనే నచ్చజెప్పుకోబోయింది... కాని వెంటనే, 'ఈయన వయసు అరవై మూడు.. పాపం ఆ అమ్మాయి ఇరవై...' పోనీ పాతిక... రామ... రామ... అన్న భావం మనసుని చెళ్ళున కొట్టేది–

అప్పుడు, తనూ అనంత్ ఈ మధ్యనే మిత్రులతో చెప్పుకొని, పడీపడీ, నవ్వుకొన్న విషయం గుర్తుకొచ్చింది.

– 'జాన్' అనంత్ బాస్... వయసు అరవై... ఈ మధ్యనే యాభై అయిదేళ్ళ పెళ్ళాం 'జానీ'కి విడాకులిచ్చేడు. వీళ్ళిద్దరికీ, కలిగిన పుత్రరత్నం పేరు 'బాన్' బాన్ వయసు పాతికే... ఇప్పుడు ముగ్గురూ విడివిడిగానే ఉంటున్నారు. మదర్సుడేనాడో ఫాదర్సుడేనాడో జ్ఞాపకం లేదు గాని ఒక రెస్టారెంటులో ఈ మధ్యనే కలుసుకొన్నారు. అయితే ఈ మీటింగుకి తమ ప్రస్తుత పార్టనర్సుని

కూడా తీసుకొని వచ్చారు. పార్టనర్సు అంటే ఏదో వ్యాపారంలో భాగస్వాములని కాదు అర్థం - చర్చిలో చేసుకొన్న దాంపత్య భాగస్వాములే కానైతే, వయసు పట్టింపు లేకుండా మోజుపడి చేసుకొన్న పెళ్ళిళ్ళు - జాన్ ప్రస్తుత భార్య వయసు పాతిక! ఆయన మాజీ భార్య జానీ మేడమ్ గారి ప్రస్తుత భర్త వయసు ముప్ఫై - మరైతే జాన్ జానీ గార్ల దాంపత్యపలం 'బాన్'గాడు, ఏరికోరి చేసుకొన్న మేడమ్ వయసు యాభైపైనే - ఉంటే దాదాపు అత్తమామల వరస అయే జాన్ జానీ గార్లతో దాదాపు సమవయస్కురాలు - మరి, మూడు జంటలూ కలుసుకొన్నారు. పాతికేళ్ళ 'బాన్' తన సమవయస్కురాలైన తండ్రి ప్రస్తుత భార్యను 'పిన్నీ' అని ఎలా పిలవగలడు? పోనీ ఆంటీ అని మాత్రం! అలానే తల్లి ప్రస్తుత భర్త వయసు ముప్ఫై మాత్రమే కదా - ఆయన్ని ఏమని పిలవాలి?? అలానే, జాన్‌గారు గాని, జానీ గారు గాని తమ కొడుకు ప్రస్తుత భార్యకు యాభై సుమారు వయసున్నదాన్ని 'కోడలుపిల్లా' అని ఎలా పిలవగలరు!! - జానీ గారి ప్రస్తుత భర్త గాని జాన్‌గారి ప్రస్తుత భార్యగాని, అంత చిన్న వయసువాళ్ళు, మిగిలినవారితో, ఎలా వరసలు కల్పాలి... అయితే అమెరికన్ సమాజంలో దీనికి చక్కని పరిష్కారముంది. వాళ్ళు మిస్టర్ ఫలానా, మిసెస్ ఫలానా అని మాత్రమే పిలుచుకొని, వరసలతో సంబంధం లేకుండా ఆ కాసేపూ గడిపేసి, కాసేపు కలిసి కూర్చుని, తిని, తాగి ఎవరి దారిని వాళ్లు వెళ్ళిపోతారు.. అంటే, మిస్టర్ జాన్, మిసెస్ జాన్, మిస్టర్ బాన్, మిసెస్ బాన్, అని సంబోధించుకొంటారు!!

డాడీ, మమ్మీ, పిన్ని, 'ఆంటీ, అంకుల్' అన్న వరసలు విస్మరిస్తారు!!

ఇదంతా చెప్పుకొని పడి పడి నవ్విన, తామే నాన్న చేసుకొన్న "మళ్ళీ పెళ్ళి" వలన సగుబాటు అవుతున్నామన్న భావం అనితను, ఎంతైనా బాధిస్తోంది - కలత పెడ్తోంది-

ఈ వారమంతా, అనిత, తన తండ్రి పట్ల ఆయన పెళ్ళి పట్ల 'నెగటివ్' ఆలోచనలతోనే గడిపింది. ఎన్ని కోణాల్లో ఆలోచించుకొన్నా ఈ వయసులో నాన్న పునర్వివాహం చేసుకోవ డాన్ని స్వాగతించలేకపోతుంది. అయిందేదో అయింది అని కూడా 'రాజీ' పడలేకపోయింది. అందుకే నాన్న 'యాత్రల'నుండి తిరిగి వచ్చేసి ఉంటాడని తెలిసినా, ఈ ఆదివారం ఫోను కలపడానికి

సిద్ధపడలేకపోతున్నది

అయితే ఇంతలో ఫోను మోగింది – మోగుతూనే ఉంది. అనిత సిక్త్‌సెన్సు అది నాన్ననుంచేనని చెప్తోంది. కూతురు చేయలేదని, బయటికి వచ్చి ఐ.యస్.డీ కాల్ చేసాడని అనిపించింది

వణుకుతున్న చేతులతో వద్దనుకొంటూనే ఫోన్ ఎత్తింది–

"అమ్మాయ్! ఇంట్లోనే ఉన్నారా ఈ వీకెండ్! మరి ఏంట్రా నాకు ఫోను చేయలేదు... చెప్పరా తల్లీ... అంతా బాగున్నారా?" నాన్న గొంతులోని ఆదుర్దా మనసుని తాకింది! అయినా, 'ఆ'... అని పొడిగానే జవాబు చెప్పింది... "అబ్బాయ్ ఇంట్లోనే ఉన్నాడా?' అన్న ప్రశ్నకీ 'ఊ'.. అనే పొడి జవాబిచ్చింది.

"ఏవన్నా ప్రాబ్లెమ్ ఉంటే చెప్పమ్మా..."

"నాకు ప్రాబ్లెమ్ ఉంటే నీకేం బాధ ఇప్పుడు" – అనకుండా ఉండలేకపోయింది. ఉక్రోషం ఎంతసేపు ఆపుకోగలదు? – " నా సంసారం వేరు – నీకు వేరే సంసారం వచ్చింది కదా' అని లోపలే కసిగా అనుకొంది. పైకనలేదు

"ఏయ్ – ఏమిటి సంగతి?... సరిగ్గా చెప్పి ఏడు..." ఈసారి గదమాయించేసరికి ఆయన కూతురే కదా అనితకూ తిక్క రేగింది–

"హనీమూన్ బాగా జరిగిందా?..." కసిగా అడిగేసింది అవతల కాసేపు నిశ్శబ్దం! దాంతో ఇంకా రెచ్చిపోయింది.

"ముందు తెలిస్తే అడ్డు పడతాననుకొన్నావా? నీ మళ్ళీ పెళ్లి జరగనివ్వననుకొన్నావా? పరాయిదాన్నయిపోయానా??" వారం రోజుల్నుంచీ పేరుకుపోయిన కోపం, ఉక్రోషం ఒక్కసారిగా బయటికొచ్చేసాయి!!

– అట్నుంచి ఇంకా ఉలుకూ పలుకూ లేదు–

"ఏం మాట్లాడవేం..." ఈసారి గదమాయించింది–

"పెళ్ళి... ఎవరి పెళ్ళి గురించి మాట్లాడుతున్నావు?"

"ఇంకెవరి పెళ్ళి? – నీ పెళ్ళే... నీ మళ్ళీ పెళ్ళి గురించే మాట్లాడుతున్నాను... నీ పెళ్ళి ఫొటో పేపరులో చూసేను...అంత చిన్న వయసమ్మాయిని పెళ్ళాడటానికి మనసెలా ఒప్పింది..." ఇంతవరకూ వచ్చేక దులిపేయాల్సిందే అనుకొంది – రోషం ఆపుకోలేక పోయింది.

"నా మెళ్లో దండ వేస్తున్న గాయత్రి ఫొటో చూసినట్లున్నావ్? సంశయంగానే అడిగేడు కూతుర్ని నాయుడుగారు.

"ఔను!" నిశ్చయంగా జవాబిచ్చింది 'ఆవిడ పేరు గాయత్రా' అనుకొంటూ.. ఇంకా దాగుడుమూతలెందుకో మాత్రం అర్థం కాలేదు.

"చూడు తల్లీ – గాయత్రి నా ఓల్డ్ స్టూడెంట్.. నేనంటే ఎంతో భక్తి... "ఈ మధ్యన గాయత్రి కవిత్వం రాస్తోంది – ఒక సంకలనం ప్రచురించింది. నాకు అంకితమిచ్చింది. గ్రాండ్‌గా సభ జరిపించింది. ఆ సభలో తండ్రిలాంటి నా మెళ్ళో దండ వేసింది... ఆ ఫొటో చూసి పెళ్ళి ఫొటో అని, నిర్ధారణ కొచ్చేయటమేనా? నాన్న ఈ వయసులో మళ్ళీ పెళ్ళి చేసుకొన్నాడు అనుకోవటం... అబ్బెబ్బే... " శాంతంగానే అన్నా ఆయన గొంతులో అవధుల్లేని ఆవేదన, సుళ్ళు తిరిగింది.

అనిత గుండెల్లో గునపాలు దిగినట్లయింది..." అయితే అది పెళ్ళి ఫొటో కాదా... మరైతే... ఆ ఫొటో క్రింద... భర్త సింగారం నాయుడుగారు అని ఉందేమిటి..." ఎలాగో నోరు పెగల్చుకొని అడగ్గలిగింది.

"నా బొంద!! నేనెంత మొత్తుకొన్నా ఇంగ్లీషు మీడియంలో మునిగిపోయి నువ్వు తెలుగు సరిగా నేర్చుకోలేదు.. ఖర్మ! ఆ ఫొటో కింద ఏం వ్రాసి ఉందో సరిగ్గా చూసినట్లు లేదు..." కృతిభర్త సింగారం నాయుడని" ఉంది.

...కృతి భర్త అంటే కావ్యాన్ని అంకితం తీసుకొన్నవాడని అర్థం... మెళ్ళో తాళి కట్టిన మొగుడని కాదురా మొద్దూ... " ఈసారి గారంగానే చెప్పేడు

'కృతిభర్తా... అక్షరాలు అలుక్కుపోయి తను సరిగ్గా చూడలేదు

అయినా 'కృతిభర్త' అంటే అర్థం తనకి నిజంగానే తెలియదు. ఇప్పటివరకూ...

ఇంకా కొంచెం అనుమానం...

"మరి ఫోను మెసేజ్‌లో, 'పిన్ని'తో యాత్రలకెళ్తున్నాని ఎందుకు చెప్పేవు"? ఎలాగో మాటలు కూడబలుక్కొని, అడిగింది అనిత నాన్నని...

బాగుంది సంబరం... చాలా బాగుందిరా... మెసేజ్ సరిగ్గా వినకుండా, నాన్న కొత్త పెళ్ళాంతో హనీమూన్‌కే చెక్కేసాడని అనుకొన్నావన్నమాట!! అసలు మెసేజ్‌లో ఏం ఉంది మళ్ళీ విను.. నేనేం చెప్పేను?... నేనూ పిన్నీ యాత్రలకు వెళ్తున్నామని చెప్పేను... పిన్నీ ఇంటి పేరురా బాబూ... మర్చిపోయావా...? వెంకట్రాముడు మావయ్య ఇంటిపేరు పిన్నివారు. నేను వాణ్ణి చిన్నప్పట్నించి ఇంటిపేరుతో 'పిన్నీ' అని పిలుస్తానని నీకూ తెలుసుకదా... ఎలా మర్చిపోయావు?? వాడితో అప్పటికప్పుడు అనుకొని "రామేశ్వరం" వగైరా యాత్రలకి వెళ్ళి నిన్న సాయంత్రానికే తిరిగి వచ్చేను... పిన్నితో సహా.. నా కొత్త పెళ్ళాంతో కాదురా బాబూ.. ఈసారి నవ్వాపుకోలేకపోయారు నాయుడుగారు..

"ఇప్పటికైనా అనుమానాలన్నీ పోయాయా? నాన్న మళ్ళీ పెళ్ళి చేసుకోలేదని అర్థమయిందా.. లేదా" అనుమానంగానే అడిగేడు

"మైగాడ్... దేవుడిలాంటి నాన్న గురించి నేనెంత తప్పుగా ఆలోచించాను?... నాన్న దేవుడు... నేను ఎంత చెడ్డదాన్ని... ఇప్పుడు నాన్నతో ఏం చెప్పాలి...

"నాన్నా... నాన్నా.... నాన్నా...." ఇంకేమీ మాటలు రాక భోరున ఏడ్చేసింది అనిత... ఇదంతా పేరలల్ లైనులో వింటున్న అనంత్‌కి కూడా ఏడుపొచ్చింది!!

# నాన్నది ఆదర్శ వివాహం!

నాయుడు గారు పోయిన తర్వాత పదకొండో రోజు కార్యక్రమాలు కూడా పూర్తయి పోయాయి తతంగాలన్నీ ముగిసాయి.

'నాన్నపోయి, అప్పుడే పదకొండు రోజులయిపోయిందా' – అని కాకుండా 'నేను' సింగపూర్‌నుంచి వచ్చి, అప్పుడే పదకొండు రోజులైపోయిందా; అని గుండు తడుము కొంటూ, అనుకొన్నాడు ఏకైక కుమారత్నం ప్రశాంత్. సింగపూర్‌లో ఉండగా ఫోన్ ద్వారా నాన్న పోయిన కబురు విన్నప్పుడు కలిగిన కొద్దిపాటి బాధ కూడా అతని మనసులో లేదిప్పుడు, ఆ మాటకొస్తే, రెండు నెలల క్రితం వరకు ఆయనంటే, మనసంతా నిండుగా ఉండిన, గౌరవాభిమానాలేవీ మచ్చుకైనా ఇప్పుడు లేవు. అసలు ఊరికి వచ్చి ఈ అంత్యక్రియలలోను, అంతిమ సంస్కారాలలోను, పాల్గొనకూడదని, – నేను రాలేను, ఖర్చెంతైనా పర్వాలేదు మీరే కానిచ్చేసేయండి, డబ్బు పంపుతాను', అని బంధువర్గానికి చెప్దామని కూడా అనుకోకపోలేదు. కాని లోకానికి జడిసో, నాన్న మీద ఉన్న ప్రేమ పూర్తిగా చావనందునో, భార్య నచ్చజెప్పినందువల్లో గాని, విమానంలో భార్యాబిడ్డలతో గాక, ఒక్కడే ఊరికి వచ్చేసి, చితి ముట్టించటం దగ్గర్నుంచి, అంత్యక్రియలలన్నీ పెద్దలు చెప్పిన విధంగా శాస్త్రోక్తంగా పూర్తి చేసేడు. అయితే, మనస్ఫూర్తిగా చేసేడని చెప్పలేం – అంతా మొక్కుబడి వ్యవహారంగా, కానిచ్చేసేడు.

శాంతి, అతని అక్క, మానసిక స్థితి కూడా ఇందుకు భిన్నంగా లేదు. తను నాయుడుగారి ఏకైక కుమార్తె – తమ్ముడిలా తనకి కూడా రెండు నెలలనుంచి నాన్నంటే అంతకుముందు ఉన్న గౌరవం, అభిమానం, ప్రేమల స్థానంలో, కోపం, నిరసన, అసహ్యం, మనసులో నింపుకొంది. 'కబురు' తెలిసిన తర్వాత భర్త అత్త ఇతరులు బలవంతం చేసినందువల్లనే పుట్టింటికి వచ్చి, ఈచావు కార్యక్రమాల్లో

చచ్చినట్లు పాల్గొంది. తతంగాలన్నీ అయిపోయేంత వరకు అయిష్టంగానే, పుట్టింట్లో ఉండిపోయింది – అమ్మయ్య – ఈ రోజుతో అన్నీ అయిపోయాయి' అని అనుకొని వెంటనే 'ఇక ఈ ఇంటితో నా సంబంధబాంధవ్యాలన్నీ తెగిపోయాయి – ఇంకేం మిగిలింది' అని నిట్టూర్చింది –

'అయినా, నాన్న పోయేముందు, ఇంత 'లేకిపని' ఎందుకు చేసినట్టు – తమ్ముడు ప్రశాంత్ – చుట్టాలందరికీ దూరంగా, ఎక్కడో సింగపూర్లో ఉన్నాడు – కానీ తనైతే పక్కజిల్లాలోనే ఎంతో సంప్రదాయమైన కుటుంబంలో, మెట్టింటిలో కూడా అందరూ మెచ్చిన కోడలిగా ఉంది. రెండు జిల్లాల నిండా బంధువర్గం ఎంతోమంది ఉన్నారు. నాన్న చేసిన పనివల్ల ఎంత తలవంపు కలిగింది తనకి – ఇన్నాళ్లూ ఎంతో గౌరవప్రదంగా బతికిన నాన్న, ఈ అరవై ఏళ్ళ వయసులో ఇంత చండాలపు పని ఎందుకు చేసినట్టు – ఎవరకీ చెప్పాపెట్టకుండా, రెండునెలలక్రితం ఓ బాలాకుమారిని రిజిస్ట్రార్ ఆఫీసులో పెళ్లి చేసేసుకున్నాడు – పోనీ తనైనాసుఖపడ్డాడా – ఇలా పెళ్ళికొడుకైన రెండు నెలలలోపే, వల్లకాటికి పోయేడు – కొత్త పెళ్ళి కూతురుని విధవ చేసేసాడు – మేడమీది గదిలో ఒక్కతే కూర్చుని ఆలోచనల సుడిగుండాల్లో ఉన్న శాంతి అడుగుల అలికిడి విని తలపైకెత్తి చూసింది–

వచ్చింది, తమ్ముడు ప్రశాంత్. పదకొండు రోజుల తతంగాల్తో నలిగిపోయి, కళ్ళు లోతుకుపోయి, గుండుతో ఉన్న అతని రూపాన్ని చూసి జాలిపడింది – తన పెళ్ళయేవరకు, కలిసి మెలిసి పెరిగిన, తామిద్దరూ కూడా ఈ పదకొండు రోజుల్లోను, లోలోపలే కుమిలి పోయేరే గాని, మనసు విప్పి క్షణమైనా మాట్లాడుకోలేదని గుర్తుకువచ్చి, చాలా బాధ కలి గింది. తామిద్దరి బంధానికి సూత్రమైన అమ్మ ఎప్పుడో చిన్నప్పుడే పోయింది కదా అని మనసులో మెదిలి, కదిలి, ఒక్కసారిగా ఏడ్పు వచ్చేసింది. కాసేపటికి అతి కష్టంమీద ఏడ్పు ఆపుకొంటూ డగ్గుత్తికతో అంది "అమ్మ ఫొటో ఒకటి పట్టుకెళ్తానురా"

"నేనూ ఒకటి పట్టుకెళ్తాను. నాన్నతో కాకుండా ఒక్కతే ఉన్నది చూసి... అన్నాడు నాన్నంటే ఉన్న జుగుప్సను దాచుకోలేక ఎన్నో కష్టనష్టాలకోర్చి, తల్లి లేని లోటులేకుండా తామిద్దరిని పెంచి పెద్దచేసిన నాన్న త్యాగాలు గుర్తుకు రాలేదప్పుడిద్దరికీ.

నాన్నంటే ఇంత నిరసనభావం కలగడానికి కారణమొక్కటే – ఆయన ఎవరికీ చెప్పా చేయకుండా రెండునెలలక్రితం, అరవై ఏళ్ళ తన వయసుని విస్మరించి ఇరవై మూడేళ్ళ బాలాకుమారిని పెళ్లి చేసుకోవటం–

ఇద్దరు పిల్లల కన్న తర్వాత నాయుడు గారి భార్య అకాల మరణం పొందింది. పిల్లలు చిన్నవాళ్ళు – వాళ్ళ ఆలనాపాలనా చూసుకోవ డానికైనా ద్వితీయ వివాహం చేసుకొమ్మని ఎవరెంత పోరినా వినలేదు. పిల్లల ఆలనా పాలనా తనే సమర్థవంతంగా చూశాడు. గవర్నమెంటు కాలేజీలో లెక్చరర్‌గా తర్వాత ప్రిన్సిపాలుగా పనిచేసేటప్పుడు నాటకరంగంలో చురుకుగా పనిచేస్తున్న సందర్భంలో ఎందరో కళాకారిణులతో పరిచయమయినా, ఎప్పుడూ దారి తప్పలేదు ఎవరి వలలో పడలేదు. పవిత్రంగా ఉండిపోయేడు. అలాంటి 'రుషి'లాంటి ఆయన రిటైరైన తర్వాత అరవై ఏళ్ళ వయసులో ఇరవై మూడేళ్ళ యువతిని పెళ్ళి చేసుకొని ఇంటికి కూడా తీసుకొచ్చి బహిరంగంగా 'కాపురం' పెట్టటం బంధువర్గాన్నంతటినీ, ఎంతో ఆశ్చర్యపరిస్తే, ఆ నోటా ఈ నోటా విషయం విన్న కొడుక్కీ కూతురుకీ వళ్ళు మండింది. పెళ్ళికి ముందుగాని, తర్వాత గాని, తమకు ఒక్కమాటైనా చెప్పటానికి ప్రయత్నించకపోవటం, కోపాగ్నికి ఆజ్యం పోసినట్టైంది. అంత చిన్న వయసమ్మాయిని, కులంగోత్రం కూడా తెలియని దాన్ని నాన్న పెళ్ళి చేసుకోవటం వాళ్లిద్దరికీ ఏమాత్రం నచ్చలేదు. బంధువుల యొక్క కొన్ని వ్యంగ్య నిష్ఠూరాలు నాన్నపట్ల వాళ్ళ కోపాన్ని, జుగుప్సని ఇంకా పెంచాయి – పెళ్లయిన వెంటనే, నాన్న కొత్త పెళ్ళాన్ని తీసుకొని, "హనీమూన్"కి చెక్కేసి ఈ రెండు నెలలుగా కబురూ కాకరకాయ లేకుండా ఉండటం నాన్నంటే నిరసనభావాన్ని ఇంకా పెంచాయి – బంధువులంతా నానారకాలుగా చెవులు కొరుక్కున్నారు.

– నాయుడుగారు పెళ్ళి చేసుకొని ఇంటికి తీసుకొచ్చిన నూతన వధువు చంకలో రెండేళ్ళ బాలుడు ఉన్న 'వార్త' చిలవలు పలువలు తొడుక్కొంది. ఆ కుర్రాడి ముఖంలో నాయుడుగారి పోలికలు బాగా కనపడతున్నాయని, అంటే ఆయనకి ఆ పిల్లతో అక్రమ సంబంధం చాలాకాలంగానే ఉండి ఉంటుందని, ఇన్నాళ్ళూ ఎక్కడో రహస్యంగా కాపురం చేస్తూ ఉండి, ఏం బుద్ధి తిరిగిందో, ఏం జరిగిందో, తెలియదు గాని, ఇప్పుడు అఫీషియల్‌గా రిజిస్ట్రారు ఆఫీసులో సంతకం

పెట్టేసి, 'రెడీమేడ్' కుటుంబాన్ని ఇంటికి తెచ్చేశాడని, ఇక ఆస్తిపాస్తులన్నీ వాళ్లిద్దరికే కట్టబెట్టేస్తాడని' చాలామంది అనుకొంటున్నది, శాంతి, ప్రశాంత్‌లకు కూడా చేరింది – ఇది కూడా వాళ్ళ తిరస్కారభావానికి మరో ప్రధాన కారణం – ఆయనైతే ఎవరితోనూ ఏమీ చెప్పుకోలేదు. పెళ్ళయిన తర్వాత రెండునెలలు ఎక్కడోగడిపి, వారం రోజుల క్రితమే ఇల్లు చేరుకొన్నాడు. వారం తిరక్కుండానే ఒక అర్ధరాత్రి సునాయాసమరణం పొందేడు. దగ్గరవాళ్ళు కొడుక్కి, కూతురికి అర్జంటుగా మరణవార్త తెలియజేసేరు. వాళ్ళు అయిష్టంగానే వచ్చి, అన్యమనస్కంగానే , అంతిమక్రియల్లో పాల్గొన్నారు. కేవలం లోకభీతితో.

శాంతి ఆలోచనల్లో మునిగి ఉన్న తమ్ముడు ప్రశాంత్‌ని కుదుపుతూ అడిగింది – 'అవునూ, అన్నట్టు ఈ కార్యానికయిన ఖర్చంతా జగన్నాథం మావయ్యే పెట్టుకొన్నట్టున్నాడు. ఎంతయిందో అడగరా – నువ్వోసగం, నేనో సగం పెట్టుకొందాం – ఏమంటావ్..."

"అదేమిటక్కా ఆడబడుచువి నీకెందుకు ఖర్చు – అంతా నేనే పెట్టుకొంటానులే! అన్న తమ్ముడి మాటలతో మనసు కుదుటపడిందామెకు.

అంతలోనే, మనసు మూలల్లో కదులాడుతూ గుచ్చుకొంటున్న భావాలు బయటి కొచ్చేసేయి" "అదికాదురా తమ్ముడూ, అయితే, ఉన్న ఆస్తినంతా నాన్న ఆవిడికే దారాదత్తం చేసేసి ఉంటాడంటావా – ఈ మేడ, పదెకరాల మామిడితోట, మరో పదెకరాల కొబ్బరితోట – ఇంకా బంగారం, బ్యాంకు డిపాజిట్లు వగైరా వగైరా – మనకేం లేకపోయినా నోర్మూసుకొని ఊరుకోవాల్సిందేనా..." బేలగా అడిగింది.

అంతే అయ్యుండొచ్చు. విల్లు కూడా వ్రాసేసే ఉంటాడు. మనకేం లేకపోయినా, ఏం చేయగలం. అంతా ఆయన స్వార్జితమే కదా" అని ఇంకా బేలగా అన్నాడు ప్రశాంత్. అంతలో మెట్లమీద అడుగుల సవ్వడి విని అటు చూశారు. వచ్చింది – జగన్నాథం మావయ్య – నాన్నకి బంధువుగా కంటే బాల్యమిత్రుడిగా ఎక్కువ ఆప్తుడు.

వచ్చిన వెంటనే అనేశాడు – "ఇక్కడున్నారా – మీకోసమే వెదుకుతున్నా – అవునూ, అది సరేగాని, మీ ఇద్దరూ ఒక్కసారైనా మీ పిన్నితో మాట్లాడినట్లు

లేదు. క్రింద ఔటు హౌస్‌లో ఒక్కతే చిన్నపిల్లాడితో, దుఃఖసాగరంలో ఉన్నట్లు ఉండిపోయింది. కొద్దిగా సానుభూతి మాటలు చెప్తే బాగుండేదికదా...”

“ఆవిడితో ఏం మాట్లాడాలి. ముఖం కూడా చూడాలనిపించట్లేదు, ఇంట్లోనే ఉన్నా ఆ... ” ఇంకా ఏదో కోపంగా అనబోతున్న తమ్ముణ్ణి వారిస్తూ శాంతి చెప్పింది.

“అదేంటి మావయ్యా – అలా అంటావు – తను ఎప్పుడూ ఔట్‌హౌస్‌నుంచి బయటకి వచ్చి మాతో మాట్లాడటానికి ప్రయత్నించలేదు – తమ్ముడు అసలు చూడనేలేదు – నేను కనపడినా మాట్లాడలేదు – అసలు సానుభూతి చూపాల్సింది మాకు – ఇంత పెద్ద ఆస్తి అంతా, తనే రాయించేసుకొని మాకేం మిగల్చకుండా...

“ఆగండ్రా – అసలు విషయం చెప్పటానికే కదా నేను వచ్చింది – గతవారమే విల్లు రిజిష్టరు చేయించి నాతో సాక్షి సంతకంపెట్టించేడు మీ నాన్న – ఇదిగో నా చేతిలోనే ఉంది – దీనిప్రకారం, మేడ మొత్తం ప్రశాంత్‌కి చెందుతుంది. పదెకరాల మామిడితోట శాంతికి, పదెకరాల కొబ్బరితోట ప్రశాంత్‌కి, ఉన్న బంగారం, నగదు, బ్యాంకు డిపాజిట్లు చెరి సగం – ఇదిగో విల్లు తీసుకోండి – ఆయన వ్రాసిన ప్రకారం పంచుకోండి – చచ్చి పోయిన ఆయన ఆత్మకు క్షోభ కల్పించకండి ఏదేదో ఊహించుకొంటూ కొంచెం ఆవేశంగానే చెప్పేడు.

కొంచెం సేపు నిశ్శబ్దం రాజ్యం ఏలింది – అక్కాతమ్ముళ్ళిద్దరికీ ఆశ్చర్యంతో, అంతకు మించి ఆనందంతో, నోరు పెగలలేదు.

మళ్ళీ జగన్నాథమే, నోరు విప్పేడు – ఈసారి కొంచెం అనునయంగా – “అది కాదర్రా – మీ నాన్న ఎంతో గొప్పవాడు. మీ ఇద్దరంటే ప్రాణం – కాని మీకే ఈ మధ్యన... అది సరేలే – తనకు చావు దగ్గర్లో ఉందని ముందే తెలుసు – అందుకే ఈ విల్లు వ్రాసేడు – తన చావు ఖర్చులకని ఓ యాభైవేలు నా చేతికిచ్చేడు – అదే ఖర్చు పెట్టేను...

“మావయ్యా – ఆ అమ్మాయి, అదే “రెండోభార్య” ఆస్తికోసమే ఈ ముసలాయన్ని చేసుకొనుంటుంది – ఇప్పుడిలా జరగాలని అంటే నోర్మూసుకొని

ఊరుకొంటుందా–" లౌక్యంగానే అడిగింది – అయినా మా నాన్న ముసలి వయసులో పెళ్ళి చేసుకోవాల్సిన అగత్యం ఎందుకొచ్చింది..." అని నసిగింది శాంతి. ప్రశాంత్ కూడా వెంటనే అందు కొన్నాడు... "నాన్న మరణం ఆకస్మికం అనుకొన్నాం – ముందే తన చావు గురించి తెలుసునని నువ్వంటున్నావు – ఏమిటీ మిస్టరీ – ఏం జబ్బు చేసింది? – మాకెందుకు తెలియనీయలేదు..."

"ఆగండిరా, అన్నీ వివరంగా చెప్తేగాని నాబాధ్యత తీరదు. నాక్కూడా చెప్పకుండా మీ నాన్న అంత చిన్న వయసమ్మాయిని పెళ్ళి చేసుకోవటం నాకూ నచ్చలేదు. కడిగేద్దామని అనుకొంటుండగానే పత్తా లేకుండా పోతే అందరిలానే నేను కూడా 'హనీమూన్'కి చెక్కేసారని అనుకొన్నాను. రెండు నెలల తర్వాత వచ్చిన వెంటనే నాకు కబురు చేసి, ఎంతో నిబ్బరంగా చెప్పేడు. తనకి బ్లడ్ కేన్సరని, ఈ మధ్యనే తెలిసిందని – పెళ్ళికి ముందరే సుమా – అది తెలిసీ ఆ అమ్మాయి చేసుకొందని – ఇన్నాళ్ళూ వైద్యం చేసిన డాక్టరు జబ్బు చాలా ముదిరి పోయిందని, హైద్రాబాద్ కేన్సర్ హాస్పిటల్లో చికిత్స అవసరమని చెప్పాడని, తను వద్దంటున్నా భార్య అదే మీ పిన్ని, బలవంతం చేసి, తన కుర్రాడిని ఎవరో బంధువుల ఇంట్లో పెట్టి, తనని హైద్రాబాద్ తీసుకొని వెళ్ళి వైద్యం చేయించిందని, అక్కడా ఇన్నాళ్ళూ వైద్యం చేసి, ఇక లాభంలేదు, ఇంటికెళ్ళిపొమ్మని చెప్తే ఊరికి తిరిగి వచ్చేశామని, పిల్లవాడిని బంధువుల ఇంటినుంచి తెచ్చేశామని, ఇక ఎంతోకాలం బతకనని నిబ్బరంగా చెప్పాడు. ఇన్నాళ్ళూ తనకి పతివ్రతయైన, భార్యలా సేవ చేసిన 'ఆమె' రుణం తీర్చుకోలేనిదనీ చెప్పాడు. విల్లూ గట్రా ఇలా రాయించేడు. కొన్ని నెలలైనా బతుకుతాడనుకొన్నాను. కాని వారంలోనే..." చెప్తూ ఏడ్చేశాడు.

ఇప్పుడు శాంతి, ప్రశాంత్‌లిద్దరికీ ఏడుపు వచ్చింది.

'నాన్ననెంత అపార్థం చేసుకొన్నాం – తనకి వచ్చిన జబ్బు సంగతి పిల్లలకి కూడా తెలియకుండా రహస్యంగా ఉంచేడు వాళ్ళ మనసులు బాధపెట్టకూడదని – ఆస్తంతా మనకే రాసిచ్చేడు – అయినా ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకోకుండా ఉండాల్సింది – రాబోయే చావు గురించి తెలిసీ, ఆ అమ్మాయి గొంతు కోశాడు...'

వాళ్లిద్దరి ఆలోచనలు చదివినట్లు జగన్నాథం ఇంకా చెప్పేడు.

“నేనూ ముందు ఆ అమ్మాయి గొంతు కోశాడనవసరంగా అనుకొన్నా. కాని మీ నాన్న చెప్పిన సంగతుల తెలిసిన తర్వాతనే, వారం క్రితమే, తను చేసుకొన్నది ఒక ఆదర్శ వివాహమని తెలిసింది. అదెలా అంటారా – తను ఒక సంప్రదాయమైన కుటుంబానికి చెందిందే – తండ్రి ఇంజనీరింగు కాలేజీలో లెక్చరర్‌గా పనిచేసి అకస్మాత్తుగా చనిపోయాడు. ఇంకే ఆధారం లేక తల్లి ఇంజనీరింగు హాస్టల్‌లోనే ఆయాగా ఉద్యోగం సంపాదించి, కూతుర్ని బి.ఏ చదివించుకొనేది. తల్లీకూతురు హాస్టల్లోని క్వార్టర్సులో ఉండేవారు. హాస్టల్‌లో ఉన్న ఇంజనీరింగు ఫైనల్ ఇయర్ విద్యార్థి కూతుర్ని పెళ్ళి చేసుకొంటానని మభ్యపెట్టి కడుపు వచ్చేసరికి పత్తా లేకుండా పోయేడు – వాడికి పెళ్ళి కూడా తర్వాతైపోయిందని, ఫారిన్ చెక్కేసాడనీ తెలిసిందట – దాంతో చెడిపోయిన కూతుర్ని, దాని బిడ్డని చూస్తూ ఉండలేక మనోవేదనతో ఆ అమ్మాయి తల్లి చచ్చిపోయి, వీళ్లిద్దర్నీ అనాథల్ని చేసిందట – ఇదంతాఎలా తెలిసిందో మీ నాన్నకి తెలియదు గాని ఆ అమ్మాయికి ఒక ఇల్లాలు హోదా కల్పించడానికి, బిడ్డకు ఆమెకి తన ఇంటిపేరు ఇవ్వడానికి మాత్రమే తనని పెళ్ళిచేసుకొన్నాడు – కేవలం నామకః అనే చెప్పాలి – భార్యగా సర్టిఫికెట్ ఇచ్చి తను, భర్త మరణానంతరం పెన్షన్ పొందే ఏర్పాటు మాత్రం చేశాడు – ఆస్తంతా మీ పరంచేశాడు. తనకి పెన్షన్ మాత్రమే వస్తుంది – ఆ విధంగా పెన్సన్ ఆఫీసులో పెళ్ళి రిజిస్ట్రేషన్ సర్టిఫికెట్ సమర్పించాడు. అది చాలు మీ పిన్ని పిల్లాడి జీవనాధారానికి – ఇంకో సంగతి చెప్పాలి – కేవలం పెన్షన్ పొందే అర్హత కల్పించడానికే ఆమెని మీ నాన్న పెళ్ళి చేసుకొన్నాడు. సర్టిఫికెట్‌లో మాత్రమే పెళ్ళాం – ఆస్తంతా మీ పేర్న తన బలనంతం ప్రకారమే వ్రాశాడు – సొంత కూతురిలానే ఈ రెండు నెలలూ చూశాడు గాని – పెళ్ళాంలా కాదు– అలాంటి గాయత్రికి, ఆఖరి సమయంలో మీ నాన్నకు సేవలు చేసిన దానికి...” ఇంకా ఏదో చెప్పబోయి, ఆయాసం వచ్చి ఆగేడు జగన్నాథం

“ఆ, తన పేరు గాయత్రా...’ అని నివ్వెరబోతూ తన ముఖంలో మారిన రంగులు కన్పించకుండా పక్కకు తిరిగి కిందికి చూసిన ప్రశాంత్‌కి దొడ్లో తులసిమొక్క దగ్గర కూర్చున్న గాయ త్రి కన్పించింది – కళ్ళు చికిలించి మళ్ళీ

చూశాడు -

- సందేహం లేదు నాన్న పెళ్ళి చేసుకొన్న ఈ గాయత్రి - ఆ గాయత్రే - తను ఇంజనీరింగు కళాశాలలో ఉన్నప్పుడు, పరిచయం చేసుకొని ప్రేమ నటించి, వంచించి గర్భవతి చేసిన తర్వాత, వేరెవరినో పెళ్ళి చేసుకొని సింగపూర్ చెక్కేసి పూర్తిగా మర్చిపోయిన గాయత్రే - అంటే నాన్న ఇదంతా ఎలానో తెలుసుకొని, తనకి పెళ్ళయిపోయింది కాబట్టి, కోడలు కావల్సిన దాన్ని నామకః పెళ్ళి చేసుకొని, మనవడికి న్యాయంగా రావాల్సిన ఇంటిపేరు ఇచ్చాడన్నమాట - ఎంత ఆదర్శం నాన్నది. నాదెంత నీచత్వం - అనుకొంటూ పైకేమీ చెప్పలేక చేతుల్లో ముఖం కప్పుకొని వలవలా ఏడుస్తున్న ప్రశాంత్‌ని చూస్తున్న శాంతికి, జగన్నాథానికి ఏమీ అర్థం కాలేదు - "నాన్నది ఆదర్శ వివాహం" అని గొణగడమే తప్ప ఇంకేమీ చెప్పలేకపోయేడు అతను కూడా.

# అప్పులనర్సయ్య - ఆత్మశాంతి

అప్పులనర్సయ్య నా 'బామ్మర్ది' - అప్పుడప్పుడు అంటే ఎవరూ పనిగట్టుకొని గమనించటం లేదనుకొన్నప్పుడు, మరీ జనసమ్మర్థంగాను, వేగంగా పోతున్న వాహనాలతో, కిక్కిరిసి ఉన్న రోడ్డును దాటవలసి వచ్చినప్పుడు, నా వేలు పట్టుకొని నడిచే భార్యామణి కాంతానికి, వేలు విడిచిన బాబాయిగారి పుత్రరత్నమే అతను పెళ్ళానికి తమ్ముడు వరసైతే, నాకు బామ్మర్దే కదా. కాంతానికి స్వయానా అన్నదమ్ములు లేరు. అందుకే సదరు అప్పులనర్సయ్యనే నా బావమరిదిగా చూసుకొని సంతృప్తి పడుతుంటాను.

అప్పులనర్సయ్య, బి.కాం. ఫస్ట్ క్లాసులో పాసయి కొన్ని కంప్యూటరు కోర్సులు" పూర్తి చేశాననిపించుకొని, బ్యాంకులో ఉద్యోగం పట్టేశాడు. స్వంత ఊరికి దగ్గర్లోని బ్రాంచిలో వేస్తామన్నా అంగీకరించక, హైద్రాబాద్‌లో ఒక కాలనీ బ్రాంచిలో వేయించుకొన్నాడు. నాలుగైదు సంవత్సరాలుగా అక్కడే పనిచేస్తున్నాడు - మాదీ హైద్రాబాద్ కాపురమే - తన ఆఫీసుకి దూరమైనా, మేముండే ప్రాంతానికి దగ్గర్లోనే, ఒక రూము అద్దెకు తీసుకొని ఉంటున్నాడు. బ్రహ్మచారి కాబట్టి ఒక్కడే - దూరంగా ఉన్న ఆఫీసుకి వెళ్ళడానికి, స్కూటరు పెట్రోలు ఖర్చులు, ఎక్కువవుతున్నాయని అప్పుడప్పుడు గునుస్తూ ఉంటాడు గాని దగ్గర్లో ఇంకో గది వెదుక్కొనే ప్రయత్నాలు మాత్రం చేయడు. అదనపు ఖర్చులు కొంతమేరకు భర్తీ చేసుకోవడానికన్నట్లు, తరచుగా మా ఇంటికి వచ్చి భోజనం కానిస్తుంటాడు. పుట్టింటి అభిమానం కొంచెం ఎక్కువగా ఉండే మా ఆవిడ కూడా, అతగాడిని బాగానే ఆదరిస్తుంది. "మా అమ్మ కన్న నువ్వు వంటలు' బాగా చేస్తావక్కా" అని పదే పదే పలికే, అతని మాటలకు బాగా మురిసిపోయి, తను పుట్టింట్లో నేర్చుకున్న సాంప్రదాయిక వంటకాలెన్నో రుచికరంగా చేసి అతనికి ఆప్యాయంగా వడ్డిస్తుంది.

వారం మధ్యలో ఎప్పుడైనా వస్తాడు గాని, ఆదివారాలు మాత్రం తప్పనిసరిగా భోజనానికి వస్తాడు. అతని రాకపోకలు నాకూ ఇష్టమే – అందుకు కారణాలు రెండు – మొదటిది వచ్చినప్పుడల్లా నాకిష్టమైన స్వీట్లు తెస్తాడు. రెండోది అతను వచ్చిన రోజు మాత్రమే, మా ఆవిడ పుట్టింట్లో పెళ్ళికి ముందు బుద్ధిగా నేర్చుకొన్న సాంప్రదాయిక వంటకాలు, ఉదాహరణకు గుత్తి వంకాయ, ఆవపెట్టి అరటికాయ, కూరలు గాని, ముద్దపప్పు గుమ్మడికాయ పులుసు కాంబినేషన్‌లు, బెండకాయ వేపుడు, ములక్కాడ పులుసు లాంటివి చేస్తుంది. వాళ్ళిద్దరితో పాటు నాకు కూడా సుష్టుగా భోంచేసే అరుదైన అవకాశం కలుగుతుంది. అందుకే మా బామ్మర్ది 'విజిట్సు' ఎంత తరచుగా జరుగుతున్నా నాకు ఆనందప్రదాయకాలేనని చెప్పుకోవాలి. స్వాగతించదగ్గవే!

అయితే 'బామ్మర్ది' రాని రోజులు నాకు సంకటమే ఎందుకంటే – ఆ రోజుల్లో మాఆవిడ పూర్తి "స్వాతంత్ర్యం" తీసేసుకొని తను ఎడతెగకుండా టీవీలో వచ్చే "ఇంటి వంట", – "వంటింటి పంట" – "ఆహా ఏమి రుచి" – వంటి తెలుగు చానల్సు ప్రోగ్రాములే కాకుండా "ఖానా ఖజానా" వంటి రాజ్యభాష హిందీ ప్రోగ్రాములు కూడా చూసి, జాగ్రత్తగా "బైండు బుక్కులో రాసి పెట్టుకొన్న, మోతాదు వివరాలను బట్టీ పట్టి లలల్లా... అని పాడుకొంటూ చేసే వినూత్న వంటకాలే నా కంచంలో పడేస్తుంది. వాటికి "ఇసాబికా" దాయిడమనికా" "దక్కా మొక్కి" డోలూ డొక్కా" అని ఏవేవో నోరు తిరగని పేర్లు పెడ్తుంది. నోట్లో కుక్కుకోపోతే ఊరుకోదు – డోక్కుంటే చంపేస్తుంది. పోనీ ఏదో కొంత ఉపశమనంగా, అన్నం వారుస్తుందా, సాంబారుగాని చారుగాని కాసి అప్పడాలో వడియాలో వేయిస్తుందా అంటే – అదీ లేదు. టీవీ ప్రోగ్రాములోనే నేర్చుకొన్న రైస్ మిస్, మరియు తుస్ అని పేరు పెట్టిన ఒక వింత ద్రావకాన్ని కంచంలో ధారగా పోస్తుంది. సాంబారుకి బదులు "గప్‌చుప్ సూప్" అని పేరు పెట్టిన చిక్కని ద్రవాన్ని మురిసిపోతూ వడ్డిస్తుంది. పోనీ పెరుగన్నా ఉంటుందా అంటే అదీ ఉండదు. పల్చని మీగడ లేని మజ్జిగలో ఏదో పచ్చికాయగూర ముక్కలు వేసి, గ్లాసులో పోసి ఇస్తుంది. – ఇవన్నీ తినలేక, తాగలేక, నేనెంత నరకమనుభవిస్తున్నానో మాటల్లో వర్ణించలేం. అందుకే 'బామ్మర్ది మా ఇంటికి భోజనానికి వస్తున్నానని ఎప్పుడు ఫోను చేస్తాడా' అని ఎదురు

చూసేది. ఎందుకో సరిగా తెలియదు గాని, అతనువచ్చిన రోజుల్లో మాత్రం మా ఆవిడ సాంప్రదాయ వంటలే చేస్తుంది. ఇది దుస్సమాసమంటారా - ఏం చేస్తానుమరి - ఆవిడి ప్రయోగవంటలు తిని తిని నాకు దుస్సమాసాలే వస్తున్నాయి మరి!!

అక్కడికీ కక్కుర్తి పడి, ఒకటీ రెండుసార్లు మీ తమ్ముడొస్తున్నానని ఫోను చేశాడోయ్ అని అబద్ధమాడి, మామూలు వంటలు తినే సద్భాగ్యానికి నోచుకొన్నాను. పప్పూ సాంబారన్నం, ఆరగించగలిగాను. కాని ఈ పప్పులు ఎన్నాళ్లో ఉడకలేదు. నేనబద్ధమాడినా, నమ్మక అతనికి సెల్‌కి చేసి "కన్‌ఫర్మ్" చేసుకొన్ని తర్వాతనే ఆ రోజు వంటకు ఉపక్రమిస్తోంది - బామ్మర్ది అప్పల నర్సయ్య కూడా అక్క ప్రయోగాల గురించి తెలుసు కాబట్టి అడ్వాన్సు నోటీసీయకుండా భోజనానికి రాడు!

నా బామ్మర్ది అప్పలనర్సయ్య గురించి తప్పనిసరిగా చెప్పాల్సిన 'విషయ'మొక్కటుంది - అతగాడి బుర్రలో ఎప్పుడు పుట్టిందో గాని, "వెండితెర" పై కనపడపాలన్న కోరిక, కొన్నాళ్ళు మొక్కగా ఉండి, అచిరకాలంలో పెద్దమానై కూర్చుంది. మా ఆవిడి మెప్పుకోసం కాదుగాని, నేనూ ఒప్పుకోవాల్సిన నిజమేమంటే అప్పలనర్సయ్య బాగానే ఉంటాడు. మంచి మేని ఛాయ, ఆరడగుల పొడుగు, తగిన లావు, ఉంగరాల జుట్టు - 'అందగాడే' అన్పించేలానే ఉంటాడు - అద్భుతంగా కాకపోయినా - వారసత్వం బలం మూలంగా నటులుగా వచ్చిన కొంతమంది కన్నా మెరుగ్గానే ఉంటాడు. 'ఫొటోజెనిక్ ఫేసే'నని అతను తీయించుకున్న ఎన్నో ఫొటోలు చెప్తాయి.

అతని మాటల్లోనే చెప్పాలంటే, తనకున్న ఒకే ఒక లోపం, ఏ పాత హీరో ఇంట్లోనో, ప్రస్తుత దర్శకనిర్మాతల వంశంలోనో పుట్టకపోవటం - "నటనానుభవం" లేకపోవటం కొద్దిపాటి లోపమేమో"నని నేనొకసారి చిన్నగా నసిగితే, మీదపడిపోయేడు! నటనలో ఏమాత్రం పూర్వానుభవం లేని వాళ్లెందరో, 'హాలీవుడ్‌లో, టాలీవుడ్‌లో, బాలీవుడ్'లో హీరోలుగా వెలిగిపోతున్న దృష్టాంతాలు ఏకరవు పెట్టేడు. నోర్మూయించేసాడు -

ఇంతవరకు తనకు "సినిమా ఛాన్సు" రాకపోవడానికి కారణం; అప్పలనర్సయ్య అన్న తన పాతకాలం పేరేమోనన్న అనుమానం అతనికే, ముందుగా కలిగింది. అంతే; ఎన్నో తంటాలు పడి పేరు మార్పించేసుకొన్నాడు, అధికారికంగా "గెజిట్" ద్వారా "అప్పలనర్సయ్య సన్ ఆఫ్ బుచ్చయ్య" అనే నేను ఇక మీదట, "ఏ యన్ రన్" అని వ్యవరింపబడతాను అని పత్రికల్లో ప్రకటనలు చేసేడు. బ్యాంకులోను, అన్ని ఇతర డాక్యుమెంట్లలోను పేరు మార్పించుకొన్నాడు. అందరినీ, తనని "రన్" అన్న పొట్టి 'కొత్త' పేరుతోనే పిలవాలని బ్రతిమాలుతున్నా ఇప్పటికి చాలామంది 'అప్పలనర్సయ్యా' అనే నోరారా పిలుస్తుండటం చాలా బాధాకరమైన విషయం అన్నట్టు సినిమా వాళ్ళకు రాసే ఉత్తరాల్లో "రన్" అన్నపేరే వాడుతున్నాడు – ప్రత్యుత్తరాలు రావటం లేదని వేరే చెప్పనవసరంలేదుకదా–

నగరంలోని అన్ని స్టూడియోలకి, రామోజీ ఫిలింసిటీకి తరచు వెళ్తున్నా, ఫిల్మునగర్‌లో ఉన్న ఎందరో దర్శక నిర్మాతలను కలుస్తున్నా కాళ్ళా వేళ్ళా పడుతున్నా మనవాడి కలలు పండటం లేదు. ఏ సినిమాలోనూ చిన్నవేషం కూడా దొరకలేదు. వెండితెర మీద కనపడలేదు.

బుల్లితెరమీద, అదే, ఏదో టీవీ సీరియల్‌లోనైనా కనపడదామని ఎన్ని ప్రయత్నాలు చేసినా ఫలితం దక్కలేదు. ఊళ్ళో ఉన్న ఆస్తిని అమ్ముకొనొచ్చి కొంత పెట్టుబడి పెడతానని ఆశజూపినా, ఏ సినిమావాడు గాని, టీవీవాళ్ళు గాని బుట్టలో పడలేదు!

అన్నట్టు, సినిమాలో వేషం దొరికేవరకు పెళ్ళి చేసుకోనని మొక్కుకొన్నాడట. పెళ్ళయిన వాళ్ళకు సినిమా వేషం దొరకదని అతనికి నమ్మకమని ఒక పుకారు వుంది. ఏమైనా తల్లిదండ్రులు, బామ్మ ఎంత పోరుతున్నా, ఆఖరికి నేను, వాళ్ళ కాంతం అక్క ఎంత నచ్చజెప్పి చూసినా వినిపించుకోలేదు. ఏ మూడ్‌లోనో ఉండి ఒకసారి "బావా, సినిమాలో ఒక చిన్న వేషమైనా దొరికి "వెండితెర" మీద కనబడితే చాలు – ఈ జన్మకిదే చాలు భగవంతుడా అనుకొని ఇక సినిమా కలలు కనటం మానేసి పెళ్ళి చేసుకొని పిల్లల్ని కంటాను" – అని కన్నీళ్ళ పర్యంతమై చెప్పేశాడు. అప్పట్నుంచి నేను కూడా "బామ్మర్ది"కి ఏదో చిన్నోచితకో వేషం దొరికితే బాగుండునని అనుకోసాగేను. భగవంతుణ్ణి ప్రార్థించ సాగేను.

అంతకుముందు దేవున్ని ఒకే ఒక కోరిక కోరుకొనేవాణ్ణి – "భగవాన్ – మా ఆవిడ కాంతం నాపై టీవీ వంటకాల ప్రయోగాల్ని చేయకుండా వరం ఇవ్వు" అని మాత్రమే! పైగా చాలా రోజుల్నించి అతను రావటం లేదు.

ఇలా ఉండగా అకస్మాత్తుగా అప్పలనర్సయ్య నుంచి ఫోన్ వచ్చింది – "నేను, బావా – 'రస్'ని – నీ బావ్మర్ది 'రస్' కల ఇన్నాళ్ళకు సాకారమైంది. నాకు భలే సినిమా ఛాన్సు దొరికింది. ఇదంతా నా పూర్వ జన్మ సుకృతం. మీలాంటి వాళ్ళ ఆశీర్వాదఫలం – తెలుగు సినిమా ప్రేక్షకుల ఆదరాభిమానాలు కూడా లభిస్తాయని దీవించండి.. హే భగవాన్ – ఈ జన్మకిది చాలు..." ఇలా ఏంటేంటో దీర్ఘమైన బరువైన డైలాగులు పేల్చేసి, నేనడిగేదేమీ విన్పించుకోకుండా ఠక్కున ఫోన్ పెట్టేశాడు!!

చాలా పెద్ద పాత్ర, బరువైన డైలాగులున్నది దొరికింది కాబోలు మనతో కూడా ఇలా మాట్లాడుతున్నాడు అనుకొన్నాను. విషయం తెలిసిన కాంతం ఉబ్బితబ్బిబ్బైపోయింది. ఆవిణ్ణి ఇంక పట్టుకోలేకపోయాను. తమ్ముడు వరసైన అతగాడు పుంఖాను పుంఖాఖాలుగా హీరో వేషాలు వేసి పడేస్తున్నట్లు, మాత్రమే గాక; అతగాడిని ఓ శ్రీమంతుల పిల్ల వరించి పెళ్లి చేసుకొన్నట్లు తనకి ఆడబడుచు కట్నం బాగా భారీగా ముట్టినట్లు కలలు కనసాగింది.

"శుభవార్త" చెప్పిన మూడు నాలుగు నెలల దాకా, అప్పలనర్సయ్య సారీ – "రస్" కనపబడలేదు. వినపడలేదు. మా ఇంటికి అసలే రాలేదు. సెల్ మార్చేశాడు. రూములో ఉన్న లాండ్‌లైన్‌కి ఫోన్ చేస్తే – "సారీ సినీ నటుడు "రస్" నగరంలోనే లేరు – షూటింగులో బిజీగా ఉన్నారు..." అని ఆన్సరింగు మెషీన్ మెసేజ్ వినపడేది. ఆఫీస్‌కి ఫోన్ చేస్తే చాలాకాలంగా, అంటే సుదీర్ఘ సెలవుపై ఉన్నాడని, ఎక్కడికి వెళ్లాడో, తెలియదని చెప్పేవారు. దీన్నిబట్టి మనవాడు ఇంకా వేరే సినిమాల్లో కూడా వేషాలొచ్చి యమ బిజీగా ఉన్నాడని బహుశ్య ఫారిన్ లొకేషన్లలో షూటింగు జరుగుతున్నదేమోనని సమాధానపడి ఊరుకొన్నాం.

ఉన్నట్టుండి ఒక శుభోదయాన ఫోన్ వచ్చింది

"బావా – నా సినిమా ఈ రోజే రిలీజవుతోంది. మార్నింగుషోతో ప్రారంభం

– మీ దగ్గర్లోనే "ప్రభాత్" థియేటర్లో చూడండి – అక్కని కూడా తీసుకెళ్ళు... అని వేగంగా చెప్పేసి, నేనడిగేదేమీ వినిపించుకోకుండా ఫోన్ పెట్టేశాడు!

'బిజీనటుడు కదా" – అని సమాధానపడ్డాను. సంబరంగా కాంతానికి సమాచారం చేరవేశాను. ఎగిరి గంతేసింది. పడిపోబోతుంటే పట్టుకొన్నాను – ఛీ – ఏమిటి చిలిపి పగలు కూడా పట్టుకుంటారేమిటి.. .అని గోముగా కసిరి వెంటనే అడిగేసింది... 'హీరో వేషమేనా?... డాన్సులు పాటలు ఎన్నున్నాయి.. అసలు సినిమా పేరేంటి?? కాంప్లిమెంటరీ టిక్కెట్లు పంపిస్తానన్నాడా?? – సంధించిన ప్రశ్నలకు నా దగ్గర జవాబులు లేవుకదా – నా మదిలో ఉదయించిన మరెన్నో ప్రశ్నలకూ లేవు

ఆఖరికి తనే అంది "సర్లెండి – సినిమా పేరు ఏమైతే మనకెందుకు – మార్నింగు షోకే వెళ్దాం టిక్కెట్లు కొనుక్కొని వంట చేయడానికి టైము లేదు. షో అయిపోయాక దగ్గర్లోని ఏదో హోటల్‌లో భోజనం కానిద్దాం –"

నా చెవుల్లో అమృతం పోసినట్లైంది. – "భలే 'ఇంటివంట' ముప్పు తప్పింది ఒక్క పూటకైనా" అని లోపలే ఆనందపడిపోయాను. పైకి అనకూడదని తెలుసు కాబట్టి–

వెంటనే తయారై, సినిమాహాలు చేరుకొన్నాం – బుకింగు కౌంటర్లు అప్పటికే మూసివేసిన సంగతి గ్రహించి నిరాశపడిపోయాం – కాంతం ఘటికురాలు కదా – నన్నక్కడే నుంచోబెట్టి, పక్కకి వెళ్ళి రెండు టిక్కెట్లు తెచ్చింది" ముప్పై రూపాయల టిక్కెట్లు ఒక్కోటీ వందరూపాయలు మాత్రమే అని ఉచితంగా వచ్చినంత ఆనందంగా చెవిలో చెప్పింది.

థియేటరు ముందు గుమిగూడిన ఇసుక వేస్తే రాలనంత ఉన్న, జనసందోహాన్ని చూసి ఆశ్చర్యం కలిగింది. సినిమా రిలీజవ్వకముందే "మనవాడికి" అభిమాన సంఘాలు ఏర్పడ్డాయా అని మురిసిపోయాం జనం వేస్తున్న ఈలలు కేకలు, జిందాబాద్‌లు విని – ఇంత పాపులరయిపోయాడా రిలీజుకి ముందే అని ఆశ్చర్యపోయాం.

మొత్తానికి హాల్లో ప్రవేశించాం. టైటిల్సు లో సినిమా పేరు "ఆత్మశాంతి" అని చూసి క్లాసికల్‌గా ఉంది అనుకొన్నాను. సినిమా కూడా బాగుండొచ్చనే అనుకొన్నాను . టైటిల్సు జాగ్రత్తగా కళ్ళు చికిలించి చూశాం నేనూ కాంతం - ఒక దర్శకనిర్మాత తన కొడుకుని హీరోగా పరిచయం చేస్తున్న చిత్రమని అర్థమయింది; ఆయన కొంతసేపు తెరపై కనపడి, "నా కొడుకుని ఆశీర్వదించండి" అని చేతులు జోడించి ప్రార్థించినప్పుడు.

మరి మనవాడు సపోర్టింగు హీరోనా, ఇందాక బయట జిందాబాద్‌లు వినపడింది ఈ కొత్త హీరోకా - మనవాడి పేరు కనపడదేమీ - టైటిల్సులో ఎక్కడా నటవర్గం అని చూపించిన పేర్లలో "రస్" అని గాని, "అప్పలనర్సయ్యా" అని గాని కనపడలేదు. ఎంతో ఆశగా టైటిల్సు జాగ్రత్తగా చూసినా - తెరవెనుక వాళ్ళపేర్లు ఆఖరికి "లైట్‌బాయ్స్" పేర్లు కూడా వేశారు గాని మనవాడి పేరు లేదు.

"సినిమా ఆఖర్లో - ప్రథమ పరిచయం - రస్" అని వేస్తారేమోనండి" అని మా ఆవిడ కాంతం గుసగుసలాడుతుంటే - "ష్... ష్. " అని కొంతమంది విసుక్కున్నారు దాంతో నోరు మూసేసింది. సినిమా మొదలైంది. ఇద్దరం, అంతబాగోకపోయినా, సినిమా సాంతం ఉత్కంఠతో చూశాం కొన్ని ఫ్లాష్‌బేక్‌ల తర్వాత, హీరో ఎంటరయ్యాడు. అంతే జనంలో ఒకటే హుషారు - ఈలలు - హీరో ఎవరో కాదు దర్శకనిర్మాత పుత్రరత్నం - మన అప్పలనర్సయ్య కానప్పుడు ఎవరైతేనేం అన్న నిస్పృహ కలిగింది. కొత్త హీరో బాగానే చేసినా, ఇతర పాత్రలలోని పాత నటులు అదరగొట్టినా, పాటలు మ్యూజిక్ పర్వాలేద నిపించినా, సినిమాని ఆస్వాదించలేకపోయాం. సినిమా చివరి కొచ్చేసింది - మనవాడు తెరమీద కనపడలేదు - క్లైమాక్సులో ఉంటాడేమో -

కొత్త హీరో, ఆఖరి సీనులో అందరివిలన్లను చితక్కొట్టేసి, వాళ్ళు రక్తం కార్చుకొంటుంటే, హీరో తల్లి ఆనందభాష్పాలు కార్చుతుండగా, ఒక్కసారిగా ఇంట్లో హాల్లోకి, గెంతి (క్లైమాక్స్‌లో ఆఖరిపోరాటం హీరో ఇంటి ముందే జరిగింది) హాల్లో "దండలేసి ఉన్న" తండ్రి ఫొటో ముందు మోకరిల్లి ఉద్వేగంగా - "నాన్నా మన శత్రువులనందర్నీ తుదముట్టించేశాను నాన్నా" అంటూ రక్తతిలకం

అర్ధసాగేడు. అప్పుడు దండ వేసి ఉన్న (లేకపోతే చనిపోయినవాడి ఫొటో అని అర్థమవుదు కదా) ఫొటోని ఒక్క నిమిషం సేపు బాగా క్లోజప్‌లో చూపించేరు.

– ఆ ఫొటోలోని రూపం, మా బామ్మర్ది అప్పలనర్సయ్యది – నీకిప్పుడు ఆత్మశాంతి కలిగింది కదా నాన్నా – అని హీరో, హీరోదాత్తంగా పలుకుతుంటే, సినిమా అయిపోయిది.

నేను కాంతం, మా కాళ్ళు తొక్కుకుంటూ ప్రేక్షకులంతా బయటికి నడుస్తుంటే నిశ్శబ్దంగా కూర్చుండిపోయాం చాలాసేపు. దిగ్భ్రాంతి తర్వాత ఆత్మశాంతి కలిగింది ఇద్దరికీను. మా అప్పలనర్సయ్య "దండ వేసిన ఫొటో" రూపంలోనైనా, (డైలాగులు, డాన్సులు, పాటలు లేకపోయినా) క్షణంసేపు వెండితెరమీద తళుక్కుమన్నాడు కదా. హీరో నాన్న వేషం వేశాడు – సినిమా పేరు "ఆత్మశాంతి"గాబట్టి "టైటిల్ రోల్" వేసినట్లే కదా!!!–

# పురుటిసాయం

"ఏమోయ్! నీకు మీ నాన్న ఉత్తరం రాశారు" – ఆయాసం ఆతృత నిండిన కంఠంతో అన్నాడు, ఆదివారం ఉదయం, టెన్నీస్ కోర్టు నుంచి తిరిగి వస్తూ, కాలనీలోని తమ పేరు మీద ఉన్న పోస్టుబాక్సులో, ఎన్నో "జంక్ పోస్టు"లతో పాటు ఉన్న మావగారి నుంచి, భార్యపేరు మీద వచ్చిన "ఏయిర్‌మెయిల్" కవరుని తీసుకొని వచ్చి భార్యకు అందిస్తూ, అనంత్ అతని భార్య అనిత కూడా తనలాగానే, అమెరికాలో సాఫ్ట్‌వేర్ ఇంజనీరుగా పనిచేస్తోంది. నాలుగేళ్ళక్రితం ఎమ్.సి.ఎ. పూర్తిచేసిన వెంటనే, ప్రత్యక్ష పరిచయం లేకపోయినా, ఏదో హోటల్ రూములో జరిగిన పెళ్ళి చూపుల్లో పరస్పరం, ఇష్టపడినందున పెళ్ళి చేసుకొన్న అనిత, పెళ్ళవగానే అతనితో కలిసి, అమెరికా వచ్చేసి ప్రవాస కాపురం పెట్టేసింది. అనంత్ అయితే, అప్పటికే, అమెరికాలో న్యూజెర్శీలో సాఫ్ట్‌వేర్ ఇంజనీరుగానే పని చేస్తున్నాడు. ఆవిడకు కూడా అమెరికా వచ్చిన కొద్దినెలలకే అదే కంపెనీలో మంచి జీతం మీద ఉద్యోగం వచ్చింది. అయిన వారికి మాతృదేశానికి దూరంగా ఉన్నామన్న బాధ అప్పుడప్పుడు కలిగినా, న్యూజెర్శీలో సంతోషంగానే కాపురం చేసుకొంటున్నారు ఇద్దరూ – బ్రిడ్జ్ వాటర్ అనే టౌన్‌షిప్‌లో, దగ్గర్లో శ్రీ వెంకటేశ్వరస్వామిది, ఇంకా ఇతర హిందూ దేవాలయాలు ఉండటం నచ్చి, ఒక మంచి విశాలమైన ఇల్లు కూడా కొనుక్కొన్నారు. ఆఫీస్‌కి వెళ్ళే టైమింగ్సులో కొంచెం తేడా ఉన్నందున చెరో కారూ కొనుక్కొన్నారు. తోడుగా పెద్దవాళ్ళు గాని, ఇతర కుటుంబ సభ్యులు లేకపోయినా మరీ చిలకా గోరింకల్లా కాకపోయినా, ఎక్కువ అభిప్రాయ భేదాలు లేకుండా సామరస్యంగానే కాపురం చేసుకుంటున్నారు, పరస్పర ప్రేమాభిమానాలతో.

అనంత్‌కి చిన్నప్పుడే తల్లిదండ్రులు పోయినందున, తనవాళ్ళంటూ పెద్దగా బంధువు లెవరూ, ఇండియాలో కూడా లేనందున, భార్య తరపు చుట్టాలనే తన వాళ్ళుగా భావించు కొంటాడు. ముఖ్యంగా, మావగారంటే చాలా ఇష్టం – ఆయన – అదే పురుషోత్తంగారు. అనిత బాల్యంలోనే, భార్య చనిపోగా కూతురుకి సవతి

తల్లిని లేకుండా, ఎంతో గారంగా పెంచి, విద్యాబుద్ధులు గరిపి, తనకిచ్చి పెళ్ళి చేశారు. ఇప్పుడు ఇండియాలో, ఆంధ్రలోని ఒక పట్నంలో ఒంటరిగా ఉంటున్నారు. కూతురు అమెరికా కాపురానికి వెళ్ళిపోయి నప్పట్నుంచీ - ప్రతీవారం, అనిత ఫోను చేసి, తన తండ్రితో మాట్లాడినప్పుడు అనంత్ కూడా మావగారితో హుషారుగా బాతాఖానీ వేస్తాడు. అన్ని విషయాలు చనువుగా మాట్లాడతాడు. ఆయనకి ఈ మెయిల్ చేయటం రాదని తెలుసు - ప్రతీవారం మాట్లాడే మావగారు ఇలా ఎయిర్‌మెయిల్ కవరులో, ఉత్తరం రాసి పంపటం ఎంతో ఆశ్చర్యం కలిగించిందతనికి, సహజంగానే మెయిల్ బాక్స్‌లో ఆయన ఉత్తరం చూడగానే, కవరు చింపి, చదివేద్దామన్న ఆతృతా కలిగింది గాని, సంస్కారం కాదనిపించి, ఇంటికి తెచ్చి భార్య కందించాడు. 'త్వరగా కవరు చింపి, ఉత్తరం చదవమని' కళ్ళతోనే తొందరపెట్టేశాడు. క్రితం ఆదివారమే తమతో మాట్లాడిన తండ్రి కొంచెం డల్‌గాను, మనసులో ఉన్నదేదో చెప్పలేకపోతున్నట్లుగాను గ్రహించిన, అనిత, అప్పుడే ఆయన్ని గుచ్చి గుచ్చి అడిగింది. 'సంగతేమిటని' - కాని ఆయన 'ఏంలేదు.. లేదు...' అని మాట దాటవేసేసరికి ఊరుకొంది - కాని అప్పట్నుంచి మనశ్శాంతి లేకుండానే గడిపింది. ఈ వారమంతా - ఇప్పుడిలా ఉత్తరం వచ్చేసరికి, మనసులో, కీడు శంకిస్తూనే ఉత్తరం చదవనారంభించింది. ఏమాత్రం ఆలస్యం చేయకుండా, ఎంతో ఆదుర్దాతో. అనంత్ కూడా ఆత్రంగా తన ముఖంలోకి చూస్తుండగా ఉత్తరం చదువుతుండగా, అనిత ముఖంలో రంగులు మారిపోయాయి. ఏదో ఇదమిత్థమని చెప్పలేని ప్రతికూలభావాలు మనసుని కమ్ముకోసాగాయి. ఉత్తరం మరీ పెద్దది కాదు చదవడానికి ఎంతోసేపు పట్టలేదు. కాని మననం చేసుకోవడానికి జీర్ణించుకోవడానికి మరికొంత సమయం పట్టింది. మళ్ళీ మళ్ళీ, రెండు మూడుసార్లు చది వింది.

ఆఖరికి - "ఛీ! పాడు" అని తెలుగులోను, "షిట్.." అని ఆంగ్లంలోను ఛీత్కారం చేస్తూ ఆ ఉత్తరాన్ని నేలకి కొట్టింది. భార్య ముఖంలోకి చూసిన అనంత్‌కి, తను ఏమీ చెప్పలేని స్థితిలో ఉందని అర్థమయింది. మూడ్ చాలా బేడ్‌గా ఉందని తెలిసింది. అందుకే ఏమీ అడక్కుండా నేలమీదున్న మావగారి ఉత్తరాన్ని చేతికి

తీసుకొని కళ్ళజోడు సర్దుకొని చదివేడు అంతే, నిర్ఘాంతపోయేడు. మళ్ళీ చదివేడు అందులో ఇలా ఉంది....

అమ్మాయి అనితకు ఆశీర్వదించి వ్రాయునది, ఈ ఆదివారం ఫోనులో నీతో మనసారా మాట్లాడలేకపోయేను. అందుకు చాలా బాధపడుతున్నాను. అప్పుడు అనంత్ ఉన్నా బాగుండేది. లేడు. ఉండుంటే అతనికైనా విషయం చెప్పగలిగేవాణ్ణేమో – ఇంతకీ విషయం ఏమంటే, ఆయన కుటుంబం గురించి నీకంతగా తెలియకపోవచ్చుగాని నా మిత్రుడు కుటుంబరావు నీకూ తెలుసు గదా, అప్పుడప్పుడు మనింటికి వచ్చి నాతో చదరంగం ఆడేవాడు. ఆయనకి అంతగా ఆస్తిపాస్తులు లేవు – కాని ఆరుగురు ఆడపిల్లలు పెద్దమ్మాయి అరుంధతి, పెళ్ళి చేసుకోకుండా ఉండిపోయి, ఏదో చిన్న ఉద్యోగం చేస్తూ తన ఐదుగురు చెల్లెళ్ళ పెళ్ళిళ్లు చేయడానికి సాయం చేసింది తండ్రికి – తనకైతే, ముప్ఫైమూడేళ్ళు వచ్చేశాయి అవివాహితగా మిగిలిపోయింది. గత కొంతకాలంగా, కుటుంబరావు తన పెద్దమ్మాయిని నన్ను పెళ్ళి చేసుకోమని ప్రాధేయపడుతున్నాడు. నేను ఇన్నాళ్ళూ కాదని చెప్పినా, అరుంధతే స్వయంగా వచ్చి, కన్నె చెరవిడిపించమని, తన తండ్రి ఇంక ఎంతోకాలం బతకడని, కేన్సర్ సోకిందని, కాబట్టి ఆయన చివరి కోరిక తీర్చమని కన్నీళ్ళతో ప్రాధేయపడేసరికి, లొంగిపోయేను – గొప్ప రూపసి కాదుగాని ఆదర్శవంతురాలు, సంస్కారవంతురాలు, అని అనిపించింది. కాదనలేకపోయాను. నువ్వు అమెరికా వెళ్ళి పోయినప్పట్నుంచి చాలా ఒంటరినైపోయానన్న భావం మరో కారణం గావచ్చు అంతే, అన్నీ నా ప్రమేయం ఎక్కువగా లేకుండా, ఉళ్ళో, గుళ్ళో పెళ్ళి జరిగిపోయింది, పోయిన శనివారం నాడు – ఇంటికి ముప్ఫై ఏళ్ళ తర్వాత ఇల్లాలు వచ్చింది – నీకు ముందుగా తెలియకుండా, ఇలా జరిగిపోవటం తప్పే – అయినా నువ్వు, అనంత్ అర్థం చేసుకొంటారని ఆశిస్తున్నాను – మీ నాన్న

అనంత్‌కీ చాలా దిగ్భ్రాంతి కలిగించిందీ ఉత్తరం. “ఏమిటీ ముసలాయన – ఈ యాభై అయిదేళ్ళ వయసులో ఈ పనిచేశాడు” అన్న నిరసన భావం నిలువెత్తునా ముంచిందతన్ని, అమెరికాలో ఏడెనిమిది ఏళ్ళుగా ఉంటున్నా భారతీయుడే కదా – ముప్ఫై మూడేళ్ళ ముదురు కన్యకి యాభై అయిదేళ్ళ వృద్ధునితో వివాహమా

అని విస్తుపోయేడు. ముదురు కన్యకు, ముసలివాడితో 'సెక్స్' కావల్సివచ్చిందా అని కూడా అనుకున్నాడు. అంతేగాని తనకు ముప్పై అయిదేళ్ళ వయసు వస్తున్నా ముప్పై ఏళ్ళ భార్యతో "అది" లేని రోజు వృధాగా అనిపించే విషయం జ్ఞాపకం రాలేదు–

'ఈ ముసలాయన్ని, ఎంత ఉన్నతంగా భావించుకొన్నాడు తను? ఆఖరికి, ఇహసుఖాల కోసం, కూతురు, అల్లుడు ఇతర బంధువుల మనోభావాలను లెక్కచేయకుండా, ఆలోచించ కుండా, 'తగుదునమ్మా' అనుకొంటూ, తనకన్నా ఇరవై రెండేళ్ళ చిన్నదాన్ని "మళ్లీ పెళ్ళి" చేసుకొన్నాడే, ఈ మహానుభావుడు అని విస్తుపోయాడు.

ఇన్ని ఆలోచనలు ముసురుకొన్నా, అనంత్ పైకేమీ అనకుండా భార్యకేసి సాలోచనగా చూస్తూ అసంకల్పితంగా నుదురు కొట్టుకొన్నాడు. తను ఇంకా 'షాక్' నుంచి తేరుకొన్నట్లు లేదని గ్రహించేడు – ఏమన్నా కదిపితే, బాధల బరువును కుదిపినట్లవుతుందని, మౌనంగా లోపలి గదిలోకి వెళ్ళిపోయేడు.

ఆ రాత్రంతా, హాల్లోనే, అన్నం తినకుండా, సోఫాలో కలత నిద్ర పోయిన అనిత, తెల్లవారుజామున భర్త పక్కలోకి చేరి, ఆర్తిగా దగ్గరకు తీసుకొంది. కొంతసేపు కలతలనుండి ఇద్దరికీ ఉపశమనం లభించింది. కాని అలాంటి శారీరక ఆనందం, కొంచెం పెద్దవయసులో వాళ్ళకీ అవసరమని అనిపించలేదు!

నాలుగైదు రోజులు గడిచాయి. అయినా లోలోనే మధనపడ్డారు గానీ, ఇద్దరూ పురుషోత్తం అరుంధతి పరిణయం గురించి ఒక్క మాటైనా మాట్లాడుకోలేదు – తర్వాత వచ్చిన ఆదివారం న్యూజెర్సీనుంచి, ఆంధ్రలో భీమవరంలో ఉన్న పురుషోత్తం గారింటికి, ఫోన్ అందలేదు – అట్నుంచి ఇటూ రాలేదు

మరోవారం గడిచిన తర్వాత, అనిత, అనంత్ జరిగిన "మాయదారి పెళ్ళి" గురించి ముందు పొడి పొడిగా తర్వాత వివరంగా మాట్లాడుకోసాగేరు – పరస్పరం అభిప్రాయాలు పంచుకొన్నారు.

ఎంత అమెరికాలో ఉన్నా, పురుషోత్తంగారు, ఇన్నేళ్ళ తర్వాత మొదటి

భార్యపోయిన ముప్పై ఏళ్ళ విరామం తర్వాత పునర్వివాహం చేసుకోవటం, అందులోనూ, తనకంటే ఇరవై రెండేళ్ళు చిన్నదాన్ని చేసుకోవటం ఇద్దరికీ నచ్చలేదు – మరి ఇద్దరూ, వేషభాషలు మారినా, 'భారతీయ సంస్కృతి'ని వదలలేము అనుకొంటున్నవాళ్ళు గాబట్టి – అవాంఛనీయమైన పరిణామమే అనుకొన్నారు గాని, పోనీలే ఇన్నాళ్ళకి 'పెద్దాయన'కి తోడు దొరికిందే, అని మనసులకి నచ్చజెప్పుకోలేకపోయేరు

ఇంకో నెలరోజుల తర్వాత, ఇక బాగోదనిపించి – 'మన మంచి మనకే ఉంటుందని' సమాధానపడో, లేక అల్లారుముద్దుగా పెంచిన తండ్రిపై గౌరవాభిమానాలు పూర్తిగా చావనందువల్లనో, అనితే, భీమవరం ఫోను చేసి, తండ్రితో మాట్లాడింది కొద్దిసేపు – అనంత్‌తో కూడా రెండు నిమిషాలు మాట్లాడించింది – జరిగిన 'మాయదారి పెళ్ళి ప్రస్తావన వీళ్ళూ తేలేదు. ఆయన ఎత్తలేదు' – ఏమైనా, మనసులు విప్పి మాట్లాడుకోలేక పోయేరని మాత్రం చెప్పాలి! తర్వాత కూడా, ఎప్పటిలా ప్రతీవారం కాకుండా మూడునాలుగు వారాలకోసారి, మొక్కుబడిగా ఫోను చేసి, 'అదీ ఇదీ' పొడిపొడిగా మాట్లాడినా, 'పునర్వివాహ ప్రస్తావన' రాకుండా జాగ్రత్తపడేవారు. పురుషోత్తంగారు మాత్రం ఆప్యాయంగానే మాట్లాడే వారు. అంతకంతకి, వాళ్ళ మధ్యన అడ్డుగోడలు క్రమేణా పెరిగిపోసాగాయి – ఆయనకీ పరిస్థితి అర్థమైనట్లుంది, ఎంతవరకు మాట్లాడాలో అంతవరకే, మాట్లాడుతూ, తన పెళ్ళి గురించి గాని, అనంతర పరిస్థితుల గురించి గాని ఏమీ మాట్లాడకుండా, పరువు దక్కించుకొన్నారు. "పిన్ని"తో ఓసారి మాట్లాడరాదూ అని ఎప్పుడూ అనలేదు.

– ఇలా ఆరేడు నెలలు గడిచిపోయాయి –

ఒకరోజున తమ ఆఫీసులో సహోద్యోగి అమెరికన్ వనిత అయిన కేథరిన్‌ని "నిన్న ఎందుకు ఆఫీసుకి రాలేదు" అని యథాలాపంగా అడిగింది అనిత. ఆమె చెప్పిన సమాధానం విని నిశ్చేష్టురాలైంది –

తను విన్న విషయమేమంటే కేథరిన్ వాళ్ల "డాడ్" మూడు రోజుల క్రితం కొత్తగా పెళ్ళి చేసుకున్నాడట, ముందుగా చెప్పకుండానే – కాని నిన్న మొదటిభార్య

జానీ ద్వారా కలిగిన కేథరిన్‌ని తల్లితో సహా పార్టీకి పిలిచాడని వెళ్ళామని చెప్పింది. అడక్కుండానే మిగతా వివరాలు చెప్పింది.

పదేళ్ళ క్రితమే జాన్ అనే తన తండ్రి జానీ అనే తన తల్లికి విడాకులు లిచ్చాడని, తను తల్లితో ఉంటున్నానని జాన్ మధ్యలో ఇంకో పెళ్ళి చేసుకొని బాన్ అన్న కొడుకుని కన్న తర్వాత 'గాన్' అన్న ఆవిడికీ విడాకులిచ్చేశాడని, మళ్ళీ ఇప్పుడు 'డాలీ' అన్న అమ్మాయిని ఇరవై మూడేళ్ళ దానిని, కొత్తగా పెళ్ళి చేసుకొన్నాడని చెప్పింది - తన తండ్రి జాన్ వయసు యాభై మాత్రమేననీ వివరించింది. తల్లికన్నా చిన్నవాడని చెప్పింది.

ఈ వివరాలు విని అనితకు తల తిరిగిపోయింది. కాసేపటికి తేరుకొని, పార్టీకి ఎవరెవరు వచ్చేరని అడిగింది.

"నా బయలాజికల్ డాడ్ జాన్, ఆయన ప్రస్తుత భార్య డాలీ ఏర్పాటు చేసిన విందుకి, మొదటి భార్య అయిన తన తల్లి 'జానీతో సహా తను, డాడ్ రెండో భార్య 'గాన్' ఆవిడి కొడుకు ఇరవై ఏళ్ళవాడు 'బాన్', అతను డేట్ చేస్తున్న గర్ల్‌ఫ్రెండ్ ఏభై ఏళ్ళ 'బీన్' వచ్చారని ఆఖరిలో తన స్వంత బాయ్‌ఫ్రెండ్ నలభై ఏళ్ళ గ్రై, 'టున్' చేరేడని ఉత్సాహంగా చెప్పింది. అరవై ఏళ్ళ తన తల్లి బాయ్‌ఫ్రెండ్ ముప్పై ఏళ్ళ 'గిన్' కారణాంతరాలవల్ల రాలేకపోయేడని 'బొకే' మాత్రం పంపేడని చెప్పింది కేథరిన్.

అంతా గందరగోళంగా ఉంది అనితకు. కాసేపాలోచించి వద్దనుకొంటూనే అడిగింది కేథరిన్‌ని. మరి మీ యాభై ఏళ్ళ బయలాజికల్ తండ్రి జాన్ ప్రస్తుత భార్య డాలీనీ సమవయస్కురాలు! 'డాలీ'ని నువ్వేమని పిలుస్తావు. వరసకు పిన్ని కదా - అలాగే పిలుస్తావా? మీ అమ్మ ప్రస్తుత భాగస్వామి - ఇంకా పెళ్ళి కాలేదు కదా, తన సమవయస్కులైన నిన్ను, నీ తండ్రి రెండోపెళ్ళి ద్వారా పుట్టిన కొడుకు బాన్‌ని, 'డాటర్', 'సన్' అని పిలవగలడా - తర్వాత గాన్, డాలీలు - అదే అదే నాకంతా కన్ఫ్యూజింగుగా...

'ప్రశ్నలు' పూర్తవకుండానే ఫక్కున నవ్వేసింది. అదేమంత పెద్ద ప్రోబ్లెమ్. మా నాన్న మా అమ్మను మిస్ జానీ అంటాడు. విడాకులిచ్చిన మరో స్త్రీ గాన్‌ని

ఆవిడ కొడుకు బాన్‌ని, మా అమ్మ బాయ్‌ఫ్రెండ్‌ని, నా బాయ్ ఫ్రెండ్‌ని, పేరు ముందు మిస్, మిసెస్, మిస్టర్ అని పెట్టి చక్కగా పేర్లతో పిలుచుకొంటాం. బంధుత్వాల ప్రసక్తి విడాకులతోనే పోయింది, నా వయసుదైన, మా డాడీ ప్రస్తుత భార్య డాలీని 'పిన్నీ' (అంటీ) అని ఎలా పిలుస్తాను? చక్కగా మిసెస్ డాలీ అనే అంటాను. అని చెప్పి తన బాయ్‌ఫ్రెండ్ నుంచి సెల్‌కి ఫోను వస్తే బిజీ అయిపోయింది కేథరిన్. అది "టున్" అన్న బాయ్‌ఫ్రెండ్ నుంచి కాదని "బన్" అనే మరొకడ్నుంచని – "యా – యా, బన్ ఐ లవ్ యూ" అంటుంటే తెలిసింది.

రాత్రి ఇంటికి చేరిన వెంటనే, వయసు వరసల తారతమ్యాలు లేని ఈ వింత అమెరికన్ దాంపత్యాలు, పునర్వివాహాలు గురించి భర్త అనంత్‌కి వివరంగా చెప్పి ఇద్దరూ కడుపుబ్బా నవ్వుకొన్నారు. వెంటనే, పురుషోత్తంగారి పునర్వివాహం పట్ల అంతవరకు తమకున్న నిరసన భావాలు పలుచబడసాగాయి నెమ్మదిగా.

అరవై ఏళ్ళ తన మమ్మీ ముప్పై ఏళ్ళ 'గిన్'తో శారీరక సంబంధం పెట్టుకోవడాన్ని తన అసలు తండ్రి ఏభై ఏళ్ళ బాన్, ఎంతో చిన్నదైన డాలీని వివాహం చేసుకోవడాన్ని, తన వరసకు తమ్ముడైన బాన్, తన కన్న ఎంతో పెద్దదైన దానితో డేటింగ్ చేయడాన్ని తాను కూడా, ఒకడికంటె ఎక్కువమంది బాయ్‌ఫ్రెండ్‌లని కలిగి ఉండటాన్ని సమర్థించుకొంటూ, మరో సందర్భంలో "సెక్స్ అంటే రెండు శరీరాల కలయిక – ఏ వయసువాళ్ళకయినా గాలి, నీరు లాగా అత్యవసరం. ఆరోగ్యం బాగాఉంటే వయసు నిమిత్తం లేదు" అంటూ భుజాలెగరేసుకొంటూ కేథరిన్ చెప్పిన అభిప్రాయాలను పూర్తిగా మన్నించలేకపోయినా, అనిత మనసులో కొంత పునరాలోచన విత్తులు చల్లబడ్డాయి – అనిత అనంత్ తరచుగా చర్చించుకోసాగేరు పునర్వివాహాల గురించి.

"అమ్మ పోయాక, ఎవరెంతెలా చెప్పినా వినకుండా పునర్వివాహం తలపెట్టకుండా తనే తల్లీ, తండ్రీ అయి ఎంతో బాగా పెంచారు నాన్న – నాకోసమే బ్రతికినట్లు, ఇన్నేళ్ళూ ఉన్నాడు. ఇప్పుడ నేనూ దూరం అయ్యాక, తనకో తోడు తెచ్చుకోవటం ఏదో ఘోరతప్పిదం అయినట్లు ప్రవర్తించాను. ఎంత బాధపడ్డాడో, ఏమో – ఎంత అన్యాయంగా అధర్మంగా ఆలోచించాను 'నాన్న గురించి' అని పదే పదే వాపోయింది. అన్ని ఆలోచనల్నీ భర్తతో పంచుకొంది.

"ఏమండీ, మనం నాన్నను అన్యాయంగా దూరం చేసుకొన్నాం. ఆఖరికి నేనిప్పుడు ఆరునెలల గర్భిణీనని కూడా మాటమాత్రంగానైనా చెప్పలేదు, ఏదో పరాయివాడిలా చూశాం. అసలు ఆయనేం తప్పు చేశాడు. బాల్యమిత్రుడి మాట కాదనలేక ఒక దురదృష్ట వంతురాలికి, ఇల్లాలి హోదా కల్పించాలనే సదుద్దేశంతో ఆవిడి సంపూర్ణ ఇష్టంతో పెళ్లి చేసుకొన్నాడు శాస్త్రోక్తంగా - అక్రమ సంబంధం పెట్టుకోలేదు కదా- ఈ ఆదర్శ వివాహాన్ని మనమే సరిగా అర్థం చేసుకోలేకపోయాం. ఇంక గొంతు పెగలక బావురుమంది అనిత భర్త చేతుల్లో ముఖం దాచుకుంటూ.

అంతా నిజమేనన్నట్లు తల పంకించాడు. మౌనంగా ఉండిపోయిన అనంత్ కాసేపు తర్వాత, తనే అన్నాడు.

ఓ పరిష్కారం ఆలోచించాను అనితా - నువ్వు ఆరునెలల గర్భిణీవని మీ నాన్నకు తెలియదు ఇప్పటికైనా చెప్పటం ధర్మం చాలా సంతోషిస్తాడు. ఇంకోపని చేద్దాం. మీ పిన్నిని తీసుకుని ఇక్కడికి రమ్మని కోరుదాం. అన్ని పేపర్లు రేపు పంపుదాం. టిక్కెట్లు కూడా ఇద్దరికీ కొని, పదిహేనురోజుల్లో అమెరికా వచ్చే ఏర్పాటు చేద్దాం. కాదనలేరు. పైగా మీ అమ్మలాంటి, పిన్ని ఇక్కడికొస్తే చాలా సాయంగా ఉంటుంది. నువ్వు పిన్నిని కూడా 'అమ్మ'లా పిలిపించుకొన్నావని మీ నాన్న ఎంతైనా సంతోషిస్తాడు. పురుడయ్యేవరకు ఇద్దరూ మనతో ఉంటే చాలా దగ్గరయిపోతాం. అన్ని అపోహలు పోతాయి. అయినా నువ్వు పిలిస్తే రానని అనలేరు...."

అనంత్ చెప్పినదానికి భార్య ఎంతో ఆనందంగా తలూపేసరికి ఇంకా హుషారు వచ్చేసింది.

"ఇది మామూలే - అమెరికాలో ఉండే మనలాంటి ప్రవాసులు చేసే పనే పేరెంట్సుని పురుడు సమయానికి పిలిపించుకోవటం - పిల్లలు ఇక్కడ పుడితేనే కదా ఆటోమేటిగ్గా అమెరికన్ పౌరసత్వం వాళ్ళకి లభించేది. అందుకే ఎవరూ పురుటికి పుట్టింటికి వెళ్ళరు. పెద్దవాళ్ళనే ఇక్కడికి పిలిపిస్తారు. ఇక్కడే పిల్లలని కంటారు. వాళ్ళకి అమెరికన్ సిటిజెన్‌షిప్ సాధిస్తారు. కొన్నాళ్ళకి తమకీ "గ్రీన్‌కార్డు" తర్వాత పౌరసత్వం లభిస్తుంది. పెద్దవాళ్ళు కూడా ఇండియానుంచి ఎంతో

ఆనందంగా వస్తారు. తమవాళ్ళతో కలిసి కొన్ని నెలలు ఉండవచ్చని అపరస్వర్గం అమెరికాని కూడా చూసేసి తరిద్దామని, ఏమంటావ్" - ఇలాంటి "డెలివరీ కాల్" - అదే "పురుటి పిలుపు"కే వాళ్ళూ ఎంతోకాలంగా ఎదురుచూసి, పిలవగానే సంతోషంగా వస్తారు...."

చాలాకాలంగా తన "డెలివరీ" గురించి ఎంతగానో భయపడుతున్న అనితకు, భర్త చెప్పిన ప్రపోజల్ చాలా నచ్చింది.

"ఓకే మహానుభావా, వచ్చే ఆదివారం నాన్నకి శుభవార్త చెప్పి, ఇన్నాళ్ళూ చెప్పనందుకు క్షమాపణలు చెప్పేసి, వెంటనే "డెలివరీ కాల్" అదే మీరన్నారే "పురుటి పిలుపు" కూడా అందజేస్తాను. అని హుషారుగా అంది. చాలా రోజుల తర్వాత అనిత హాయిగా నిద్రపోయింది ఆ రాత్రి - ఇంతవరకు ఫొటో కూడా చూడని "పిన్ని" కలలో కొచ్చి ఎన్నో కబుర్లు చెప్పింది . 'ఏ పనీ చేయకుండా, విశ్రాంతి తీసుకోమని, ఇంటి పనంతా తనకే వదిలేయమని' బ్రతిమాలింది అమ్మలా!!!

మర్నాడు, ఆఫీసుకి వెళ్ళబోయే ముందు స్పెషల్ కొరియర్ ద్వారా ఉత్తరం వచ్చింది. అనితే సంతకం చేసి తీసుకొంది. అది నాన్న దగ్గరనుంచేనని గ్రహించి, ఆదుర్దాగా చింపి, చదివింది. వెనకనే నిలబడ్డ అనంత్ కూడా సాంతం చదివాడు ఉత్తరం ఇలా ఉంది

అమ్మా,

కన్నకూతుర్ని 'అమ్మా' అని పిలిచి ఆదుకోమని అర్థించవలసిన విచిత్ర స్థితిలో ఉన్నానిప్పుడు - మీ పిన్ని అరుంధతికి ఇప్పుడు ఏడో నెల - స్కాన్ చేయిస్తే కవలపిల్లలు పుట్టబోతున్నారని తేలింది - కాన్పు కష్టం కావొచ్చుననీ చెప్తున్నారు. ఇద్దరికీ చాలా భయంగా ఉంది. తన తండ్రి పోయేక, సాయం చేసే బంధువులు కరువయ్యారు. తల్లి ఎప్పుడో పోయింది - చెల్లెళ్ళు ఐదుగురు ఉన్నా, కృతఘ్నులు - చేసిన సాయం మరిచి అక్క అంటే కిట్టకుండా ఉన్నారు. మన తరపునా ఎవరూ లేరు కదా, నువ్వు తప్ప. నువ్వు వెంటనే సెలవు పెట్టి, నాలుగైదు నెలలు పిన్నికి సాయం ఉండేలా ఇండియాకి రా తల్లీ - అనంత్ తర్వాత రావొచ్చు.

నువ్వు వెంటనే రా అమ్మా నీ ప్రయాణం తేదీలు తెలియజేస్తూ ఫోన్ చేయి. ఉంటా - మీ నాన్న

డెలివరీ కాల్ - అదే పురుటి పిలుపు నాన్నకు, పిన్నికి పంపుదామనుకొన్న అనితకే అలాంటి పిలుపు వచ్చింది - ఇప్పుడేం చేయాలి అనిత? పురుటి సాయం చేయాలా - తీసుకోవాలా???

*(గృహశోభ మాసపత్రికలో ప్రచురితం)*

# నీరజ నిర్దోషి!!

(ఒక వాస్తవ సంఘటనకు భిన్నరూపమైన కథ - రచయిత ఊహాచిత్రం)

"నరరూప రాక్షసి - హంతకి - కరుడు గట్టిన నేరస్తురాలు - మానవరూపంలో ఉన్న మృగం - సైకో - ఆడజాతికే, అవమానం...

ఇవీ, నీరజకు వారం రోజులుగా, వార్తాపత్రికలు, ఇతర ప్రచారమాధ్యమాలు, ఇస్తున్న బిరుదులు! ఫైనాన్స్ వ్యాపారి 'దినకర్' హత్యకేసులో ఏ రోజుకారోజు వార్తాపత్రికల్లోను, టీవీ ఛానల్సులో వార్తా కదంబాల్లో వస్తున్న సంచలనాత్మక వివరాలు డైలీసీరియల్సు కన్నా ఉత్సుకతతో చదువుతున్నారు, చూస్తూ ఉన్నారు జనం! ఆఫీసుల్లోను, బస్స్టాపుల్లోను రైలు స్టేషన్లలోను, ఎక్కడ నలుగురు కలుసుకొన్నా ఈ కేసు గురించే మాట్లాడుకోసాగారు... మరి రోజుకో సంచలనవార్త బయటికొస్తోంది!

అదేం చిత్రమోగాని, పోలీస్ డిపార్టుమెంటువాళ్ళు, 'దొంగలు పడ్డ ఆర్నెల్లకు' అన్నట్టుగా కాకుండా, కేవలం ఆర్రోజులలోనే కేసుని ఒక కొలిక్కి తీసుకొచ్చేసారు. 'హంతకురాలి'ని పట్టేసేరు - హత్యకు సంబంధించిన అన్ని వివరాలు కనుక్కొన్నారు - నిర్దుష్టమైన సాక్ష్యాధారాలు సేకరించారు!

ఈ మధ్యకాలంలో 'స్వర్ణాంధ్ర'లో బలపడుతున్న ' పారదర్శకత' సూత్రాన్ని పాటించడానికి, హైద్రాబాద్ పశ్చిమ రేంజ్ డి.సీ.పి. గారు ప్రత్యేకంగా మీడియా సమావేశాన్ని ఏర్పాటు చేసి, అంతవరకు జరిగిన నేరపరిశోధనా వివరాలని, రికార్డు సమయంలో సాధించిన ప్రగతిని, చక్కగా క్రోడీకరించి, మీడియాతో పంచుకొన్నారు. పోలీసు డిప్యూటీ కమీషనరు ఆనందకుమార్ చెప్పిన వివరాలివి.

కృష్ణాజిల్లాలో ఒక గౌరవప్రదమైన కుటుంబంలో పుట్టి, విజయవాడ కళాశాలలో, 'డిగ్రీ' పూర్తి చేసుకున్న నీరజకు, రెండుసంవత్సరాల క్రితం హైద్రాబాద్లో ఉద్యోగం చేస్తున్న వెంకట్తో, వైభవంగా పెళ్ళయింది. భార్యాభర్తలు

సంజీవరెడ్డినగర్‌లో "మాయా అపార్టుమెంటు"లో ఫ్లాట్ నెంబరు 420లో, కాపురం చేసేవారు. వీళ్ళతో వెంకట్ తల్లి అనసూయమ్మ కూడా ఉండేది. ఒక సంవత్సరం క్రితం వెంకట్‌కి సింగపూర్‌లో పెద్ద 'సాఫ్ట్‌వేర్ కంపెనీ'లో మంచి ఉద్యోగం వచ్చి వెళ్ళిపోయాడు. కాదు, వెళ్ళిపోయాడని అనుకున్నారు అంతా. అందర్నీ నీరజ అలా నమ్మించింది. అసలు జరిగిందేమంటే 'లక్షలు' తీసుకొన్న "కన్సల్టెంటు" మోసం చేసి ఇచ్చిన ఫోర్జరీ నియామకపత్రాల భండారం, మద్రాసు ఎయిర్ పోర్టులోనే బయటపడినందువల్ల, సింగపూర్ ప్రయాణం ఆగిపోయింది. అతను వెనక్కి హైద్రాబాద్ వచ్చేద్దామని అనుకుంటే, నీరజే ఒప్పుకోలేదు... ఎందుకంటే భర్తకు విదేశంలో 'వచ్చిన' పెద్ద ఉద్యోగం గురించి ఎన్నో గొప్పలు అందరికీ చెప్పుకొని ఉన్నందువలన, ఎంతో భారీగా అప్పులు చేసి ఉన్నందువలన, భర్తను మద్రాసులో 'అడయారు'లోనే ఉండిపొమ్మని, తనే బలవంతం చేసింది. అలా తన భేషజం కోసం, అడయార్‌లో అజ్ఞాతవాసం చేస్తున్న భర్త ఖర్చుల కోసం, హైద్రాబాద్‌లో తనూ, అత్తగారు బతకటం కోసం నీరజ మరిన్ని అప్పులు చేసింది. ఎవరి అదుపూ లేనందున, విలాస వంతమైన జీవితానికి అలవాటు పడింది. ఇంకా, ఇంకా, అప్పుల ఊబిలో దిగిపోయింది – త్వరలోనే డబ్బుకోసం అక్రమసంబంధాలు, అత్తగారికి తెలియకుండా పెట్టుకోసాగింది. భర్త ఉద్యోగం చేస్తున్న 'సింగపూర్ కంపెనీ'లో, ఉద్యోగమిప్పిస్తానని, చెప్పి కొంతమంది 'బక్రాగాళ్ళ' దగ్గర లక్షలు వసూలు చేసింది! అప్పులపై అధిక వడ్డీలు చెల్లించడానికి, కొన్ని పాత అప్పులు తీర్చడానికి, ఇంకా, ఇంకా అక్రమసంబంధాలు పెట్టుకొని, ఇంకా విలాస వంతమైన జీవితానికి అలవాటు పడిపోయింది!!! ఇదంతా మద్రాసులోని భర్తకు తెలియకుండా జాగ్రత్త పడింది!

ఇటీవలి కాలంలో నీరజకు ఫైనాన్సు వ్యాపారి దినకర్‌తో 'పరిచయం' ఏర్పడింది – హత్య జరిగిన రోజు 'దినకర్' సాయంత్రానికల్లా బ్యాంకులో డ్రా చేసింది, మిత్ర కంపెనీల వద్ద బదులు తీసుకొన్నది కలిపి, మూడు లక్షలు పోగుచేసి, తన కైనటిక్ స్కూటరు మీద హడావుడిగా బయలుదేరి వెళ్ళిన సంగతి అతని ఆఫీసు వాళ్లకు తెలుసు. ఎక్కడికో ఎందుకో మాత్రం తెలియదు. మర్నాడు మధ్యాహ్నం దినకర్ భార్యకు ఫోను వచ్చింది. "నేనే మాట్లాడుతున్నాను... పనిమీద వైజాగ్

వచ్చాను.... వారం రోజుల దాకా రాను కంగారు పడవద్దు" అని చెప్పి పెట్టేసరికి, అది దినకర్ గొంతు కాదని, గుర్తుపట్టిన ఆమెకు ఇంకా కంగారెక్కువయింది. అప్పటికే 'భర్త ఇంటికి రాలేదే,' అని కంగారు పడుతున్నందువలన,... వెంటనే కుటుంబసభ్యులతో కలిసి వెళ్ళి సంజీవరెడ్డినగర్ పోలీస్‌స్టేషన్‌లో రిపోర్టు చేసింది. పోలీసులు వెంటనే రంగంలోకి దిగారు. సాయంత్రానికల్లా దినకర్ స్కూటర్ సనత్‌నగర్‌లో ఉండటాన్ని కనిపెట్టేసారు... స్కూటర్ బేగ్‌లో పాస్‌బుక్‌లు, ఇతర కాగితాలతో పాటు ఒక సెల్‌ఫోన్ దొరికింది. అది దినకర్‌దేనని నిర్ధారించుకొన్న తర్వాత, దానికి వచ్చిన "ఇన్‌కమింగ్" కాల్సు చెక్ చేసారు. ఒకే నెంబరు నుండి పద్దెనిమిది సార్లు కాల్ వచ్చిందని, ఆ నెంబరే ఆఖరి "ఔట్ గోయింగ్ కాల్"గా ఉందని పట్టేశారు. ఆ నెంబరున్న సెల్‌ఫోన్ ఎవరిదో తెలుసుకొని కళ్ళెర్రజేసి చూసేసరికి ఆ వ్యాపారి అది తనదే అయినా మాయా అపార్టుమెంటు ఫ్లాట్‌నెంబరు 420లో ఉంటున్న 'నీరజ' అనే అమ్మాయికి తాత్కాలికంగా ఇచ్చానని చెప్పేసాడు. వెంటనే పోలీసుబృందం నీరజ ముందు వాలిపోయింది. అప్పటివరకు మామూలు 'మిస్సింగు' కేసు అనుకొన్నవాళ్ళకి నీరజ వాలకం చూసేసరికి 'కిడ్‌నాప్' కేసేమోనని అనుమానం వచ్చింది. కొంచెం గట్టిగానే ప్రశ్నించేసరికి ఏవో 'కథలు' చెప్పబోయింది నీరజ. ఫ్లాటులో హాల్లో ఏదో ఘాటైన 'ఫెర్‌ఫ్యూమ్' స్ప్రే చేసి ఉన్నట్లు గమనించి కారణమడిగితే "ఆ రోజు చేపల పులుసు వండుతున్నాను, పక్క ఫ్లాటులవాళ్ళు శాకాహారులు కాబట్టి సెంటు స్ప్రే చేసానని నిబ్బరంగా చెప్పింది. కాని వంటింట్లో చూస్తే గిన్నెలో కందపులుసు ఉందిగానీ చేపలపులుసు లేదు.. దాంతో అన్ని గదులూ వెదికేరు. చేపల పులుసు గిన్నె దొరకలేదు! ఒక బెడ్‌రూమ్‌లో మంచం కింద టీవీ ఖాళీ చేసిన అట్టపెట్టెలో చక్కగా ప్యాకింగ్ చేయబడిన మొండెం, స్టోర్‌రూమ్‌లో పాత ట్రంకుపెట్టెలో కొత్త న్యూస్ పేపర్లలో చుట్టబెట్టిన తల దొరికాయి. జాగిలాలను తెప్పిస్తే అవి, ఆరో అంతస్తులో ఖాళీగా ఉన్న 'పెంట్ హౌస్' వెనకాల గార్బేజ్ కేన్‌ల మధ్య గిఫ్ట్‌పేక్ చేయబడిన కాళ్ళు చేతులు చూపించాయి. పోలీసుల దగ్గర 'మిస్సింగు కేసు' నమోదు చేసినప్పుడు తీసుకున్న ఫొటో ఉంది కాబట్టి, ఈ శవఖండాలు దినకర్ తాలూకువని తెలుసుకున్నారు. మిస్సింగు కేసు కాస్తా, హత్యకేసుగా రూపాంతరం చెందేసరికి, ఇంకా అప్రమత్తులైన పోలీసువారు 'ఇన్వెస్టిగేషన్', 'ఇంటరాగేషన్' తీవ్రతరం చేసారు.

నీరజ నిజాలన్నీ చెప్పేసింది. పూసలు గుచ్చినట్లుగా వివరాలు చెప్పింది. గోళ్ళరంగు తుడుచుకునే పాలిష్, మత్తుమందుగా వాడి, శీతల పానీయంలో కలిపి తాగిస్తే, దినకర్ మత్తులోకి కాక, ఏకంగా 'కోమా'లోకి వెళ్ళిపోయాడని మర్నాటిఉదయానికి విగతజీవుడై పోయాడని అలా అనుకోకుండా హత్య జరిగిపోయిందని, నీరజ నిబ్బరంగా చెప్పింది. చేసిన నేరాన్ని కప్పిపుచ్చుకోవడానికి గదులన్నీ ఏసిడ్‌తో కడిగానని, వాచ్‌మెన్‌తో పాతబస్తీనుంచి తెప్పించిన కత్తులు వాడి, ఎవరికీ తెలియకుండా, ఎవరి సాయం లేకుండా శవాన్ని ఖండఖండాలుగా నరికి పేక్ చేసి పెట్టానని, రాత్రికి కారులో వెళ్ళి ఉస్మాన్‌సాగర్ హిమాయత్‌సాగర్, గండిపేట చెరువులలో "నిమజ్జనం" చేద్దామని పథకం వేసుకొని ఉన్నానని, అయితే ఈ అంతిమ సంస్కారం పూర్తి చేసేలోగానే పోలీసులు కంగారుపడి వచ్చేసి, అంతా భగ్నం చేసారని నిందించింది – ఈ మేరకు తయారుచేసిన 'నేరం ఎవరి సాయంలేకుండా తానొక్కత్తే చేసానని' ఒప్పుకొంటూ కన్‌ఫెషన్ స్టేటుమెంటు, చేతులు వణక్కుండా చక్కగా సంతకం పెట్టింది!

వాచ్‌మన్‌ని విచారిస్తే ఏసిడ్ డబ్బా, కత్తులు కొని తెచ్చి ఇచ్చిన మాట వాస్తవమేనని, కాని వాటి అవసరమేమిటో తనకు తెలియదని, బాత్రూంలు కడగడానికి, ఆవకాయ పచ్చడికి మామిడి కాయల ముక్కలు నరకడానికి అనుకొన్నానని, అమాయకంగా చెప్పేడు – అపార్టుమెంటులో పక్కవాటాల వాళ్ళనుంచి గొప్ప సమాచారమేమీ లభించలేదు. నీరజ చాలా విలాసవంతమైన జీవితం గడుపుతుందని, భర్త సింగపూర్ నుంచి పంపించాడని చెప్పి పెర్ఫ్యూమ్‌లు, సిగరెట్టు పేకెట్‌లు అప్పుడప్పుడు బహుమతులుగా తమకి ఇచ్చేదని కాబట్టి ఆవిడింటికి ఎవరెవరో కొత్తవాళ్ళు టైమూ పాడూ లేకుండా, వస్తున్నా పెద్దగా పట్టించుకోలేదని చెప్పారు. నీరజతో పాటు అత్తగారు కూడా ఉంటారని కాని ఎప్పుడూ పూజలు పునస్కారాలతో కాలం గడిపేస్తారని కాంప్లెక్సులో తన ఈడువాళ్ళతో కూడా, ఎప్పుడూ కలవరని, వెల్లడించారు. ఇదంతా జరుగుతుండగా బయట్నుంచి వచ్చిన అనసూయమ్మ గారిని, ఆవిడ ముఖాన ఉన్న త్రిచూర్ణం బొట్టుని మెళ్ళో రుద్రాక్షమాలను చూసి కూడా, ఎక్కడినుంచి వస్తున్నారని ప్రశ్నించి 'పోలీస్ జాగ్రత్త' తీసుకున్నారు. ఆవిడ, మూడురోజుల్నుంచీ, తాను వనస్థలిపురంలో

సాయిబాబా గుళ్ళో అఖండ భజనల్లో పాల్గొని వస్తున్నానని చెప్పింది. తర్వాత హత్య గురించి తెలుసుకొని రామా... కృష్ణా... అంటూ భోరున విలపించింది.

ఇలా రికార్డు సమయంలో పోలీసువారు దినకర్ హత్యను అందుకు దారితీసిన పరిస్థితులను చాకచక్యంగా పరిశోధించి తెలుసుకొన్నారు. అన్ని సాక్ష్యాధారాలు పకడ్బందీగా సేకరించి, ఫైనాన్స్ వ్యాపారి దినకర్‌ని పాశవికంగా హత్యచేసిన నీరజను అరెస్టు చేసారు. ఇంకా లోతుగా పరిశీలించి ఈ హత్య, తదుపరి తతంగం అంతా నీరజ మాత్రమే చేసిందని, ఇంకెవరి ప్రమేయం లేదని తేల్చుకున్నారు.

ఇవీ, డీ.సి.పి. ఆనంద్‌కుమార్, మీడియా సమావేశంలో, వెల్లడించిన వివరాలు... అయితే ఇవన్నీ అప్పటికే అన్ని పేపర్లలోను, టీవీ వార్తాకదంబాల్లోనూ చెప్పిన విషయాలే కాబట్టి, ఎవరూ ప్రశ్నించలేదు గాని డిసిపిగారు అదనపు ఆకర్షణగా, సాక్ష్యాధారాలు ప్రదర్శించిన ఖాళీ ఏసిడ్ డబ్బాను 'నైల్ పాలిష్ రిమూవర్' బాటిల్‌ని, శవాన్ని ఖండాలుగా చేయడానికి ఉపయోగించిన రెండు కత్తుల్ని కుతూహలంగా చూసేరు. దాంతో ఆయనకి కొంత హుషారు వచ్చింది. "నాకు తెల్సినంతవరకు గోళ్ళపాలిష్ రిమూవర్ ద్రవాన్ని విషంగా వాడి, హత్య చేసిన ఉదంతం ఇదే ప్రథమం కాబట్టి ఇకముందు గోళ్ళపాలిష్ రిమూవర్ సీసాలను కొనడానికి ఎవరైనా వస్తే, దుకాణాల వాళ్ళు, కొనేవాళ్ళ అడ్రస్‌లు, హత్యలు చేయడానికి వాడమన్న హామీపత్రాలు తీసుకోవాలని చట్టం చేయాలేమో! అని చమత్కరించారు. అంతలోనే, మళ్లీ సీరియస్ అయిపోయి, ఇదొక్కటే సాక్ష్యాధారం కాదు. బాగా పరిశోధించి ఇంకా ఎన్నో ఆధారాలు సాక్ష్యాలు సేకరించామని, కోర్టులో బయట పెడతామని అన్నారు.

ఇంతలో, ఒక విలేఖరి అనేసాడు. "సార్ అంతా నీరజే స్వయంగా ఒప్పేసుకొంది కదా.. మీ డిపార్టుమెంటు 'ఘనత' ఏముంది? దాంతో డి.సి.పి గారు బాధపడిపోయారు. ఆవేశపడ్డారు –

"అదేమిటండీ అలా అంటారు. ఒక యువకుడు ఇంటికి రాలేదని రిపోర్టు వస్తే ఏదోలే అనుకోకుండా వెంటనే పరిశోధన ప్రారంభించాం. ఏదో ఎక్కడికో, జల్సా చేసుకోవడానికి పోయుంటాడులే అనుకొని నిర్లక్ష్యం చేయలేదు. అతని

స్కూటరుని పట్టుకొన్నాం. అందులో దొరికిన సెల్‌ఫోన్‌ని వాళ్లింట్లో వాళ్ళకిచ్చేసి ఊరుకొందామని అనుకొన్నామా? ఇంకా పరిశోధించి ఎక్కడ్నించి కాల్స్ వచ్చాయో తెలుసుకున్నాము. దినకర్, నీరజకు డబ్బివ్వడానికి వెళ్ళాడని గ్రహించాం - అసలు నీరజకు దినకర్‌కి సంబంధం ఉన్న విషయం అతని ఆఫీసులోగాని, ఇంట్లోగాని ఎవరికీ తెలియదు. మేమే కనుక్కొన్నాం. నీరజ ఇంట్లో సెంటు స్ప్రే చేసి చూడటాన్ని ఆషామాషీగా తీసుకొన్నామా? లేదే.. పరిశోధించి సోదాచేసి, మృతదేహం భాగాల్ని వెలికి తీసాము.

...ఇదంతా మా సమర్థత కాదా? అని గట్టిగా ప్రశ్నించేసరికి "అవును కదా" అన్నట్లు సమావేశంలోని పత్రికా ప్రతినిధులే కాక, ఇదంతా టీవీలో 'లైవ్'గా చూస్తున్న వాళ్ళలో చాలామంది తలలు పంకించారు.

సమావేశం ముగిసాక, ఒక విలేఖరి అడిగాడు "సార్ మరి దినకర్, నీరజ కిచ్చిన మూడు లక్షల సంగతేమిటి?"

"ఏమో మరి... ఎక్కడా దొరకలేదు.. ఎవరికో ఇచ్చేసానని నీరజ అంటోంది" ఇంకా వెరిఫై చేయాలి....."

"అంతే సంగతులు.. ఆ డబ్బంతా దొరికే ఉంటుంది. పోలీసులే నొక్కేసి ఉంటారు. ఇది మామూలేగా" అని ఒక విలేఖరి గొణిగిన మాట అందరికీ వినపడలేదు.

కేసుని డీల్ చేయకపోయినా సి.ఐ.డి ఇనస్పెక్టరు ప్రవీణ్‌కి నీరజ కేసు వివరాలన్నీ పేపర్ల ద్వారా తెలుసు. అతన్ని కమీషనరు కాంతారావుగారు కలవమని కబురంపారు.

పోలీసు కమీషనర్ కాంతారావుగారు తను పనిచేస్తున్న 'స్పెషల్ క్రైమ్' బ్రాంచ్‌లో కేసుల వివరాలు తెలుసుకోవడానికి, అప్పుడప్పుడూ పిలవటం రివాజే కాబట్టి, పెద్దగా ఏమీ ఆలోచించకుండా ఆయన చాంబర్‌కేసి వెల్లి శాల్యూట్ కొట్టాడు. ఆయన నేరుగా సబ్జెక్టులోకి వచ్చేసారు.

"మిస్టర్ ప్రవీణ్! నీరజ కేసు వివరాలు నీకు తెలిసే ఉంటాయి.. నా సర్వీసులో

దారుణమైన హత్యలు చేసిన ఆడవాళ్ళనెందరినో చూశాను. ఈ అమ్మాయిని చూస్తే ఏదో మిస్సింగులింకు ఉన్నట్లనిపిస్తోంది నాకు. ఇలా హత్య చేయటం, తర్వాత శవాన్ని నిబ్బరంగా ఇంట్లో పెట్టుకోవటం ఆ తర్వాత తీరిగ్గా ఖండఖండాలగా కోసి, చక్కగా, ఏ పార్టుకా పార్టు, 'గిఫ్ట్ పేక్' చేసి, ఇంట్లోనే ఉంచటం. ఇదంతా ఒక్కతే చేయగలదా. దేర్ మస్ట్ బీ సమ్ కాంప్లిసెస్. కాని బయటపెట్టటం లేదు. అక్కడికీ, మహిళా డియస్పీ సుమతితో, ఇంటరాగేషన్ చేయించారు. ఫ్చ్. అంతా నేనొక్కదాన్నే చేసానని అక్షరం పొల్లుపోకుండా సేమ్‌స్టోరీ చెప్తోంది. దేర్రీజే మిస్సింగు లింక్. అది కనుక్కోవాలి. ఈ కేసు నువ్వు పరిశోధించాలని ఆర్డర్స్ పాస్ చేసాను. టేక్ యువర్ ఓన్ టైమ్. సాధ్యమైనంత, రహస్యంగా చేయాలి సుమా. ఒకే! ప్రవీణ్ గుడ్‌లక్" అని కేసు ఫైలు తన చేతికిచ్చేసి ఇంకో ఫైల్లోకి తలదూర్చేసరికి ప్రవీణ్, ముందు నిర్ఘాంతపోయాడు. వెంటనే తేరుకొని ఆ ఫైలు అందుకొని మళ్ళీ శాల్యూట్ కొట్టేసి బయటపడ్డాడు. "ఒకేసార్" అంటూ.

కేసు ఫైలంతా ఆ రాత్రే లోతుగా స్టడీ చేసాడు ప్రవీణ్. పోలీసులకిచ్చిన వాంగ్మూలంలో వాచమన్, నీరజ అత్తగారు 'అనసూయమ్మ'కి ఫోటోలు తీయటం వచ్చని, తనతో కెమెరా రీల్సు తెప్పించుకొనేదని చంచల్రావు అనే ఆయన ఫ్లాటునంబరు 420కి అప్పుడప్పుడూ వస్తూ వుంటాడని చెప్పిన విషయాన్ని 'మార్క్' చేసుకొన్నాడు. మర్నాడే, మాయా అపార్టుమెంటు దగ్గరికి మఫ్టీలో చేరుకున్నాడు. దానికిముందే చంచల్‌రావు పూర్వాపరాలు తెలుసుకోమని తగినవాళ్ళకి పురమాయించాడు.

నీరజ అపార్టుమెంటుకి వెళ్ళి కాలింగుబెల్ నొక్కిన కాసేపటికి "అనసూయమ్మ" వచ్చి తలుపు తీసి ప్రశ్నార్థకంగా చూస్తే 'అదోలా నవ్వుతూ' నీరజ స్నేహితుణ్ణని. పరిచయం చేసుకొన్నాడు. ఆవిడ వెంటనే, తనూ అదోలా నవ్వుతూ, లోనికి ఆహ్వానించింది. ప్రవీణ్ సోఫాలో కూర్చున్నాక ఎదురుగా ఇంకో సోఫాలో తనూ ఆసీనురాలయింది. నీరజ అత్తగారు అనసూయమ్మను, పరిశీలనగా చూసాడు. ఇక్కడికి రావడానికి ముందు, తను కలిసిన వాచ్‌మన్, ఈవిడి గురించి సూచనప్రాయంగా చెప్పిన విషయాలు కరెక్టే అయ్యుంటా యనిపించింది. ఆవిడని చూస్తే... ఎదురుగా సోఫాలో కాళ్ళూపుకుంటూ కూర్చుంది. సరిగానే ఉన్న పైటను

పదే పదే సర్దుకొంటోంది.. కోడలు హత్యకేసులో అరెస్టై జైల్లో ఉందన్న బాధ ఆమె ముఖంలో గోచరించలేదు. నుదుటి త్రిచూర్ణం బొట్టు, మెళ్లో రుద్రాక్షమాల ఉన్నా, వయసు తక్కువగా కన్పించాలన్న తగని తాపత్రయం వస్త్రధారణలోను ప్రవర్తనలోనూ కన్పడుతోంది. మెళ్ళోని రుద్రాక్షమాల చూసినా, మంచి అభిప్రాయం కలగటం లేదు. తన అందంతోను, అంగసౌష్టవంతోను, తనకన్నా చిన్న వయసువాడినైనా సరే, ఏమగాడినైనా, ఆకర్షించగలనన్న ధీమా ఉన్న మనిషిలా అనిపిస్తోంది.

"బెంగుళూరు నుంచి వచ్చాను. నన్ను మీరెప్పుడూ చూసి ఉండరు. నా పేరు చక్రధర్. నీరజతో ఈమధ్యనే పరిచయం అయ్యింది" అన్నాడు. అంతే రాయి తగిలింది. "చక్రధరా... అంటే చక్రీ ఫైనాన్స్... హైద్రాబాద్ బ్రాంచ్... కొంచెం సందిగ్ధంగానే అడిగింది. 'ఔను' అన్నట్లు తలూపేసరికి హుషారుగా అడిగింది. "ఇంకా కొంచెం డబ్బు కావాలని నీరజ చెప్పలేదా" అని.

"ఆ! ఆ! వచ్చేవారానికి ఏర్పాటు చేస్తానని చెప్పానే.." అంటూ ఆవిడి కళ్ళలోకి, ఎత్తైన ఎదవైపు సూటిగా చూడసాగేడు ప్రవీణ్ ధైర్యంగా. దాంతో చిత్తయిపోయింది. "మరి... మరి... నీరజ ఇంకా ఏమైనా చెప్పిందా... స్థానభ్రంశం అయిన పైటను సర్దుకోకుండా గోముగా అడిగింది.

"ఆ! ఆ! నాకన్నా అందమయింది మా అత్తగారు. కావాలంటే...." ఆవిడి వాలకం చూస్తూ మొండిధైర్యం వచ్చేసి అనేసాడు.

"సరే... చూద్దాం..." అంటూ ఇంకా వయ్యారాలకు పోయింది. అంతలోనే.." మరి నీకు నీరజ సంగతి తెలియలేదా..." అని సందిగ్ధంగా అడిగింది. 'ఏమిటన్నట్లు' ప్రశ్నార్థకంగా ముఖం పెట్టేసరికి అన్నీ అప్పుడికి చెప్పుకొన్నట్లుగా పూస గుచ్చినట్లు చెప్పింది విలాసంగా కాళ్ళూపూ కొంటూ నీరజ. దినకర్‌ని హత్య చేసి ప్రస్తుతం జైల్లో ఉన్నట్లు చెప్పింది. ప్రవీణ్ ఆమెని ఎంతసేపు మాటల్లో పెట్టినా, కొత్త సంగతులేమీ తెలియలేదు. ఆవిడ శీలం మంచిది కాదు. వీలయినప్పుడల్లా నీరజ సన్నిహితుల్లో కొందర్ని ఎంచుకొని తనూపొందు పెట్టుకొంటుందని తప్ప. ఇంతలో ఎవరో కాలింగు బెల్ నొక్కేసరికి పైట నిండుగా కప్పుకొని తలుపు తీయడానికి

వెళ్ళింది. వచ్చిందెవరో బంధువులు. పరామర్శ చేయడానికి వచ్చినట్లుంది. అవకాశం దొరికింది కదా, అని ప్రవీణ్ 'మళ్ళీ వస్తానని' చెప్పి వెంటనే బయటపడ్డాడు. 'అమ్మయ్య నా శీలం కాపాడుకొన్నాన్రా బాబూ' అనుకొంటూ.

వారం రోజులు గడిచిపోయాయి. కమీషనర్ కాంతారావుగారు 'ఏమిటీ ఇంకా ప్రవీణ్ రాలేదేమిటా' అని అనుకొంటుండగానే సి.ఐ.డి. ఇన్‌స్పెక్టర్ ప్రవీణ్ లోపలికి వచ్చి సెల్యూట్ కొట్టేడు. ముఖం వెలిగిపోతోంది. 'మనోడేదో కొత్త కోణం పట్టేసినట్టుందని,' తృప్తిగా అనుకొంటూ, కూర్చోమని సైగ చేసాడు.

"సార్ నీరజ నిర్దోషి సార్" కూర్చుంటూ బాంబు పేల్చాడు ప్రవీణ్.

"వ్వాట్ నాన్సెన్స్" అని ముందు గదమాయించినా, తర్వాత అతని పరిశోధనా వివరాలు శ్రద్ధగా ఆలకించారు కమీషనరుగారు.

ఆ రోజు సాయంత్రమే టీవీ, పత్రికా ప్రతినిధుల సమావేశం ఏర్పాటు చేసారు కమీషనర్ కాంతారావుగారు.

"మిత్రులారా! ఫైనాన్స్ వ్యాపారి దినకర్ హత్య గురించి జరిగిన తదుపరి పరిశోధనా వివరాలు చెప్పటానికి, ఈ సమావేశం ఏర్పాటు చేసాం! మీలో కొంతమంది వ్రాస్తూనే వున్నారుగా ఈ వారం రోజులనుంచీ... ఇంకా వీడని చిక్కుముళ్ళు.. శేషప్రశ్నలూ" అని ఇప్పుడంతా క్లియరైపోయింది. అయితే ముందనుకున్నట్లుగా దినకర్‌ని హత్య చేసింది నీరజకాదు. వివరాలు ఈ కేసు పరిశోధించి, పరిష్కరించిన, మా సి.ఐ.డి ఇనస్పెక్టర్ ప్రవీణ్ చెప్తాడు" అనిఉపోద్ఘాతం మాత్రం పలికి కమీషనర్ గారు కూర్చునేసరికి ప్రవీణ్ కొయ్యబారిపోయాడు. అంతా కమీషనర్‌గారే చెప్తారనుకొన్నాడు గాని ఆ "ప్రివిలేజ్" తనకిస్తారనుకోలేదు. కాని అంతలోనే తేరుకొని, ఇలా చెప్పసాగేడు.

"నీరజ నేరం ఒప్పుకొంది కాబట్టి ప్రాథమిక సాక్ష్యాధారాలు అలానే ఉన్నాయి కాబట్టి మా డిపార్టుమెంటులో అంతా ఆమే ఈ హత్య చేసుంటుందని అనుకొన్నాం. అన్నాం. అయితే కమీషనరుగారుఒక్కరే ఏదో "మిస్సింగు లింకు" ఉందని గాఢంగా నమ్మి, ఇంకా పరిశోధన సాగించమని ఆదేశాలిచ్చారు. నేనొక్కణ్ణే కాకుండా, మా

డిపార్టుమెంటు అంతా కలిసి కృషి చేసాం. నిజాన్ని కనుక్కొన్నాం. అని కాసేపాగాడు. అంతా తనే చేసినా, బాస్‌కి డిపార్టుమెంటులోని ఇతరులకి, 'కొంత గొప్ప' ఆపాదించాలన్న పోలీస్ ప్రాథమిక సూత్రం తెలుసున్నవాడు కాబట్టి...

అసలు సంగతికి రమ్మన్నట్లు అసహనంగా చూస్తున్న సమావేశంలోని వాళ్ళను, చిరునవ్వుతో చూస్తూ తన కథనం కొనసాగించేడు ప్రవీణ్.

"అందరూ వదిలేసిన అనసూయమ్మగారిని నేను ఓ పట్టుపట్టాను. అంటే ఆవిడి గురించి బాగా లోతుగా పరిశోధించాను. హత్య జరిగిన రోజు, ఇంట్లో లేనని అవిడ చెప్పిన మాట అబద్ధమని కొద్దిగా వాకబు చేస్తేనే రూఢీ అయిపోయింది. పేరు 'అనసూయ' అయినా పతివ్రత కాదని తెలిసింది. పెళ్ళయిన మూడు సంవత్సరాలకే భర్త ఒక కొడుకునిచ్చి చచ్చిపోయాడు. ఆ చావుకి కారణాల గురించి ఇప్పటికీ ఆ గ్రామంలో రకరకాలుగా చెప్పుకొంటారు. అదంతా అప్రస్తుతమనుకోండి. భర్త పోయిన తర్వాత అనసూయమ్మ అక్రమ సంబంధాలు పెట్టుకొంటూనే వచ్చింది. అలాంటి తల్లి పెంపకంలో పెరిగిన 'వెంకట్' సహజంగానే జులాయిగా తయారయ్యాడు....

"మంచిసంబంధం చూసి, బాగా కట్నం తీసుకొని, నీరజతో పెళ్ళి చేసింది తల్లి. ఇతగాడు కంప్యూటర్ ఇంజనీర్‌గా హైద్రాబాద్‌లో ఉద్యోగం చేస్తున్నాడని త్వరలో విదేశాలకి పెద్ద ఉద్యోగం చేయడానికి వెళ్ళిపోబోతున్నాడని పెళ్ళికూతుర్ని, ఆమె తరపు వాళ్ళని నమ్మించింది.

పాపం నీరజ నిజంగా ముగ్ధరాలు. తన స్నేహితురాళ్ళలో చాలామందికి ఫారిన్ సంబంధాలే వచ్చాయి కాబట్టి, తను కూడా ఏమైనా సరే 'ఫారిన్ సంబంధమే' చేసుకోవాలని, జీవితమంతా చక్కగా మొగుడితో ఫారిన్‌లోనే గడపాలని గాఢంగా కోరుకొన్న అమాయకురాలు. ఈ సంబంధానికి మనసారా అంగీకరించి, ఫారిన్ జీవితం గురించి కలలు గంటూ మెళ్ళో మూడుముళ్ళూ వేయించుకొంది వెంకట్ చేత. పెళ్ళయి హైద్రాబాద్‌లో కాపురం పెట్టిన తర్వాత కూడా, ఈ 'వెంకట్' పదోతరగతి ఫెయిలైన ప్రబుద్ధుడని, తెలుసుకోలేకపోయింది. మరి, తెలుగు మీడియంలో బి.కాం. పాసయిన భార్య నీరజతో, ఇంగ్లీషు గడగడా

మాట్లాడేసేవాడు. సింగపూర్‌లో ఉద్యోగం వచ్చేస్తుంది. ఇదిగో వెళ్ళిపోదాం, అదిగో, విమానమెక్కేద్దాం అన్న కబుర్లతోనే ఒక సంవత్సరం గడిచిపోయింది. ఈలోగా కట్నం డబ్బులూ ఖర్చయిపోయాయి! సింగపూర్ పంపించడానికి "కన్సల్టెంటు" డబ్బు అడుగుతున్నాడని చెప్తే నగలన్నీ కుదువ పెట్టి కొంత సొమ్ము మొగుడి చేతిలో పెట్టింది మనస్ఫూర్తిగా. ఇంకా ఇవ్వకపోతే, ఇంతవరకు పెట్టిన భారీ ఖర్చు వృధా అయిపోతుందని, చెప్తే, అమాయకంగా నమ్మేసి, పుట్టింటికి వెళ్ళి తండ్రితో దెబ్బలాడి ఎంతో సొమ్ము తెచ్చింది. ఇంకా సరిపోలేదంటే చిన్నాన్నని, మావయ్యని బ్రతిమాలి కొంత సొమ్ము పుట్టించింది. ఉద్యోగం వచ్చింది, వీసాకి, విమానం టిక్కెట్టుకి కావాలంటే పుట్టింటి తాలూకు బంధువు లెందరి దగ్గరో అప్పులు తెచ్చి మొగుడి చేతిలో ధారబోసింది. ఇంక సింగపూర్ వెళ్తున్నాను, ఇంకో నెలలో వచ్చి నిన్ను తీసుకెళ్తాను. అక్కడ ఉద్యోగం చేయటానికి సిద్ధపడి రావాలి సుమా" అంటే మురిసిపోయి కన్నీళ్ళతో భర్తకి వీడ్కోలు పలికింది.

"కన్సల్టెంటు మోసం చేసాడు నీరూ. వాడిచ్చిన నియామకపత్రాలు ఫోర్జరీవని చెప్పి ఏయిర్ ఫోర్టులో ఆపేసారు. నీకు ఎలా మొఖం చూపించను", అని ఓ వారం తర్వాత, వెంకట్ ఫోను చేస్తే హతాశురాలైపోయింది. కాని భర్తని అనుమానించలేదు. నిందించలేదు. తిరిగి హైద్రాబాద్ వచ్చేస్తున్నాని 'ఇంకో నెల తర్వాత అమెరికా వెళ్ళే ఛాన్సు రాబోతుందని' వెంకట్, మళ్ళీ ఫోను చేసి చెప్తే నమ్మేసింది. కాని 'ఒక నెల మాత్రానికి ఇక్కడికి రావట మెందుకు, సింగపూర్ ఉద్యోగం కేన్సిల్ అయిపోయిందని అందరికీ చెప్పుకొని అవమానం పొందటం ఎందుకు? అక్కడే మద్రాసులోనే ఉండి ముమ్మరంగా అమెరికా ఉద్యోగానికి ప్రయత్నాలు చేయమని నీరజ మొగుడికి చెప్పింది సింగపూర్ ఉద్యోగం గురించి ఎందరికో గొప్పలు చెప్పుకొంది. అలా చెప్పుకొని అప్పులూ చేసింది. అందుకే హైద్రాబాద్ రావద్దని మద్రాస్‌లోనే ఉండిపొమ్మని భర్తని బలవంతం చేసింది నీరజ....

"......... మద్రాసులోనే ఉండిపొమ్మన్న, నీరజ ప్రపోజల్ వెంకట్‌కు బాగా నచ్చింది. ఎందుకంటే నీరజతో పెళ్ళి కాకముందే వెంకట్ మద్రాసులో ఉండే ఒక జూనియర్ సినిమా ఆర్టిస్టుని ఎంతో ఇష్టపడి పెళ్ళి చేసుకొన్నాడు. కట్నానికి

ఆశపడి నీరజను చేసుకొన్నా మొదటి పెళ్ళామంటేనే ఇష్టం – అందుకే మద్రాసులో నీరజ కష్టపడి పంపే డబ్బుతో జల్సా చేస్తూ అప్పుడప్పుడు రహస్యంగా హైద్రాబాద్ వస్తూ నీరజతోనూ కాపురం చేయటం అతనికీ సరదాగానే ఉంది. నీరజ కూడా తన భేషజం కోసం భర్తను మద్రాసులో అజ్ఞాతవాసం గడిపేలా చేస్తున్నానని బాధపడేదే గాని భర్తను ఎప్పుడూ అనుమానించలేదు...”

“ఇలా జరుగుతుండగా, నీరజకు ఆర్థికంగా కష్టాలు పెరిగిపోయాయి. మద్రాసులో మొగుడి ఖర్చు, హైద్రాబాద్‌లో అత్తగారిని పోషించవలసినందువలన, ఇంకా అప్పులు చేయాల్సొచ్చింది. వత్తిడి ఎక్కువ అయిపోయి అప్పుల్ని తీర్చడానికి, పాత అప్పులపై అధిక వడ్డీలు చెల్లించడానికి ఇంకా అప్పుల ఊబిలో దిగిపోసాగింది. అలాంటి సమయంలో అత్త అనుసూయమ్మ, తన పాత ప్రియుడు చంచర్రావు అనేవాడిని, ఇంటికి రప్పించి నీరజకు మత్తు మందిచ్చి ‘రేప్’ చేయించింది. అన్నట్టు అనసూయమ్మకు ఫొటోలు తీసే ప్రావీణ్యం ఉంది. వాడు నీరజతో చేస్తున్న శృంగారాన్ని ఫొటోలు తీసింది. ఆ ఫొటోలు చూపించి, కొడుక్కే కాదు అందరికీ చూపించేస్తానని, “బ్లాక్‌మెయిల్” చేసింది కోడలిని. అలా నీరజను భయపెట్టి “తనదారిలోకి” తెచ్చుకొంది! ఎవరెవరితోనో అక్రమ సంబంధాలు పెట్టుకొని డబ్బు సంపాదించవలసిన దుర్గతి పట్టించింది! ఇదంతా, మొగుడి ప్రోద్బలంతోనే జరిగిందని నీరజకు తెలియదు పాపం! అత్తగారి ఉచ్చులోంచి అప్పుల ఊబిలోంచి బయటికి రాలేక, ఎంతో కుమిలిపోతూ కూడా, కేవలం భర్త భవిష్యత్తు కోసం, ఒక ‘తప్పు’ తర్వాత ఇంకోటి చేసింది.....

“అయితే ఇక్కడో సంగతి చెప్పుకోవాలి. కోడలి అక్రమ సంబంధాలకి, అక్రమ సంపాదనకి సూత్రధారి అయిన అనసూయమ్మ నిరభ్యంతరంగా, ఆ యువకుల్లో తనకు నచ్చిన వాళ్ళతో తనూ అక్రమ సంబంధం పెట్టుకొని మోజు తీర్చుకొనేది! అంతేకాదు నీరజతో శృంగారం చేస్తున్న కొంతమంది ఫొటోలు ఆ సమయంలో తీసి తన ప్రధాన ప్రియుడు చంచర్రావు ద్వారా “బ్లేక్‌మైల్ గేమ్” కూడా ఆడి డబ్బు సంపాదించేది”

“.....ఈవిడి లేటెస్ట్ విక్టిమ్ మన ఫైనాన్సు వ్యాపారి దినకర్. నీరజతో అక్రమ సంబంధాన్ని తనే ఏర్పాటు చేసినా, అనసూయమ్మకూ అతనంటే బాగా మోజు

కలిగింది – అయితే దినకర్ మాత్రం నిష్కర్షగా.... "ఛీ, అదేం బుద్ధే ముసల్దానా" చీదరించుకొనేసరికి అనసూయమ్మ అతనిపై చాలా కక్ష పెంచుకొంది.....

"నీరజతో ఫోను చేయించి దినకర్‌ని జూన్ 20 నాడు ఫ్లాట్ నెంబరు 420కి డబ్బుతో సహా రప్పించింది. ఫొటోలు నెగిటివ్‌తో సహా ఇచ్చేస్తామని చెప్తే గొడవ వదుల్చుకొందామని, దినకర్ మూడు లక్షలు తీసుకొని వచ్చేడు. అతనికిచ్చిన కూల్‌డ్రింకులో అనసూయమ్మ ఏదో 'విషం' కలిపిన సంగతి నీరజకు ముందుగా తెలియదు. అది తాగి దినకర్ స్పృహతప్పి పడిపోతే చాలా కంగారు పడిపోయి బెడ్‌రూమ్‌లో ఉపచారాలు చేయసాగింది. ఆ సమయంలో చెప్పా చెయ్యకుండా ఇంట్లోకి ఊడిపడిన భర్త వెంకట్‌ని చూసి ఇంకా కంగారుపడిపోయింది. ఇష్టం లేకపోయినా అక్రమసంబంధాలు పెట్టుకొన్నందుకు క్షమించ మని భర్త కాళ్ళమీది పడిపోయి కన్నీళ్ళతో కడిగింది. కాసేపు కొంత డ్రామా ఆడి, భర్త వెంకట్, తనను మనస్ఫూర్తిగా క్షమించేసినట్టు, పోజు కొట్టేసరికి అమాయకురాలు నీరజకు భర్తమీద ప్రేమ ఇంకా పొంగిపోయింది. పెరిగిపోయింది. "ఈయన కోసం ఏమైనా చేయాలి' అని మళ్ళీ నిశ్చయించేసుకుంది.

"ఆ సమయంలో పానకంలో పుడకలా దినకర్ తిరిగి స్పృహలోకి రావటం, పరిస్థితిని కొంత అర్థం చేసుకొని పారిపోవటానికి ప్రయత్నించటం, అతన్ని ఆపే పెనుగులాటలో వెంకట్ దినకర్ పొట్టలో పగిలిన సీసాతో పొడవటం దినకర్ చచ్చిపోవటం, చాలావేగంగా నీరజ కళ్ళముందే జరిగింది"

"నీరజకు వెంకట్ తల్లి అనుసూయతో కలిసి ఆడమన్నట్లుగా ఆడటం తప్ప వేరే గత్యంతరం లేకపోయింది. వెంకట్ దినకర్‌ని చంపుతున్నప్పుడు ఫొటో తీసానని, తను చెప్పినట్టు చేయకపోతే, కొడుకూ, కోడలూ అని చూడకుండా పోలీసులకి అప్పచెప్పుతానని బెదిరిస్తే వెంకట్ తల్లి కాళ్ళు పట్టుకొన్నాడు! ఇద్దరూ కలిసి నాటకమాడుతున్నారని, తెలుసుకోలేక నీరజ అనసూయమ్మ ఏం చేయమంటే అది చేసింది. వాచ్‌మెన్‌తో కత్తులు ఏసిడ్ తెప్పించింది. అయితే శవాన్ని ఖండాలు కోసే పని భర్త చేస్తూంటే చూడలేక పక్కగదిలోకి వెళ్ళిపోయింది. అయితే పేకింగులోమాత్రం అత్తగారికి సాయం చేసింది. దినకర్ స్కూటరుని ఎవరి ద్వారానో, సనత్‌నగర్‌లో వదిలేసి రమ్మని పంపించింది. దినకర్ తెచ్చి

ఇచ్చిన మూడు లక్షల సొమ్ము భద్రంగా తీసుకొని భర్త వెళ్ళిపోతూంటే గుడ్లప్పగించుకొని చూస్తూండి పోయింది.....

"శవం ముక్కల మూటలను ఎక్కడెక్కడో వదిలేసి వచ్చేస్తే అంతా మర్చిపోవచ్చు, హైద్రాబాద్ వదిలిపెట్టి భర్త దగ్గరకు వెళ్ళిపోవచ్చునని ఆశించింది. కాని పోలీస్ డిపార్టుమెంటు సమర్థత వల్ల హత్య జరిగిన సంగతి వెల్లడైపోయింది. ఇక చేసేదేం లేదు అనుకొని, – నేరం నెత్తిమీద వేసుకొని భర్తని ఎలాగైనా కాపాడాలని దృఢంగా నిశ్చయించుకొంది...

"దినకర్ స్కూటరు బేగ్‌లో ఎప్పుడో నీరజ ఇచ్చిన సెల్‌ఫోను మర్చిపోయిన సంగతి వాళ్ళకు తెలియదు. తెలిస్తే తీసివేసేవారు. ఆ సెల్‌ఫోను లేకపోతే మావాళ్ళు నీరజింటికి వెళ్ళేవాళ్ళు కాదు. శవం ఖండాల్ని చూసేవాళ్ళు కాదు. ఇంకో సంగతి! దినకర్ హత్య అవుతున్నప్పుడు ఎందుకు తీసిందోగాని అనసూయమ్మ ఫొటోలు తీసిన మాట నిజమే. ఆ నెగిటివ్‌లు ఇప్పుడు మా ఆధీనంలోనే ఉన్నాయి. శవాన్ని ఖండాలుగా కోయడానికి ఉపయోగించబడిన కత్తులపై వెంకట్ వేలిముద్రలు సరిపోల్చాము.

"నీరజ చివర్లోనైనా, తన భ్రమల్లోంచి, బయటపడి మాకు నిజాలు చెప్పినందువల్లనే అసలు దోషిని పట్టుకోగలిగాం. వెంకట్ అసలు పదోతరగతి కూడా పాసవ్వలేదని చెప్పిన తర్వాత, మొదటిపెళ్ళాంతో మద్రాసులో కులుకుతున్నాడిన్నాళ్ళూ అని ఫొటోలతో సహా చూపించేసరికి, నీరజకు కళ్ళు తెరుచుకున్నాయి. ఇంతలా మోసం చేసిన దౌర్భాగ్యుడి కోసమేనా తను అతని నేరం నెత్తిమీద వేసుకొన్నది అని అర్థమయిన తర్వాత మాతో బాగా సహకరించింది. అలాగే వెంకట్, అనసూయమ్మ, చంచలరావ్, మా పద్ధతిలో పలక రించేసరికి అంతా ఒప్పేసుకొన్నారు. వాళ్ళు ముగ్గురినీ అరెస్టు చేసాం. నీరజపై కేసు విరమించుకొంటున్నాం. అయితే ఆవిడిప్పుడు హాజరు పరచమని, ఇంటర్వ్యూ చేస్తామని అడగకండి. భర్త అసలు రూపం తెలుసుకొన్న షాక్‌లోంచి ఇంకా బయటపడలేదు. కాబట్టి నీరజ నిర్దోషి. అని తన సుదీర్ఘ కథనాన్ని పూర్తి చేసాడు సి.ఐ.డి ఇన్‌స్పెక్టర్ ప్రవీణ్. "పాపం నీరజ!" అనుకొన్నారు విన్నవాళ్ళంతా

(ఇటీవల జరిగిన ఒక యదార్థ సంఘటనకు భిన్నరూపం ఉండవచ్చున్న ఊహాచిత్రమే ఈ కథ. నిజజీవితంలోని ఏ వ్యక్తికి ఈ కథలోని సంఘటనలు ఆపాదించరాదు!)

(రచన మాసపత్రికలో ప్రచురితం)

# అక్షయ తృతీయ

"ఏమిటి చారీ, ఈ రోజు ఇంత జనం వచ్చేరు? – ఎంత పెళ్ళిళ్ళ సీజన్ ఐతే మాత్రం – ఇంత జనమా! ఏదో చిరంజీవి సినిమా మొదటిరోజునే మొదటి ఆటకి ఎగబడినట్లు ఏమిటీ విపరీతం? పైగా ఈ టోకెన్ల గొడవేమిటి?... నాకేం అర్థం కావట్లేదు బాబూ... అంటూ తన సందేహాల్ని సంధించాడు రామాచారి జ్యూయలర్సు షాపు యజమాని తన అనుంగు మిత్రుడు అయిన రామాచారిపై చంద్రం. దుకాణం నిండా కిక్కిరిసి ఉన్న స్త్రీ పురుష జనాన్ని, బయట కూడా చిటపటలాడిస్తున్న ఎండని ఓర్చుకొంటూ, భారీ పట్టుచీరలలోను, ఫుల్ సూట్లలోను ఇంకా వివిధ రకాల వేష ధారణులలో, చాంతాండంతటి క్యూ కట్టి వేచి ఉన్న అసంఖ్యాకులను వింతగా చూస్తూ.

"వాడెవడో కొత్త గన్‌మాన్ – టోకెన్ లేకపోతే షాపులోనికి ప్రవేశం లేదని అడ్డగించాడసలు! ఈలోగా మీ పాత వాచ్‌మన్ నన్ను చూసి గుర్తు పట్టి నీ దగ్గరికి తీసుకొచ్చాడు పాపం;" అంటూ ఈ టోకెన్ల గొడవేమిటి మహానుభావా?" అడుగుతూనే తను తెచ్చిన మందుసీసా మిత్రుడి కందించాడు చంద్రం.

ఆ క్షణంలో వ్యాపారరీత్యా తానెంత బిజీగా ఉన్నా ప్రత్యేకంగా తనకోసం, దీర్ఘకాలంగా పీడిస్తున్న చర్మవ్యాధి నివారణకై ఊర్నించి ప్రత్యేకంగా మందు తీసుకొచ్చిన బాల్యమిత్రుడికి కొంత సమయం కేటాయించటం కనీస ధర్మంగా భావించిన రామాచారి చంద్రాన్ని భుజం మీద చేయి వేసి మూలనున్న చిన్న ఏంటీ రూములోకి తీసుకొని వెళ్లి చిన్న గొంతుతో అతని సందేహాల నివృత్తి గావించడానికి ఉపక్రమించాడు.

"ఓర్నీ! నీకు నిజంగా తెలియదా. ఈ రోజు మే 7 – తెలుగు పంచాగం ప్రకారం వైశాఖమాసంలో మూడోరోజు లేదా 'తదియ' నాడు అక్షయ తృతీయ అన్న పండుగ జరుపుకోవటం అనాదిగా వస్తున్న ఆచారం. అయితే అది ఈమధ్యకాలం వరకూ తమిళనాడులో మినహా ఇతర రాష్ట్రాలలో అంత ప్రాముఖ్యత

ఉండేది కాదు. ఉత్తరాదిన "ధనతేరాస్" పండుగ రోజులోలా, ఈ అక్షయ తృతీయనాడు ఏది కొన్నా శుభప్రదమని ముఖ్యంగా బంగారం కొంటే అది రెట్టింపవుతుందన్న నమ్మకాన్ని ఇటీవలి కాలంలో హైద్రాబాద్‌లోని నగల వర్తకులు బాగా ప్రచారం చేశారు. మీడియా తోడ్పాటు లభించింది.. గత నాలుగైదు సంవత్సరాలుగా ఈ రోజు ఏది కొన్నా ముఖ్యంగా సువర్ణం కొంటే, ఎంతో శుభప్రదమని, గతంనుంచీ ఉన్న విశ్వాసాన్ని మరింతగా జనంలో పెంచడానికి, ప్రణాళికాబద్ధంగా, పకడ్బందీగా కృషి జరిగింది. ఈ పండగకి మూలంగా, శ్రీకృష్ణుడు ద్రౌపది, పరశురాముడు గంగాదేవి సాక్షాత్తు శ్రీమహాలక్ష్మి పాత్రలుగా గల పురాణ గాథలకు, అత్యంత ప్రచారం సాగింది. "ఈ రోజు, నగలు కొనుగోలుకి, అప్పులు ఉదారంగా ఇస్తామోచ్" అంటూ బ్యాంకులూ ముందుకు రాసాగేయి. దాంతో మనవాళ్ళకి కూడా 'ఈ పిచ్చి' బాగా పట్టుకొంది....

కొంచెం గుక్క తిప్పుకొని.... "సారీ పిచ్చి అనకూడదులే... ఇదో మతపరమైన విశ్వాసం. ఈ రోజున ఏది కొన్నా శుభప్రదం. అందునా సువర్ణం కొంటే, ఏడాది పొడుగునా రెట్టింపు బంగారం, మనల్ని వెతుక్కొంటూ వస్తుందన్న విశ్వాసం. దీనికి పురాణగాథల్లో దృష్టాంతాలున్నాయి. మరి దీన్ని నగల వర్తకులు 'కేష్' చేసుకోవాలి కదా! ఇక టోకెన్ల సంగతంటావా... ప్రజల్లో వున్న "వేలం వెర్రి'ని మరింత పెంచే చిట్కా. 'అక్షయ తృతీయ' నాటి రోజుకే పవిత్ర అమ్మకాలు" పరిమితం చేస్తే ఏమంత లాభం? ఆ ఒక్కరోజునే అందరూ వచ్చి కావలసిన అభరణాన్ని సెలెక్టు చేసుకొనే పద్ధతిలో పరిమిత ప్రయోజనాలే వుంటాయి, నగల వర్తకులకి. అందుకని, పండగకు ముందు పదిహేనురోజుల్లో ఏదో ఒకరోజు తీరిగ్గా నగల దుకాణానికి వచ్చి తమకు కావలసిన వస్తువును ఎంచుకొని, నామమాత్రపు సొమ్ము 'బయానా'గా ఇచ్చి ప్రతిగా, 'టోకెన్' తీసుకొని 'అక్షర తృతీయ'నాడు దుకాణానికి మళ్ళీ వచ్చి పూర్తిసొమ్ము చెల్లించి, తమ వస్తువుని ఇంటికి తీసుకొని వెళ్ళినా "పవిత్ర ఫలితం" పూర్తిగా దక్కుతుందని, కొత్త థియరీకి తెర లేపాం. ఈ పద్ధతిలో బ్యాంకు రుణాలు పొందటమూ సులభమైంది. పైగా ముందుగా, ఈవిధంగా అడ్వాన్సు బుకింగ్ చేసుకొని 'టోకెన్లు' పొందినవారికే, పండగనాడు, దుకాణంలోకి ప్రవేశం అని, ఇతరులకు గ్యారంటీ లేదని ప్రచారం

అదరగొట్టేశాం ఈ సంవత్సరం. దాని ఫలితమే నువ్వు ఈ రోజు చూస్తున్న ఈ సినిమా టైపు రష్. సరే టోకెన్లు ఉన్నవాళ్ళు ఎలాగూ తమ నగలను, ముందే సెలక్టు చేసేసుకొన్నారు కాబట్టి ఎక్కువ సమయం తీసుకోరు. వాళ్ళు వెళ్ళిపోయిన తర్వాత టోకెన్లు లేనివాళ్ళూ వచ్చి కావలసినవి తొందరగా కొనుక్కొంటారు! ఉభయతారక మంత్రమన్నమాట. సరే మిత్రమా నువ్వు కూడా ఎంతో కొంత బంగారం కొనుక్కొని, ఇంటికి ఐశ్వర్యాన్ని, సుఖసంతోషాల్ని పట్టుకొని వెళ్ళు. పండగనాడు 'అరువు' వుండదని నీకు తెలుసు కదా" అని లౌక్యంగా పలికాడు రామాచారి.

'కొనుక్కుంటే బానే ఉంటుంది గాని డబ్బు లేదు' కదా అనుకొంటూ భారంగా బయటికి నడిచేడు చంద్రం.. జనాన్ని తప్పించుకొంటూ!

చంద్రానికి వీడ్కోలు చెప్పిన తర్వాత మళ్ళీ అమ్మకాల కౌంటరు దగ్గరకు చేరిన రామాచారి, అంతలోనే జనాన్ని తప్పిస్తూ, ఒక ఖరీదైన జంటను 'వాచ్‌మన్' నేరుగా తన దగ్గరికే తీసుకొని వస్తూన్న వైనాన్ని గమనించి, వెంటనే హడావుడిగా వాళ్ళవైపు నడిచాడు. కంగారులో కాళ్ళకడ్డం పడుతున్న పంచెను సరిజేసుకోవడానికి అవస్థ పడుతూనే "రండిసార్... దయచేయండి..." అంటూ, తన పంట పండించబోతున్న ఆ జంటని వినయంగా, జనానికి దూరంగా లోపలున్న ఏసీ గదిలోకి తీసుకొని వెళ్ళాడు. – అది, వి.ఐ.పీ. రూమ్ – అప్పుడింకెవ్వరూ లేరు – వజ్రాల నగల కొనుగోలుదారులకే పరిమితమైన స్పెషల్ రూమ్ అన్నమాట అది.

వచ్చిన జంట సోఫాలో దర్జాగా కూర్చున్న పిదప, ఓ పది డబ్బాలు తెరిచి, ధగధగలాడు తున్న వజ్రాలు సెట్లు వాళ్ళ ముందు పరిచి ప్రదర్శించేడు. వాళ్ళిద్దరు, నగలను పరిశీలించే పనిలో నిమగ్నమయ్యాక, రామాచారి తన కస్టమర్లను పరిశీలించసాగాడు.

'మగాయన' పట్టు లాల్చీ, గ్లాస్కో పంచెతో, లావుపాటి మెడలో సన్నని పులిగోరుతో, చేతులకు బ్రేస్‌లెట్లతో, అన్నివేళ్ళకూ ఉంగరాలతో ధగధగలాడిపోతున్నాడు. జుట్టుకి రంగు వేసినా, వయసు యాభై పైనే' అని

తెలిసిపోతున్నట్లున్నాడు.

అయితే, కూడా వచ్చినావిడ మాత్రం, మంచి బింకంగా, పొంకంగా ఆకర్షణీయంగా ఉంది. వంపుసొంపులు, అవయవ సౌష్టవం ఆకట్టుకొనే రీతిలోనే ఉన్నాయి. 'వయసు పాతికలోపే ఉండాలి' అనుకొంటూ, అసంకల్పితంగా పెదాలు తడుపుకున్నాడు రామాచారి. అంతలోనే సర్దుకున్నాడు. కాని దొంగచూపులు చాలించలేకపోయేడు!

వంటిమీద ఏడువారాల నగలు... వగలు పోతున్న తీరు 'ఆయన'మీద కావాలని పదే పదే మెత్తగా వాలిపోతున్న వైనం – ఇవీన్న గమనించి – 'అఫీషియల్ కాదురా బాబూ – పొద్దున్న ఆయనే చెప్పాడు కదా ఫోన్‌లో సెట్ కొనాల్సింది 'సెటప్'కని అనుకొన్న రామాచారి, ఉదయం తమ షాపుకి వచ్చిన వెంటనే 'ఆయనతో ఫోన్‌లో జరిగిన సంభాషణ జ్ఞాపకం చేసుకొన్నాడు.

"ఓయ్! ఇదిగో సేటూ – నా పేరు సింహాచలం – 'ఆంధ్రా' నుంచొచ్చానులే – వైస్రాయి హోటల్లో నేను మా 'ఆడాళ్ళతో' అంటే ఒక్కతేలే – అసలాడోళ్ళు ఊళ్ళోనే ఉంది. ఇది 'సెటప్' అనుకో పర్మనెంటుగా మనకిందే రెండేళ్ళనుంచి ఉంది. మంచిది గాని మొండిది. ఇప్పుడైతే బాత్రూంలో పాడుతూ, ఆడుతూ జలకాలాడుతోందిలే అందుకే కదా ఇంత ఫ్రీగా మాట్లాడుతున్నానన్నమాట" ఈ ధోరణి విన్న రామాచారి రాంగ్ నంబర్ అనబోగా... 'ఓ సేటూ, వింటున్నావా ఈ రోజు మా మొండిదాని పుట్టినరోజు – ఏమైనా సరే, ఈసారి అంటే ఈ పుట్టిన రోజుకి, వజ్రాల సెట్ కావాలని మారాం చేస్తోంది – పైగా 'వేల్యూ'కూడా కోట్ చేసేసింది – ఖచ్చితంగా పదిలక్షల నగ కావాలని 'ఇండెంటు' పెట్టిందయ్యా దాని తస్సాదియ్యా..." కాసేపు గుక్క తిప్పుకోడానికి ఆగేడు సింహాచలం.

"ఓయ్ సేటూ... ఫోన్‌లోనే, ఉన్నావు కదా... ఎంతవరకు చెప్పేను? ఆ! పదిలక్షల 'ఇండెంట్'... మనలో మాట, దాని మాట కాదనే సత్తా మనకి లేదు. కాదంటే, మన గతి అధోగతే! అటు తిరిగి పడుకొంటుందంతే. మన సంసారం తొమ్మిదీ ఆరు (9, 6) అయిపోతుందన్న మాట! ఇప్పట్లా ఆరూ మూడు (6,3)లా కొనసాగాలంటే అది అడిగింది తీర్చాల్సిందే!... వింటున్నావు కదా – మరి మన

దగ్గరిప్పుడు 'అయిదు లక్షలే', 'లెక్క' ఉందన్నమాట. ఉన్నదాంతోనే పని కానిచ్చేయాలి కదా. అంటే నువ్వు నాకు ఐదు లక్షల నగ అమ్మి పదిలక్షలకి బిల్లు ఇయ్యాలన్నమాట. నాకు ఆవిధంగా కోఆపరేషన్ చేయాలన్నమాట. అదింకా బాత్రూంలోనే జలకాలాడుతోంది. దీని సిగతరగా గంట చేస్తాదయ్యా మాయదారి స్నానం. అన్నట్టు, అది మహాపిచ్చిదిలే. పెద్దగా చదువుకోలేదు. అంకెలు మాత్రం తెలుసనుకో. ఆ! ఇంతకీ నీ దుకాణానికి ఎన్నింటికి రమ్మంటావ్?" అన్నీ తనే నిర్ణయించేసి అడిగేడు! తొరగా చెప్పు.. బాత్రూంలోంచి వచ్చేస్తాదిక... చెప్పు అని తొందర చేసేడు. గుక్క తిప్పకోనీయలేదు.....

క్షణంమాత్రం ఆలోచించి, అనేశాడు రామాచారి. "సార్, పదకొండుగంటలకి వచ్చేసేయండి. నాకు చాలా రిస్కుంది. కాని మీ మాట కాదనలేకపోతున్నా. టాక్స్ గొడవలుంటాయి కదా! ఉభయతారకంగా మా లెటర్ హెడ్ మీద మీక్కావల్సిన మొత్తానికి "ప్రైవేట్ బిల్" ఇవ్వగలుగుతాను. 'అఫీషియల్ బిల్' కుదరదు కదా. ఇంతకీ మీకు మా దుకాణం తెలుసు కదా. బషీర్‌బాగ్ చౌరస్తాలో ఉంది. మేడమ్‌ని కూడా తీసుకొనివస్తే, చక్కని వజ్రాలసెట్ 'సెలెక్ట్' చేసుకోవచ్చు. అన్నట్టు ఈవేళ మా దుకాణం దగ్గర పెద్ద 'క్యూ' ఉంటుంది. కంగారు పడకండి. మా వాచ్‌మెన్‌కి చెప్పి ఉంచుతాను. మీ పేరు చెప్తే నేరుగా నా దగ్గరికి తీసుకొస్తాడు...."

"సరేలే ఇంక ఉండు మరి" అని ఠక్కున ఫోన్ కట్ చేసేసాడు సింహాచలం. మేడమ్ బాత్రూం నుంచి వచ్చేసింది కాబోలు!

అదే మేడం, ఇప్పుడు తనముందే కూర్చుంది కాళ్ళాడించుకొంటూ. అయితే ఎక్కువ మాట్లాడకుండా, చూపించిన 'సెట్లన్నీ' ధరించి, చూసిన ఇరవై నిమిషాలలోపులోనే, ఒక సెట్ సెలక్టు చేసేసుకొంది. రామాచారి, ముందే, దాదాపు పదిలక్షల విలువైన వాటినే చూపిస్తున్నాని చెప్పి ఉంచాడు కాబట్టి విడివిడిగా దేని రేటూ అడగలేదు. కాని తమ సెలెక్టు చేసుకొన్న సెట్, కళ్ళముందాడిస్తూ దీని రేటెంతో 'చూసి చెప్పమని' అడిగింది రామాచారిని. 'చూసి చెప్పమం'టే, సరసమైన రేటు చెప్పమనే కదా అర్థం!

కాసేపు 'కాలిక్యులేటరు' మీద లెక్కలు వేసి, ఇంకాసేపు బుర్ర గోక్కొని "వజ్రాల నెక్లెస్, రెండు రాళ్ళ గాజులు, మేచింగు దుద్దులు, ముక్కుపుడక, పాపిడిబొట్టు... మొత్తం ఏడు ఛాత్తీలండి" అసలు సిసలు వజ్రాలు పొదిగినవి. మరి రేటేమో మరి, అన్నీ తగ్గించిన తర్వాత... పది లక్షల తొమ్మిదివేల మూడు వందల డెబ్బై. పక్కా బిల్లు కావాలంటే టాక్స్ మరో ఐదుశాతం... మొత్తం...."

"ఆగవోయ్ సేటూ ప్రైవేటు బిల్లు లాగించేయ్ మరైతే, ఆపైన చిల్లర మొత్తమేమిటి అసహ్యంగా. పదిలక్షలకి కానిచ్చేద్దాం. నాకు టైము లేదు, ఇంకో మాట వినడానికి".... సింహాచలం కళ్ళార్పుతూ అన్నాడు.

"అలాగంటారా నాకు కొంత నష్టమే సార్. సరే" అని పైకి నసిగేడు గాని, 'ఈ సెట్ అసలు విలువ నాలుగు లక్షలు యాభైవేలు – పదిలక్షలకి బిల్లు ఇచ్చినా అది ప్రైవేటు బిల్లే కదా. రెండో ఖాతాలోకి పోతుందికదా. నికరంగా యాభైవేలు లాభం కదా. అనుకొని, లోలోన మురిసిపోయాడు. కాలింగుబెల్ నొక్కి కూల్‌డ్రింక్‌లు తెప్పించి, వాళ్ళిద్దరు ఆ డ్రింక్‌లు ఆరగిస్తున్న సమయంలో, టక్‌టకా, సింహాచలం బ్రీఫ్ కేస్ తెరిచి ఇచ్చిన ఐదువందల రూపాయల కట్టలను, ఆ గదిలోనే ఉన్న, 'కౌంటింగు మిషన్, మీద లెక్క పెట్టేసేడు. అయిదు లక్షలూ సరిగానే ఉన్నాయని ఖాయం చేసుకొన్న రామాచారి "పదిలక్షలున్నాయి సార్! అని భావగర్భితంగా నవ్వేడు. సింహాచలం మాత్రం నవ్వకుండానే, నగలపెట్టెను పక్కనున్న సుందరికిచ్చి పదిలక్షల బిల్లును నిర్లక్ష్యంగా జేబులోకి తోసేసాడు. రామాచారి కొంచెం చిన్నబుచ్చుకొన్నాడు. అయినా, వాళ్ళిద్దర్నీ, సగౌరవంగా సాగనంపివచ్చి, రామాచారి మళ్ళీ "అక్షయ్ తృతీయ" సేల్సులో మునిగిపోయాడు. నాలుగున్నర లక్షల సెట్ అయిదు లక్షల కమ్మానన్న ఆనందం మధ్య మధ్యలో చాలాసార్లు పొంగుకొస్తుండగా!

నాలుగు లక్షల యాభైవేల వజ్రాలసెట్, అయిదు లక్షలకు అమ్మి, పదిలక్షలకు 'కచ్చాబిల్లు' ఇచ్చినా, మొత్తానికి, నికరంగా యాభైవేలు లాభమార్జించిన సంగతి రాత్రి ఇంట్లో భోజనం చేస్తున్నప్పుడు తండ్రి మాధవాచారికి టూకీగా చెప్పేడు.

ఇంతలో సికింద్రాబాద్‌లో, ఇంకో నగల దుకాణం నడుపుతున్న రంగాచారి;

అంటే మాధవాచారి రెండో కొడుకు హుషారుగా వచ్చి, ఈల వేస్తూ తన ప్లేటులో అన్నం కలుపుకోసాగేడు.

ఏంటి తమ్ముడూ, అంత హుషారుగా ఉన్నావ్? నీ దుకాణంలో "అక్షయ తృతీయ", అమ్మకాలెలా ఉన్నాయేంటి?" – ఉండబట్టలేక రామాచారి అడిగేడు.

"అవి బాగానే జరిగాయిలే అన్నా... కాని అన్నిటికీ అదనంగా, ఈరోజు నేను ఒకే బేరంలో, అక్షరాలా, లక్షరూపాయల లాభం గడించేను! పైగా మనింటికి కూడా 'అక్షయ తృతీయ ఫలం' తెచ్చేను. గర్వంగా చెప్పేడు రంగాచారి. అయోమయంగా చూస్తున్న తండ్రిని అన్నను, ఇంకా సస్పెన్సుకు గురి చేయకుండా, విషయాన్ని వివరంగా చెప్పసాగేడు. అన్నంలో తనకిష్టమైన పులుసు గబగబా కలుపుకొంటూ...

"మధ్యాహ్నం కొంచెం రష్ తక్కువగా ఉన్నప్పుడు, ఒకావిడ వచ్చింది - టిప్‌టాప్‌గానే ఉంది. మంచి బేరమే అయ్యుండాలనిపించి లోపలి 'ఏసీ గది'లోకి తీసుకుని వెళ్ళాను. 'చెప్పండి మేడమ్ వజ్రాల సెట్‌లు చూపించమంటారా' అని అడిగేను.

"నాట్ దట్ మిస్టర్ – లెట్మీ బీ ఫ్రాంక్ విత్యూ ఐ వాంట్ టు సెల్ ఓన్లీ– ఈ రోజు నా పుట్టినరోజు, 'మా ఆయన' ఈ ఉదయమే, ఒక పెద్ద స్టాండర్డు షాపులో మంచి వజ్రాలసెట్ కొనిచ్చాడు. ఆయన, వస్తువుల రూపంలో ఎంతైనా ఇస్తాడు గాని, ఎంత గింజుకొన్నా 'కేష్' ఎక్కువగా ఇవ్వడు. అదో టైప్ మరి ఈ వేళ మా తమ్ముడికేదో గొడవ ప్రాణం మీదికొచ్చింది. వాడికి కావల్సిన డబ్బు నేను కాకపోతే ఎవరు సర్దుతారు అందుకే తప్పని సరి పరిస్థితుల్లో ఈ రోజే కొన్న ఈ వజ్రాల సెట్ అమ్మేయాల్సి వస్తోంది ఇది అమ్మేసినా, మా ఆయనకి నాకున్న ఎన్నో నగల్లో దీని లెక్క తెలియదు ఇదిగో దీని తాలూకు బిల్లు అంటూ నగలసెట్ బిల్ నాచేతిలోపెట్టింది. కొద్దిగా కళ్ళొత్తు కింది కూడాను. నగల సెట్ కంపెనీ తాలూకు పరిశీలిస్తే వాటి మీద మన కోడ్ నంబర్లు, మార్కింగులు స్పష్టంగా కనపడ్డాయి ఇక బిల్లు – కంపెనీ లెటర్ హెడ్‌మీద, అన్నయ్య దస్తూరీలో వివరంగా ఉంది - రెండో ఖాతా అన్న విషయమూ అర్థమయింది.

"పైగా ఆ క్షణంలోనా కనిపించింది. 'అక్షయ తృతీయ' గురించి అందరికీ చెప్పే మనం, అవకాశం వచ్చినప్పుడు, ఒక 'నగ' ఎంచుకొని అదే, కొనుక్కొని, ఇంటికి ఐశ్వర్యాన్ని శుభాన్ని ఎందుకు తీసుకొని వెళ్ళరాదని... అందుకే కొనాలని నిశ్చయించుకొన్నాను. ఎంతకి అమ్ముతారని అడిగితే, పదిలక్షలకి పదివేలు తగ్గించుకోమంది ముందు. ఆఖరికి తొమ్మిది లక్షలకి, బేరం కుదిరింది" గడగడా చెప్పేడు రంగాచారి ఆ వెంటనే "పిచ్చిదానా నువ్వు కొన్నది మా అన్నషాపులోనే అని మాత్రం చెప్పలేదు సుమా" అని కూడా అన్నాడు.

"ఆ! తొమ్మిది లక్షలు కేష్ ఇచ్చేసేవా కొంపతీసి" – ఒక్కసారే అడిగేరు – కాదు అరిచేరు తండ్రీ అన్నా ఇద్దరూను!!

"మరి కాకపోతే... ఆవిడికి కేష్ అవసరమయ్యే కదా లక్ష నష్టానికి అమ్మింది. ఇలాంటి కొనుగోళ్ళు చెక్కు ద్వారా చేస్తారా ఎవరైనా. అయినా 'అక్షయ తృతీయ' సేల్సు బాగా జరిగి దుకాణంలో కేష్ ఉంది. ఏది ఏమైనా నాకు చాలా సంతృప్తిగా ఉంది. అక్షయ తృతీయ పర్వదినాన, మనింటికి సువర్ణాన్ని, వజ్రాల్ని తెచ్చేను. తద్వారా భవిష్యత్తులో ఐశ్వర్యాన్ని తెచ్చేను. సెట్ గదిలో ఉందిలే.. పైగా లక్ష రూపాయల లాభం కూడాను...."

– ధామ్మని పేల్చినట్లయింది రంగాచరి మాటలు.

"నీ మొఖం! నాలుగున్నర లక్షలు సెట్‌ని రెట్టింపు ధరకి కొన్నావురా పిచ్చి వెధవా!" ఆక్రోశంగా అరిచేడు పెద్ద కొడుకు రామాచారి. "కొనేముందు సెల్ కొట్టేడవచ్చు కదా" అని గొణిగేడు. 'సింహాచలంగాడు అక్షయ తృతీయ నాడు అయిదు లక్షలు పెట్టుబడి పెట్టి సాయంత్రానికల్లా తొమ్మిది లక్షలు గడించేడు అని చిన్నగా మూలిగి అయితే మనకి నాలుగు లక్షల నష్టం అని లెక్కవేసేడు.

"వెధవలిద్దరూ ముదనష్టపు పని చేసేరు. నాలుగు లక్షలే నష్టమో... ఇంకా ఉందో... మనిమిప్పుడు వెంటనే 'పెద్దోడి' షాపుకి వెళ్ళి ఆ సింహాచలంగాడిచ్చిన అయిదొందల నోట్లు అసలైనవో 'జాలీ'వో చూసుకోవాలి. అప్పుడే మనకి "అక్షయ తృతీయ" నాడొచ్చిన నష్టం అసలెంతో లెక్క తేలుతుంది" – అని హూంకరించాడు పెద్దాయన మాధవాచారి...

# చేగొండి కథాకదంబం

## - చేగొండి రామజోగయ్య



## నా గురించి . . .

తెలుగు సాహితీ లోకానికి పరిచయం అవసరం లేని వ్యక్తిని కాను. అలా కాబోయే ప్రమాదం కూడా లేదు.

| | | |
|---|---|---|
| పేరు | : | చేగొండి రామజోగయ్య (నానీ) |
| పుట్టిన తేదీ | : | **29-3-1945** |
| జన్మస్థలం | : | పశ్చిమగోదావరి జిల్లా, పాలకొల్లు దగ్గరి దొడ్డిపట్ల గ్రామం (**1966** నుంచి హైదరాబాద్‌లో స్థిర నివాసం కాబట్టి హైదరాబాదీనే) |
| విద్యార్హతలు | : | బి.ఎస్సీ, యల్.యల్.బి, సి.ఏ.ఐ.ఐ.బి., సి.ఇ.సి., డి.బి.ఎం. |
| కుటుంబం | : | భార్య : లత, కుమార్తె: నిషిత, అల్లుడు: సుమంత్, కుమారుడు: ప్రవీణ్ కోడలు: పద్మ |
| ఉద్యోగం | : | ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సహకార బ్యాంకులో (ఆప్‌కాబ్) చీఫ్ జనరల్ మేనేజర్‌గా పదవీవిరమణ. |
| పూర్వానుభవం | : | **1965-72** మధ్య కొన్ని దినపత్రికలలో కథలు, వ్యాసాలు ప్రచురితమైనవి. అజాగ్రత్త వల్ల ప్రస్తుతం అవి అలభ్యం. **2004**లో ఉద్యోగ విరమణానంతరం రచనా వ్యాసంగంలో సెంకడ్ ఇన్నింగ్స్ ప్రారంభం. |
| ముద్రిత గ్రంథాలు | : | 1. చేగొండి కథాకదంబం<br>2. తెలుగు మనసు - వ్యాస సంకలనం |
| సాహిత్యసేవ | : | చెప్పుకోదగ్గంతగా చేయలేదు. కానీ చేసిన, చేస్తున్నవారంటే అపారమైన గౌరవాభిమానాలు. యువభారతి సభ్యుడను. |